దళితుల అసలు జాతి

# నాగులు



(నాటి నాగులే నేటి దళితులు)

ర చ యి త

భూపతి నారాయణమూర్తి

రచనా కాలం ; **1990-1993**

ప్రచురణ : **1995**



ముఖచిత్రం :

నాగరాజు చిత్రం 1200 సం॥రాల నాటి చాళుక్యుల శిల్పం నుండి శ్రీ వత్స గారిచే గీయబడింది.



ప్రతులకు :
భూపతి నారాయణమూర్తి
మలికిపురం, తూ॥గో॥ జిల్లా - 533253.

ప్రచురణ :
తెలుగు ప్రజాసమితి

ధర : రు॥ 20-00లు

# అంకితం



పాతికేళ్ళయినా నిండని వసిడి వయసులో
ఆకస్మికంగా కన్నుమూసిన నా మేనకోడలు
అల్లాడి పద్మశ్రీ స్మృతికి

- రచయిత

విద్యార్థి దశ నుండి
పీడిత ప్రజల పక్షాన నిలిచిన
ఆదర్శజీవి, స్నేహశీలి
అమరుడు డా॥ భాస్కరరావు



ఈ గ్రంథ రచనకు తోడ్పడిన
వీరి సతీమణి భాగ్యలక్ష్మికి
నా కృతజ్ఞతలు

— రచయిత

## -: మనవి :-

నాగులు గురించి 10 సం॥ రాలుగా అధ్యయనం చేస్తూవచ్చాను. దీనిపై గతంలో నాచే రాయబడ్డ "తెలుగుజాతి – తెలుగు జాతీయత" అనే పుస్తకంలో "నాగుల నిజ చరిత్ర" అనే అంశంలో కొంత వివరించాను. డా॥ అంబేద్కర్ రచనలు నాగుల గురించి కొన్ని అమూల్యాభిప్రాయాలు వెల్లడించాయి. చరిత్రలో ఎంతో ప్రసిద్ధి గాంచిన "నాటి నాగుల వారసులు నేటి దళితులే! అనేది తేలింది. అయితే దీనిపై ఆంధ్రజ్యోతి సబ్ ఎడిటర్ బహుభాషా కోవిదుడు బుద్ధిజంపై ఎంతో అధ్యయనం చేసిన శ్రీ గడియారం శ్రీ వత్సగారితో కొన్నిసార్లు చర్చలు జరిపాను. ఆ చర్చలో వారిచ్చిన సూచనలీరచనకు కొంత ఉపకరించాయి.

హిందూ మత సాహిత్యంలో రాక్షసులుగా వర్ణించబడ్డ వారంతా నాగులు లేదా నాగజాతికి చెందిన ఉపజాతుల వారేనని బోధపడింది. రాక్షసులు అనగా అసలు అర్థం రక్షింపబడేవారని అర్థం. యీ అర్థాన్ని తారుమారు చేసి రాక్షసులనగా క్రూరులు, భయంకరాకారం గలవారుగా వైదిక గ్రంథాలు చిత్రించాయి. గత చరిత్ర నిండా కిరాతకులైన రాజులను వీరులుగా చిత్రించారు. అబద్ధాలు, మోసాలు, చేసి కృత్రిమంగా బ్రతికే మోటారి పురోహితులను పవిత్రులుగా వర్ణించారు. అవే నేటి ఆధునిక యుగంలో కొనసాగించడం ఘోరమని చెప్పాలి. గను చరిత్రలన్నీ తిరిగి రాయాల్సిన అవసరం ఏర్పడింది. నాగుల మొత్తం చరిత్ర చెప్పడం యీ రచన ఉద్దేశం కాదు. కేవలం కొన్ని ప్రాథమిక విషయాలకే యిది పరిమితం.

ఈ రచనకు నన్ను ప్రోత్సాహించిన మిత్రులకు, ముందుమాట, కవరు పేజీ రాసి యిచ్చిన శ్రీవత్సగారికి, ఈ పుస్తక ప్రచురణకు తోడ్పడిన మిత్రులు, శ్రీ టి. రాజా రెడ్డియార్ బ్రదర్స్ (చింతలపల్లి) శ్రీ పి. రామారావు (అక్కివరం) శ్రీ ఎ. విక్టర్‌బాబు (రంప ఎర్రంపాలెం) గార్లకు ఈ పుస్తక ప్రింటింగుకు శ్రద్ధ వహించిన శ్రీ కడలి సత్యనారాయణ మూర్తి గార్లకు నా కృతజ్ఞతాభి వందనాలు.

నా చిత్తు ప్రతిని పెయిర్ కాపీ రాసి యిచ్చిన విద్యార్థి మిత్రుడు టి. ప్రతాప్ కుమార్‌కు నా కృతజ్ఞతలు.

ఇట్లు

రచయిత

# నాగస్వరం

మానవ నాగరికత ఓ మహా జలపాతమై రూపుదిద్దుకుంటున్న వేళ, సంస్కృతి ఓ ఉద్యానవనమై పరిమళాలు విరజిమ్మే సమయాన కృష్ణా, తుంగభద్రా నదుల మధ్యనున్న నడిగడ్డసీమ పురటి నొప్పులు పడింది. తొలి నాగరికత ప్రభవించింది.

ఆదిమ మానవుడి తొలి చిత్ర రచనా శిల్పం, కర్నూలు జిల్లా బిల్లసర్గం గుహల్లో పల్లవించింది.

తొలి మానవుడి ఖనిజశాస్త్రం నడిగడ్డసీమలో స్వర్ణమై భాసించింది.

గౌతమబుద్ధుడు ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి ధర్మప్రచారం ప్రారంభించిన తొలినాళ్ళలోనే తెలుగునాట మూలక అస్సక జనపదాలు ప్రజాస్వామ్యంగా జీవిస్తున్నాయి. మహాభారతం "ఆంధ్రశ్చబహువః" అని పేర్కొన్నది.

తెలుగు, నాగ, యక్ష, మహిషక, మూషక, జాంబవ, కళింగ, కదంబ, మూలక, అస్సక, ఆంధ్ర తెగలన్నీ కలసిపోయి "తెలుగుజాతి" యేర్పడింది. ఎక్కడ ఎప్పుడు తెగల సమాఖ్య యేర్పడుతుందో అక్కడ అప్పుడు జగజ్జేతల జాతి తయారవుతుంది.

చరిత్రలో మొట్టమొదట తెగల సమాఖ్య తెలుగువారిదే. కాబట్టే యిండియా తూర్పుతీరమంతా, ఆగ్నేయాసియా ద్వీప సముదాయమంతా తెలుగువారి యేలుబడిలోకి వచ్చింది.

కావేరి నుండి అరకాన్ నది (బర్మా) దాకా "మహా తెలంగాణా" విస్తరించింది. సంఖ్యాపూర్వపదంగా (ద్విగు) వున్న ఏ నగరమైన తెలుగువారిదేనని నిరూపించాడు ఇటలీకి చెందిన ప్రాచీన భౌగోళిక శాస్త్రవేత్త జెరనీ

ఆ తర్వాత హిందూధర్మం పేరుతో, సంప్రదాయ పరిరక్షణ పేరుతో జరిగినదంతా తెలుగు విధ్వంసమే.

శివుడు ఆర్యదేవుడై పోయాడు. "మాతంగ కన్య" పార్వతి ఆర్యగా దాక్షాయణిగా మారిపోయింది.

మూడు విభాగాలుగా వున్న తెలంగాణాలోని మూడు ముఖ్య పట్టణాల విధ్వంసం "త్రిపురాసుర సంహారం"గా కీర్తించబడింది. ఆర్య దేవగణాలన్నీ కూడబలుక్కుని తెలుగువారి మీద కత్తిగట్టాయి.

ఏ ఆర్య దేవుడికైన "నాగ" జాతిని అణగదొక్కడమే కీర్తి పతాక
మయింది. ఆదిశేషుడు విష్ణువు పరుపైయ్యాడు, కృష్ణుడు కాళీయ మర్దనం
చేశాడు. శివుడు పామును మెడలో ధరించాడు. ఇలా నాగజాతి మీద అధి
కారం దైవత్వానికి ప్రాతిపదిక అయింది.

భారతదేశంలో బానిస వ్యాపారం అంటే తెలుగు వారిని (నాగులను)
అమ్మడమే. అందుకే వారు పణ్యాలైయ్యారు. వారిని అమ్మే స్థలం విప
ణిగా మారింది.

బౌద్ధం వచ్చేంతదాకా ఆర్యులు నాగజాతిని ధ్వంసం చేయడమే పనిగా
పెట్టుకున్నారు. పరీక్షిత్తు చేసిన "సర్పయాగాన్ని" గుర్తుకు తెచ్చుకోండి.

బౌద్ధాన్ని ఓ ప్రతిఘటనా ఉద్యమంగా స్వీకరించిన నాగులు, బౌద్ధ
ప్రచారకులుగా మారారు. బౌద్ధాన్ని ప్రపంచ ధర్మంగా మార్చారు.

క్రీస్తు శకం 1వ శతాబ్దంలో ప్రారంభమైన నిరంకుశ బ్రాహ్మణీకరణ
తెలుగు సామ్రాజ్యాన్ని "కుక్కలు చింపిన విస్తరి" చేసింది.

తెలుగుజాతి బ్రాహ్మణ గ్రహణంలో చిక్కుకుని పోయింది. తెలుగు
తెగల సమాఖ్య ఇండియా అంతటా విస్తరించింది. కులం యెరుగని జాతి
సంస్కృతీ కులాల కూపంలో అఘోరించడమూ మొదలైంది.

ఇతర ప్రాంతాలలోని భూమి పుత్రులతో కలిసి, అసలు పౌరులందరినీ
నాగులని పేర్కొన్నారు. శ్రీ భూపతి నారాయణమూర్తి. నాగులు సామాజిక
సాంస్కృతిక, రాజకీయ, వత్తిడుల కింద నలిగి దళితులుగా, తిరస్కృత,
బహిష్కృత ప్రజలుగా చరిత్ర యెరుగని స్థితిలో ఉండిపోయారు.

దళితులను మళ్ళీ చరిత్ర వంతులను చేయడానికి, జాతి చరిత్రలో వీరి
మహోన్నత భాగస్వామ్యాన్ని ఎరుక పరచడానికి చేస్తున్న ఈ చిరు ప్రయ
త్నాన్ని తెలుగుజాతి యావత్తు సహృదయంతో స్వాగతం పలుకుతుందని
ఆశిస్తున్నాము.

ఏ యూనివర్సిటీ విద్యలేకుండానే ప్రజా సంస్కృతిని పరిశోధించ
డంలో ముందంజ వేసిన జ్ఞాన, వయో వృద్ధులు శ్రీ భూపతి నారాయణ
మూర్తి గారికి తెలుగు చరిత్ర, సంస్కృతి విద్యార్థుల పక్షాన కృతజ్ఞతలు
తెలుపుకుంటున్నాము.

- గడియారం శ్రీవత్స

5-2-95

ఆదివారం ఆంధ్రజ్యోతి

విజయవాడ-10

# * ఉపోద్ఘాతం *

భారతీయ సంస్కృతి అనగా ఆర్య సంస్కృతిగానూ, ఆర్య సంస్కృతి అనగా హిందూమత సంస్కృతిగాను చెప్పడం పరిపాటి అయ్యింది. సుదీర్ఘ కాలంనుండి ఒక పథకం ప్రకారం అగ్రకులాలు ప్రచారంలో పెట్టడం ఈ ప్రచారం ప్రజలను మతమౌఢ్యులుగా జడప్రాయులుగా తయారుచేసింది.

సంస్కృతి అనగా రాజకీయ, ఆర్థిక, సామాజిక, తాత్విక భావాలు, భాష తదితర ఆచార వ్యవహారాలు వగైరా భౌతిక, సంబంధమైన భావన విధానము సంస్కారమొందినదానినే సంస్కృతి అంటాం. అంతేగాని మత పరమైన ఆధ్యాత్మిక భావజాలాన్ని సంస్కృతిగా చెప్పడం సమంజసంకాదు, భారత సంస్కృతి అంటూ ఏదీలేదు. ఈ భారత ఉపఖండంలో వివిధ జాతుల సంస్కృతులే వున్నాయి. ఒకజాతి సంస్కృతికి మరోజాతి భిన్నంగా వుంది. మనతెలుగుజాతిసంస్కృతి మరోజాతులసంస్కృతులకు భిన్నంగావుంది. దీనర్థం వివిధ జాతుల సంస్కృతులమధ్య చేధించరాని అడ్డుగోడలు ఉన్నా యనికాదు. ఒక్కొక్క దశలో ఒకజాతి సంస్కృతి మరోజాతి సంస్కృతిలో లీనమవుతుంది. ఆర్థిక రాజకీయ పరిస్థితులు మారేకొలదీ వివిధ సంస్కృతుల మధ్య సమన్వయం మార్పులు-చేర్పులు సంభవమే.

ప్రాచీన కాలంనుంచి నేటివరకు పరిశీలిస్తే ఒకజాతిలో మరోజాతి, ఒక తెగలో మరోతెగ లీనమైనాయి. అలాగే వివిధ సంస్కృతులు మిళితమై మరో నూతన సంస్కృతి ఆవిర్భవించింది. యిది ప్రపంచవ్యాప్తంగానే సాగింది. మనకూ కొత్తేమీకాదు.

లక్షలాది సంవత్సరాలక్రితం భారత ఉపఖండానికి చేరిన అనేక తెగలు కావాలని వచ్చినవికాదు. ఆదిమానవులు తెగలు తెగలుగా జట్లుజట్లుగా దబదబాలుగా భూగోళమంతా సంచరించారు. ఆహార సేకరణకు, వాతావరణ భద్రతకొరకు అనువైన ప్రదేశాలకొరకు నేల నాలుగు చెరగులా తిరుగుతుం డేవారు. ఎక్కడ వీలుంటే అక్కడ స్థిరపడ్డారు. అనేక తెగలు, జాతులు, స్థానిక జాతులతో విలీనమైపోయాయి. గాని యిక్కడ గమనించాల్సినదేమంటే ఆర్య తెగలుమాత్రం యిక్కడ స్థానికులతో విలీనం కాలేదు. ఎన్ని వేషాలు మార్చినా తమ సంస్కృతిని యిక్కడ ప్రజలపై రుద్దడానికే చూచారు. యిక

ఇది సాధ్యంకాదని తేలినపుడే వర్ణ వ్యవస్థ, కులవ్యవస్థ ప్రవేశపెట్టబడింది. పైకి అందరూ ఒక్కటిగానే కనిపించినా అగ్రకులాలు - దళితకులాలు అనే రెండు శిబిరాలుగా సమాజం చీలిపోయింది. కులానికో సంస్కృతి అవిర్భవించింది. దీనంతటికి బ్రాహ్మణిజమే ప్రధాన కారణం.

ఇటీవలవరకూ భారత ఉపఖండంలోని చరిత్రలన్నీ ఆర్య బ్రాహ్మణులచేత మత, కులపరంగా సృష్టించబడ్డవే. అత్యధిక ప్రజల భాషను, చరిత్రను అణచివేశారు. గనుక చరిత్రలన్నీ అగ్రకులాల పరంగా రాయబడ్డాయనేది వేరే చెప్పనవసరంలేదు.

ఈ ఉపఖండానికి మొదట ఆస్ట్రిలాయిడ్ తెగలవారు, అటుపిమ్మట నీగ్రోరాయిడ్, ఆతర్వాత ఇండో-ఆర్యులు వచ్చారని నిన్నమొన్నటివరకూ చరిత్రలు రాసిపారేశారు. అవే యదార్థాలని ప్రజలు నమ్మారు. 1927లో సింధునాగరికత (హరప్పా, మొహంజదారో) వెలుగులోకి వచ్చాక అంతకు ముందు చరిత్రలన్నీ తల్లక్రిందులయ్యాయి. ఈ సింధూనాగరికత నాగులదని పురాతత్వ శాస్త్రవేత్తలు, చరిత్రకారులు నిర్ధారించారు. దీనితో ఆర్యులు వచ్చాకనే ఇక్కడ స్థానికులకు నాగరికత నేర్పినట్లు రాసినరాతలు కోతలుగా మిగిలిపోయాయి. దీనితో అగ్రకుల చరిత్రకారులు మరో కొత్త పల్లవి పాడ ప్రారంభించారు. ''ఆర్యులు యిచ్చటివారేనని ముస్లింములు మాత్రమే విదేశీయులని వాళ్ళతో మనకు కుదరదని మతపరంగా యుద్ధం ప్రకటించారు. భారత ఉపఖండం మతపరంగా చీలిపోయింది. ఫలితంగా ఉపఖండమంతా రక్తసిక్తమయింది. యిది అంతా తెలిసిందే.

సమాజంలో అధిక సంఖ్యాకులైన దళితులను తరతరాలనుండి అణగద్రొక్కి దోపిడీ చేయడం నాటినుండి నేటికీ కొనసాగుతూనేవుంది. దీనికి తార్కాణం అత్యున్నతస్థాయి దళిత ఉద్దండులచే తయారుచేయించిన మండల్ కమీషను నివేదికను ఈనాటికి యధాతధంగా ఆమోదించకుండా చేస్తున్నారు. అట్టడుగున అణగారిన కులాలకోసం నిర్ణయించిన రిజర్వేషన్లకు వ్యతిరేకంగా రక్తపాతంతో కూడిన హింసావుద్యమాలను నడిపారు. 85%మంది వున్న దళితులకు (బి.సి. యస్.సి. యస్.టి.) 50% సీట్లుమాత్రమే కేటాయించారు 15% అగ్రకులాలకు, 50% కేటాయించారు. (సుప్రీంకోర్టు పక్షపాతం తీర్పు ప్రకారం) ఈ 15మందిలోను పేదలు 5శాతం మాత్రమే వున్నారు.

మిగిలిన 10మంది అగ్రకులాల చేతుల్లోను సమస్త సంపదలు సర్వ అధికారాలున్నాయి. అయినా రిజర్వేషన్లు రద్దుకావాలని మొత్తము అన్నీ తమకే కావాలనే ధోరణిలో వ్యవహరిస్తున్నారు.

భారత ప్రభుత్వాలు చేసిన గరిష్ట భూచట్టాలు చెల్లవని కోర్టులు తీర్పులు యిస్తున్నాయి. దళితులకు భూములు దక్కకుండా చేయడమే వారి "లక్ష్యం". పూజారి ఉద్యోగాలలో దళితులు పనికిరారని సుప్రీంకోర్టుచేత తీర్పు ఇప్పించుకున్నారు. చట్టప్రకారం కేటాయించిన రిజర్వేషన్లు లక్షలాది సీట్లు భర్తీ చేయడంలేదు. దళితులపై రోజురోజుకీ అత్యాచారాలు, దమనకాండ యధేచ్ఛగా సాగడం వగైరా చర్యలన్నీ నాటి మను (అ) ధర్మశాస్త్ర కొనసాగింపే తప్పవేరుకాదు. దీనికితోడు ఈ అగ్రకుల అహంకారులు భూస్వామ్య, స్వదేశీ - విదేశీ గుత్త సంస్థల కొమ్ము కాస్తున్నారు, ఫలితంగా ధరలు పెరిగి దోపిడీ పెరిగి దళితులు మరింత దరిద్రులు అవుతున్నారు. ఈ దోపిడీకి, అణచివేతకు వ్యతిరేకంగా నిలచిన ప్రజలను పాశవికంగా పోలీసులు, మిలటరీ దాడులకు గురిచేస్తున్నారు. దీనికి తోడు బి. జె. పి. తదితర మత సంస్థలు మతంపేర మందిరం పేరిట రక్తపాతాన్ని సృష్టిస్తున్నారు. తమవర్గ వర్ణదోపిడీని కప్పిపుచ్చుకోవడానికి మతాన్ని మందిరాన్ని అడ్డుపెడుతున్నారు. ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారు. వీటిని దృష్టిలోపెట్టుకుని చరిత్రగతిని పరిశీలించాల్సివచ్చింది. గనుక గత చరిత్ర వాస్తవాలు వెలికి తీయక తప్పదు. అగ్రకులాలకు చెందిన వారంతా దళితులకు శత్రువులుకారు. అభ్యుదయ వాదులు, దళిత శ్రేయోభిలాషులు ఏకులానికి చెందినా దళితులు పూజ్యభావంతోనే ఆహ్వానిస్తారు. కులనిర్మూలనే దళితుల లక్ష్యం. యీ దృష్టినుండే దళితుల చరిత్రను త్రవ్వి బయటకుతీసి దళితులను చైతన్యవంతును చేయాల్సివుంది. ఎవరు ఎక్కడనుండి, ఎప్పుడు వచ్చినా యిక్కడ స్థిరపడ్డవారంతా భారత జాతులకు చెందినట్లే లెక్క. ఇక్కడ సమస్య ఏమంటే చరిత్ర వాస్తవాలు నిలదీయడమే.

## జాతి స్పందన

ప్రపంచంలో ప్రతివ్యక్తి ఎదో జాతికి లేదా తెగకు చెందివుంటాడు. మానవులు సమిష్టిశ్రమ రూపంలోనే తమ మనుగడను సాగిస్తారు. ఏకాకిగా ఏ వ్యక్తి మనలేడు. తండా, తెగ, కులం, మతం, వృత్తి వగైరా చిన్నచిన్న

సంస్కృతి రూపాల్ని చిన్నచిన్న భూ ఆవరణలను అధిగమించి జీవన సంబంధాల మెరుగుకోసం ఎన్నోవేల సంవత్సరాల పరిణామక్రమంలో ఒక సువిశాల భూభాగంలో జాతి అనేది ఆవిర్భవించింది. ప్రపంచంలో ఇప్పటికి పెరిగి పరిణామం చెందిన మానవ సమాజ రూపమే జాతి. మరింత వివరంగా చూస్తే సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, మానసిక భాషా సంబంధమైన ఉమ్మడి వ్యవస్థారూపమే జాతి. చరిత్రలో చిన్నచిన్న గుంపులు, తెగలు పెద్దదానితో కలసిపోవడం ఒకజాతి మరోజాతిని ఓడించి బానిసలుగా చేసుకోవడం పెద్ద జాతి చిన్నదానిని ఓడించి సర్వనాశనం చేయడం కొన్ని చిన్నజాతులు ఇచ్ఛాపూర్వకంగా పెద్దజాతిలో విలీనం కావడం లాంటి ఎన్నో సంఘటనలు చరిత్రలో జరిగిపోయాయి. ఆధునికయుగం ప్రారంభమయ్యేవరకు వివిధ జాతుల్లో అనేక మార్పులు చేర్పులు జరుగుతూ నేవచ్చాయి. ప్రపంచంలో చివరకు అత్యధిక జాతులు ఒకపేరు, ఒక భూఖండం, ఒక ప్రత్యేక భాష, సంస్కృతులతో స్థిరపడ్డాయి. రాచరిక వ్యవస్థ, దాని తరువాత వచ్చిన సామ్రాజ్యవాద వ్యవస్థల మూలకంగా అనేక జాతులు తమ స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కోల్పోయాయి. ఇవి అందరికి తెలిసిందే. 20వ శతాబ్దం ప్రారంభంనుండి జాతులు తమ స్వాతంత్ర్యంకోసం జాతి పోరాటాలు ప్రారంభించాయి. అనేక జాతులు స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నాయి. మిగిలిన జాతులు స్వేచ్ఛకోసం పోరాడుతూనే ఉన్నాయి. ఒక జాతిని మరోజాతి దాడిచేసి, అణిచివేసేరోజులు అంతరిస్తున్నాయి. కొన్ని జాతులకు స్వాతంత్రం లేకపోయినా వాటికి ఒకపేరు వూరు, భాషా సంస్కృతులు ఉన్నాయి.

ఈ సందర్భంలో ఇక్కడ మనకు కావలసిందేమంటే తెలుగునాట దళితులుగా వున్న షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన కులాలు ఇతర ముస్లిం, క్రైస్తవ మత మార్పిడి జనం మొత్తం కలసి 85 శాతం! అత్యధిక జనాభాకు ఒకజాతి అంటూ ఏదీలేదు. అనగా లేకుండా చేసారు, అందుకే డా॥ అంబేద్కర్ ఇలా అన్నారు. "కులవ్యవస్థ మనుష్యులను జాతి రీత్యా విభజింపబడలేదు. అది జాతిలోనే ప్రజలను సాంఘికంగా విభజిస్తుందనేది రాజకీయ పార్టీలు గుర్తించాలి." అంతేకాదు ఈ దళిత వర్గాలకు పూర్వయుగంలో మహోన్నత చరిత్ర సంస్కృతి ఉండేదన్న స్పృహ లేకుండా చేసారు. ప్రతిజాతికి దానికి తగిన ఏదో ఒక చరిత్ర వుంటుంది. చరిత్రలేని జాతి అరుదు. చరిత్ర మచ్చిపోయిన జాతికి భవిష్యత్తు లేదంటారు.

అందుచేతనే భారత ఉపఖండంలోని దళితులకు భవిష్యత్ లేకుండాపోయింది. ఆర్యులు ఇక్కడకు వచ్చాకనే దళితులకు సంబంధించిన చరిత్రను సర్వ నాశనం చేసారు, నామరూపాలు లేకుండా ధ్వంసం చేసారు. ఆర్యులు చరిత్ర లన్నీ తారుమారు చేసారు. ఇలా తరతరాలుగా సాగిపోయింది. చివరకు జడ ప్రాయులుగా మారిపోయారు. దళితులు తాము సృష్టిలో ఇలాగే పుట్టామను కుంటున్నారు. దీనికితోడు ఆర్యులు కల్పించిన కర్మసిద్ధాంతం మరింత శృంగ దీసింది. చరిత్ర రచన జాతి పురోభివృద్ధికి తోడ్పడుతుంది. హిందువులైన అగ్రకులాలు వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు రామాయణ భారతం వంటి ఇతిహాసాలు టన్నులకొలది సాహిత్యం సృష్టించుకున్నారు. దానిని దళిత వర్గాల నెత్తిన రుద్దారు. ఒకజాతి ధైర్యంగా నిలబడటానికి చరిత్ర ఆ జాతి యొక్క చరిత్ర వెన్నెముకలా పనిచేస్తుంది. మానవుని అభివృద్ధి పరంపరంగా వచ్చిన అనుభవాల మీదను, జ్ఞానం మీదను ఆధారపడివుంది. దళితులు తరతరాలుగా తమ వారసులకి ఇచ్చిందేమీలేదు. వారసత్వంగా ఇచ్చిందల్లా అంటరానితనం, అజ్ఞానం, ఆకలిమంటలు, అంధకారం, వెట్టిచాకిరి లాంటివి మాత్రమే !

ప్రపంచంలో అనేక జాతులు అనేక విధాల పరిణామం చెందాయి. శాస్త్ర, సాంకేతిక విజ్ఞానం పరుగులు ఉరకలతో శరవేగంగా ముందుకు పోతున్న ఈఅణుయుగంలోకూడా దళితులు మార్పులేని మైలురాళ్ళుగా వుండి పోయారు. (ఇటీవలనే జరిగిన కొంత అభివృద్ధితప్ప) దళితులు తమకుతాము హీనపర్చుకునే విధంగా బ్రెయిన్‌వాష్ చేయబడ్డారు. తాము తెలుసుకున్న అను భవాలను జ్ఞానాన్ని తమసంతతికి తెలియపర్చుకోవడానికి తమ తండ్రులు తమ బిడ్డలకు వారసత్వంగా అందజేసే సంస్కృతిని కాపాడుకోవడానికి చరిత్ర రచన ఎంతో అవసరం. ప్రపంచంలోనే మొట్టమొదటి భాషను కనిపెట్టిన ఈ దళితులకు భాషమీద హక్కులేకుండా చేసారు. చదువుకుంటే చెవుల్లో సీసం కాసిపోశారు! ఇక చరిత్ర ఎక్కడనుండి వస్తుంది?

ప్రపంచంలో అణగారిన జాతులు తిరుగుబాట్లు సాగించి తమహక్కులు కాపాడుకున్న సంఘటనలు కోకొల్లలు, గాని భరత ఖండంలోని దళితులపై ఎంతో క్రూరమైన, నికృష్టమైన శిక్షలు, ఆంక్షలు విదించినా ఏలాంటిస్పందన లేకుండాపోవడం, తిరుగుబాటు స్వభావం రాకుండాపోవడం విచిత్రమైన విషయం. తమ పూర్వులు పూర్వయుగాల్లో ఏవిధంగా జీవించారో ఎట్టి ఫలి

తాలను పొందారో లేక ఏలాంటి ఘనకార్యాలు సాధించారో ఆనాడు ఎట్టి నాగరికత, విజ్ఞానం, రాజకీయ ఔన్నత్యంపొందారో తెలుసుకుని వాటినుండి పాఠాలుతీసి యింతకుమించిన మరింత మెరుగైన జీవనవిధానంకొరకు పోరాడ లనేది ప్రతి జాతియొక్క కర్తవ్యం. ఈకర్తవ్యం దళితులేనాడో జారవిడచు కున్నారు. అందుచేతనే అడుగంటిపోయారు.

కొన్ని సందర్భాలలో ఒక ప్రాచీనజాతి కారణాంతరాలవలన హీన స్థితికిలోనై పేరుప్రతిష్ఠలులేకుండా క్షీణించి ఉన్నప్పుడు అట్టి జాతియందు ఆత్మవిశ్వాసం, కార్యదీక్ష, అభ్యుదయకాంక్ష పెంపొందించుకొనుటకు ప్రాచీన చరిత్ర అవసరం. దళితుల ప్రాచీన చరిత్ర అనగానే దళితుల జాతి పేరు ఏమిటి? అనేదిముఖ్యం. ఒకజాతికి ఉన్న పేరు సహజమా! కల్పితమా! ఆపేరును ఆజాతి తనకుతాను సృష్టించుకున్నదా? లేక యితర జాతులచేత, తమ శత్రువులచేత పెట్టబడిందా? అట్టిజాతి నామంవల్ల లభించిన లేదా అనుభ వించిన కష్టనష్టాలు చరిత్ర అంశాలుగా కొలబద్దగా ఉండాలి. ఈ దృష్టితో చూచినప్పుడు దళితులకు ఈనాడున్న ఎస్.సి, ఎస్.టి, బి.సి, లేదా మాల, మాదిగలు, పంచములు, ఆదిఆంధ్రులు, ఆదిద్రావిడులు హరిజనులు వగైరా పేర్లు శత్రువులచేతనే పెట్టబడ్డాయి. అనగా అగ్రకులాల చేతనే సృష్టించబడి అంటగట్టబడ్డాయి. ఇవి తలాతోకలేని పేర్లు. యివన్ని మధ్యకాలంలో పుట్టు కొచ్చినవే. కనుక ప్రాచీనకాలంలో దళితులజాతి పేరు ఏది ? అనేది చాల ముఖ్యం. అలాగే ఈదళితులు జన్మస్థానం ఎక్కడ? ఎక్కడనుండైనా వలస వచ్చారా? లేక యిక్కడే పుట్టిపెరిగారా ! ఎక్కడెక్కడ తిరిగారు ! చివరకు ఎక్కడ ఎలాగు స్థిరపడ్డారు? వీరు నివశించిన భూభాగాలు, రాజ్యపాలనలో వీరిపాత్ర వగైరా పరిశోధించడం మరింత అవసరం. అలాగే ఎంతోప్రాచీన చరిత్రకలిగిన దళితులు నేడు యిలా మారడానికిగల మూలకారణాలను శోధించాలి. ఈ విషయంలో డా॥ అంబేద్కర్ అంతులేని పరిశోధన సమా చార సంపదను మనకు వదలిపెట్టి వెళ్ళారు. ఆయన చరిత్ర పరిశోధన భారత ఉపఖండం మొత్తంగా వర్తిస్తుంది. ఆయన పరిశోధనాంశాలను ఆయా రాష్ట్రాలకు జాతులకు వర్తింపచేటట్లు చేయాల్సివుంది. అందుకే ఆయారాష్ట్రాల దళితుల ప్రత్యేక చరిత్ర తవ్వితీయడం అవసరం. అలాగే పూర్వయుగాల్లో ఈజాతి నిర్వహించిన వాణిజ్యం, కళలు, సాహిత్యం జీవనసరళి, ఏఏ జాతుల మధ్య వీరికి సంబంధబాంధవ్యాలు లేక ఏయే జాతులతో శత్రువైరుధ్యాలు

గల్గి ఉన్నారో వెదికి బయటకు తీయాలి. దళితులు ఈనాడు ఎదుర్కొంటున్న సవాలక్ష ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలి. అలాగే ఆదిలో ఈ దళితులకు చెందిన జాతి సాగించిన పోరాటాలు చేసిన యుద్ధాలు, ఆనాటి వీరుల చరిత్రలు, తరువాత కాలంలో ఓటమికిగల కారణాలు చరిత్రాంశాలుగా తీసుకోవాలి.

ఈపై చెప్పిన అంశాలలో ముందుగా దళితుల అసలు జాతిఏది? దాని నామమేది? అనేది పరిశీలిద్దాం. ఒక జాతిపేరు ఆజాతిని ఉత్తేజపర్చుతుంది. ఏజాతి సంస్కృతి ఆజాతికి స్ఫూర్తినిస్తుంది. ఈలాంటి చరిత్ర కర్తవ్యాలను దేశంలోని యూనివర్శిటీలు నిర్వహించాలి. ఇవి అగ్రకులాలలోనిండివున్నాయి. గనుక వారు పట్టించుకోరు. పైగా చరిత్ర వాస్తవాలకు మసిపూసి మారేడు కాయ చేస్తున్నారు.

మనకు చరిత్ర లేకుండాచేశారు,గనుక మన శతృవుల సాహిత్యాన్నుండే మనం వెదికి రాబట్టాలి. వారి పురాణాలనుండి వారి వైదిక గ్రంధాల నుండి ఇతిహాసాలనుండి మనం శోధించి బైటపెడదాం, మనలను రాక్షసులుగా వానరులుగా దస్యులుగా, యక్షులుగా, దాసులుగా రకరకాల హీన పదజాలంతో వర్ణించి రాసిన పేర్లన్ని మనకు చెందినవే. గనుక వారి చరిత్రలను తలక్రిందులుచేసి పరిశీలిద్దాం.

## ఎస్.సి. ఎస్.టి, బి.సిల పేర్లు పెట్టిందెవ్వరు?

ప్రాచీన రాచరిక వ్యవస్థలో హిందూ అగ్రకులాలు నిమ్న కులాలను మాలమాదిగలన్నారు. మధ్య యుగంలో ముస్లిం రాజుల కాలంలో పంచములన్నారు. ఇంగ్లీషువాళ్ళ పాలనలో ఆదిఆంధ్రులన్నారు. కాంగ్రేసువాళ్ళు వచ్చాక హరిజనులన్నారు. ఒక్కొక్క పాలనా వ్యవస్థలో ఒక్కోరకం పేరు పెట్టారు. చివరకు బ్రిటిషువాళ్ళు ఈ అణగార్చిన కులాలను ఏమనాలో వాళ్ళకు అర్థంకాలేదు. చివరకు షెడ్యూలు కులాలు అన్నారు. ఆదివాసులను షెడ్యూల్డు తెగలన్నారు. అనగా జాబితాలో చేర్చబడ్డ కులం, తరగతులు. ఈపేర్లు మనం పెట్టుకున్నవిగావు. మన జాతి ఏదో మనకు తెలియదు. కనుక పాలకులు పెట్టిన పేర్లనే అనుసరించాం. డా॥ అంబేద్కర్ ఉద్యమంతో మనకుమనం దళితులుగా పిలుచుకుంటున్నాం. దళితులంటే

అణచివేతకు దోపిడికి గురయ్యే జనం, అని అర్థం. ఎస్.సి, ఎస్.టి, బి.సి లందరు దళితులుగా పరిగణించబడతారు, ఈపేర్లన్నీ ఒకేజాతికి ఉద్దేశించి నవికావు.

బి.సిలు అనగా వెనుకబడిన తరగతులంటున్నారు. వీరు సాలి, చాకలి, కమ్మరి, కుమ్మరి, కాపు వడ్రంగి, మేదరి, కంసాలి వగైర వృత్తి కులాలు. వృత్తిపరంగానే ఉన్నారు, వీరిని వెనుకబడిన వారన్నారు. వీరంతటవీరు వెనుకబడ్డారా? లేక అగ్రకులాలు వెనుకకు నెట్టివేయడంతో వెనుకబడ్డారా? ఈ శూద్రకులాలపైన అనేక ఆంక్షలు, శిక్షలు విధించడంతో వెనుకకు నెట్టబడ్డారనేది యాదార్థం. ఇది అందరకీ తెలిసిందే. అయినా వీరిని ''వెనుకబడ్డవారుగా" చిత్రించడంలోనే వుంది నయవంచన! రాజ్యాంగవేత్తలుకూడా యీ యదార్థాన్ని మరుగుపర్చి బి.సిలుగా చెలామణి చేసారు. తమిళనాడులో పెరియార్ రామస్వామి నాయకర్ (పెరియార్ అనగాగ్రేట్‌మేన్) బి.సిల హక్కులకోసం ఎడతెగని పోరాటాలు సాగించినపుడే ప్రభుత్వం బి.సిల రిజర్వేషన్‌ల అవశ్యకతను గుర్తించి రాజ్యంగంలో మొదటి సవరణ చేయక తప్పిందికాదు. యీ విషయం డా॥ అంబేద్కర్, పెరియార్ రామస్వామినాయకర్ చర్చించుకోవడం జరిగింది. ఇక్కడ మరో 'దగా' ఏమంటే వెనుక పెట్టబడిన కులాలు అనకుండా 'తరగతులు'గా నిర్ధారణ చేయడంవల్ల ఈ అవకాశాన్ని తీసుకుని బ్రాహ్మణ న్యాయస్థానాలు బి,సిలకు తీరనిఅన్యాయంచేసాయి. సమాజంలో 52 శాతం ఉన్న బి.సిలు ఏ జాతినుండి వచ్చారు? ఇదికూడా తేటతెల్లం కావాలి. వీరిపట్లకూడా జాతిని మరుగుపర్చారు. తమిళనాడులో దళితులను [బి.సి వగైరా) ద్రావిడులుగా పెరియార్ నామకరణ చేసారు. యిది అగ్రకులాలకు కంటగింపుగా మారింది. సాధారణంగా శూద్రకులాలుగా ఉన్నవారినే బి.సిలుగా పరిగణిస్తున్నారు. వీరిలో మన తెలుగునాట ఒకప్పుడు శూద్రకులాలుగా ఉన్న కమ్మ, కాపు, వెలమ కులాలు బి.సిల లిస్టులోలేరు. వీరు అగ్రకులాల స్థాయికి ఎదగడమే కారణం. యీ కులాలలో పేదవర్గాలున్న మాట వాస్తవమే. అయినా వీరు 'కూటికి తక్కువగాని కులానికి తక్కువా' అని ప్రశిస్తున్నారు. వీరు సహజంగా అగ్రకులాల ప్రభావంలో కొట్టుకుపోతున్నారు. బి.సిలుగా వున్న శూద్రకులాలను పూర్వకాలంలో రాసిన (అ)ధర్మ శాస్త్రం అనేక ఆంక్షలు, శిక్షలు విధించి భానిసలుగా చిత్రించింది. ఒక్క అంటరానితనం మినహా మిగిలిన అన్ని విషయాల్లోను

నిమ్న కులాలలాగే పరిగణించబడ్డారు. ఇది అందరూ ఎరిగిందే ఇక్కడ ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఈ బి.సిలను ఆర్యుల జాబితాలోకి చేర్చుకున్నారు నిమ్నకులాలను వేరుచేసి అత్యధికసంఖ్యా కులైన యీ శూద్రకులాలను అండజేసుకోవడానికి కౌటిల్యుడు కుటిలనీతిని ప్రయోగించాడు. అప్పటికే ముస్లిం జాతులు ప్రారంభమైనాయి. విదేశీ రాజుల దాడులతో హిందూ మతం నాశనంకాక తప్పదని, ఈ శూద్ర నిమ్న కులాలువారి (శత్రువులు) వెంట పోకతప్పదని గుర్తించిన కౌటిల్యుడు ప్లేటు ఫిరాయించి శూద్రకులాలను ఆర్యులుగా చిత్రించి వారికి కూడ జందేలు తగిలించడం ప్రారంభించాడు. శూద్ర కులాలలో క్రింది కులాలను వేరు పర్చారు. అంతేకాకుండ ఆనాడు అనేకచోట్ల శూద్రకులాల్లో తిరుగుబాట్లు సాగాయి. యీ దశలో వీరిని క్రింది కులాలలో చేరిపోకుండా కౌటిల్యుడు పన్నిన పన్నాగమే "శూద్రులుకూడా ఆర్యులకు చెందినవారె'' అనడం శూద్రులను ఆర్యుల జాబితాలో చేర్చినా వీరిమీద నున్న అంక్షలు, శిక్షలు యధావిధిగానే వుంచారు. ఇక్కడ గమనించాల్సిన మరో కీలకాంశం ఏమంటే బి.సిలు హిందూమతాన్ని వదలితే హిందూమతం మరింత మైనార్టీ అవుతుంది యిదే యీ 'అభిమానానికి' కారణం. మనువు చెప్పినదానికి కౌటిల్యుడు చెప్పింది పూర్తి విరుద్ధం. అయినా హిందువులు ఈ రెంటిని ఆచరణలో పెడుతూనే ఉన్నారు. వైదిక మతానికి నీతి - నిజాయితీలేదు. అవకాశవాదమే దాని మార్గం. వారి వైదిక గ్రంథాల్లో ఇటువంటి పరస్పర వైరుధ్యాలతో కూడిన అంశాలు కోకొల్లలు. చాకలివారిని రజకులని, మంగలివారిని నాయీబ్రాహ్మణులని, పల్లెకారులను అగ్నికులక్షత్రియులని, కంసాలివారిని విశ్వబ్రాహ్మణులని, సాలీలను పద్మసాలీలని, మేదర్లను మహేంద్రులు అని భోగంవారిని వేశ్యలని (కళావంతులనీ) పేర్లు తగిలించి శూద్రకులాలను మోసగించారు. ఈ నూతన నామాలతో బి.సిలు భుజాలు ఎగరేశారు. అంతేగాక అగ్రకులాలకు మరింత బానిసలయ్యారు. అసలైన హిందువులం మేమేనని చెప్పుకో మొదలుపెట్టారు. హిందువులు పన్నిన ఉచ్చులో శూద్రకులాలు పడిపోయాయి. దెబ్బకు రెండు పిట్టలు పడ్డాయి. ఒకటి శూద్రుల శుభ - అశుభ కార్యాలను బ్రాహ్మణులచేత చేయించుకొనడంవల్ల బ్రాహ్మణవృత్తి బాగుపడింది. రెండోది శూద్రులను నిమ్నకులాలతో కొట్టుకుపోకుండా ఆ కులాలను ఒంటరి చేయడం. హిందువులు మెజార్టి అని లోకం కళ్ళుకప్పారు.

ఇటీవల కాలంలో రిజర్వేషన్సుకు వ్యతిరేకంగా హిందూ మత నాయకులు, హిందూమత పార్టీలు, హిందూ సంస్థలు తెగించి పోరాడి రక్తపాతాన్ని సృష్టించి చివరకు బి.సిల రిజర్వేషన్లు సాగకుండా అడ్డుపడ్డ సంగతితెలిసిందే. దీనితో హిందూ మతానికి బి.సిలు పూర్తిగా దూరమయ్యే ప్రమాదం పొంచి వుందని గ్రహించిన హిందూ నాయకులు "రథయాత్ర" కార్యక్రమంతో బి.సి లను తిరిగి బుట్టలోవేసుకో ప్రయత్నించారు. అత్యధిక బి.సిలు యీ మాయా జాలంలో కొట్టుకుపోయారు. రామ భజనలు, రథయాత్రలు అయోధ్య సమస్యలతో బి.సిలను కూడగట్టుకోవడానికి హిందూనాయకులు పడరాని పాట్లు పడుతున్నారు. మండల్ నివేదికను దెబ్బకొట్టడానికి, రిజర్వేషన్ల ఉద్య మాన్ని నీరుగార్చడానికి అద్వానీ "రథయాత్ర" బాగా ఉపయోగపడింది. శూద్ర - పంచమ కులాలను చీలించి పాలిస్తున్నారు. గనుక ఇక్కడ తేల్చ వలసిందేమంటే అసలు శూద్రకులాలు ఎక్కడనుండి వచ్చారు. వీరెందుకు శూద్రులయ్యారు? వీరి 'జాతి' ఏది? దేశమేది? బి.సిలుగా ఎందుకుమారారు? యీ అంశాలు తేల్చుకోకుండా బి.సి కులాలకు విముక్తిలేదు. డా॥ అంబేద్కర్ శూద్రులమీద ఒక గ్రంథమే రాశారు. వీరికి హిందువులవల్ల జరిగిన అనేక అన్యాయాలను ఎత్తిచూపారు. శూద్ర - నిమ్నకులాలు ఐక్యంగా పోరాడా లని ఎలుగెత్తిచాటారు.

## షెడ్యూల్డుకేస్ట్ అంటే ఏమిటి?

షెడ్యూల్డుకేస్ట్ అంటే జాబితాలో చేర్చబడ్డకులం. ఇది ముందు చెప్పు కున్నాం. అయితే అది ఏకులం? కులం పేరువేరు. ప్రభుత్వ రికార్డులలో ఎస్.సి గానే చెలామణి అవుతూవచ్చింది. డా॥ అంబేద్కర్ ఉద్యమఫలితంగా రాయితీలు, రిజర్వేషన్లు వగైరా కల్పించే సందర్భంలో యీ పేరు పుట్టు కొచ్చింది.

1919 సం॥లో బ్రిటిషు యిండియా అక్టు అనగా మాంటేగు చెమ్సుఫర్డ్ సంస్కరణలు ప్రకారం అంటరానివారిని (అస్పృశ్యులు) అణచబడిన వర్గాలు (డిప్రెస్డ్‌క్లాసెసు)గా పేర్కొన్నారు. 1935 లో ఆనాటి భారత ప్రభుత్వం చట్టం క్రింద ప్రభుత్వ ఉత్తర్వులకు అనుబంధంగా దేశంలోని అస్పృశ్య కులాల జాబితా అనగా ఒక షెడ్యూల్డుగా జతపర్చబడింది. ఈ షెడ్యూల్డులో

9 భాగాలున్నాయి. ఆనాటి 9 రాష్ట్రాలలో 429 కులాలను షెడ్యూల్డు కులాలుగా నమోదు చేశారు. అధికారం మార్పడి తర్వాత తిరిగి 1957 లో ఈ కులాల సంఖ్య 405 గా ఖరారైంది, అలాగే షెడ్యూల్డు జాతులు జాబి తానుకూడా వీటితోపాటు ప్రకటించారు. దీనితోపాటు ప్రభుత్వ గణాంక తదితర వ్యవహారాలలో ఆది ఆంధ్ర అనికూడా వ్యవహరించడం జరిగింది. ఆంధ్రులు మధ్యలో వచ్చినవారు. ఆదివాసులు ఆదినుండి ఉన్నారు. బ్రిటీషు వాళ్ళ పాలనతోపాటు క్రైస్తవ మతాన్నికూడా ఇక్కడ ప్రవేశపెట్టారు. అగ్ర కులాలు అనుసరించిన పాశవిక, రాక్షస విధానాలనురోసి అనేకమంది నిమ్న కులాలు క్రైస్తవంలో చేరడం ప్రారంభించారు. దీనితో హిందువులలో గుర్తింపుకూడా వచ్చింది. కులవ్యవస్థ ఫలితంగా కుక్కలు చింపిన విస్తరిగా ఉన్న సమాజాన్ని ఇంగ్లీషువాళ్ళ బాగా ఉపయోగించుకున్నారు.

కాంగ్రెసువారు వచ్చాక గాంధిగారు నిమ్నకులాలకు "హరిజనుల"ని నామకరణ చేసారు. కాంగ్రెసులో ఉన్న నిమ్నకులాల నాయకులు ఇది పెద్ద గుర్తింపుగాను; ఇదొక అత్యున్నతస్థాయిని సూచించే పేరుగానూ ప్రచారంలో పెట్టారు, ఈ పేరుకూడా గాంధిగారు ఎరువుతెచ్చుకున్నదే, "హరిజన" అన్న నామం ఆయన సొంతం చేసుకున్నారు. హరిజన అన్న పేరుతో పత్రిక నడిపారు! "హరిజన" పేరుతో నిధి వసూలు చేసారు. హరిజన సంఘాలు నిర్మాణం చేసారు. మాటల్లోనైనా హరిజన అని కలవరించారు. 'హరిజన' అనగా దేవుని బిడ్డలని అన్నారు. దీనిపై నిమ్నకులాలు దేవుని బిడ్డలైతే మిగిలినవారు దెయ్యాల బిడ్డలా? అని డా॥ అంబేద్కర్ వ్యంగ్యంగా వ్యాఖ్యానించారు. ఈ "హరిజన" అన్న పేరు గతంలో గుజరాత్‌కి చెందిన నర్సిమెహతా అనే పూజారి పెట్టాడని తెలిసింది. పూర్వం దళిత యువతులకు పెండ్లి చేయకుండా దేవునికి అంకితం చేయించేవారు. అనగా దేవుడే భర్త. దేవాలయాలవద్ద వేశ్యలుగా ఉంటూ వచ్చేపోయే భక్తులకు, పూజారి, పురోహితులకు కామవాంఛ తీర్చడం వీరి పని. అగ్రకులాలు దేవుని పేర నిమ్న కులాలపై లైంగికదోపిడీ సాగించేవారు. తండ్రిలేకుండా పుట్టిన పిల్లలందరికి దేవుని బిడ్డలని అనగా హరిజనులని ఆ పూజారి నామకరణ చేసారు, కామ వాంఛ తీర్చుకునే కోరికతోనైనావచ్చి దేవుని దర్శించి కానుకలు యిస్తారని ఆనాటి పూజారుల ఎత్తుగడ. డబ్బుకి కక్కుర్తిపడి హిందూ పూజార్లు దేవుని పేర, దేవదాసీల పేర తార్పుడు పనులు నిర్వహించేవారు. ప్రపంచంలో

ఏమతం ఇంత నీచానికి దిగజారిన దాఖలాలులేవు. కనుక ఈ 'హరిజన' అన్న పేరుకు "లంజ బిడ్డలు" అని అర్థం. ఈపేరుని దళితవర్గాలు యావత్తు వ్యతిరేకించాయి. చివరకు ఇటీవల ప్రభుత్వ రికార్డులలో "హరి జన" పేరు వాడవద్దని ఆ స్థానంలో షెడ్యూల్డుకేస్ట్సనే వాడమని ప్రభుత్వం ఆర్డరు జారీచేసింది, గాంధిగారి సిద్ధాంతాలతోపాటే ఆయన ఎంతో ప్రత్యే కించి పెట్టిన "హరిజన" పేరుకుకూడా కాలదోషం పట్టింది. నిమ్న కులాల్లో చైతన్యం పెరిగింది. "హరిజన" పేరు గుట్టురట్టయింది. భరత ఖండంలో వివిధ ప్రాంతాల్లో వివిధ నీచమైన అవమానకరమైన పేర్లతో నిమ్నకులాలు పిలవబడుతూ వచ్చాయి. 1991లో మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు 'హరిజన' అనే పదాన్ని రద్దుచేశారు.

## షెడ్యూల్డు తెగలు

దీనినే సింపుల్‌గా ఎస్.టి అంటూన్నాం. అడవుల్లోను కొండల్లోను నివసిస్తున్న ఆదిమవాసులను షెడ్యూల్డు తెగలనీ పిలుస్తున్నారు. గాంధీగారు వీరిని గిరిజనులన్నారు. ఈ ఆదిమవాసులు ప్రస్తుతము నాగరిక ప్రపంచానికి దూరంగా వున్నారు. అధికార మార్పిడి జరిగి 45 సం॥రాలు అయినా వీరి జీవన విధానాల్లో చెప్పుకోదగ్గ మార్పురాలేదు. ఇంకా వీరిని దోచుకోవడం, అణిచివేయడం ఎక్కువైంది, చిరకాలంనుండి వీరిని అడవులకే పరిమితం చేయడం మరీఘోరం. ఇటీవలకాలంలో కొందరు మైదానప్రాంతాలకు, పట్ట ణాలకు చేరుకుని వివిధ రకాలుగా జీవిస్తున్నారు. వీరికి యీనాటికీ అధునా తన వైద్యంగాని విద్యగాని అందుబాటులోలేదు. ఈ ఆదిమవాసులకై ప్రభుత్వం మొక్కుచెల్లించే సవాలక్ష పధకాలు వేసింది. కాని ఫలితాలు వీరికి దక్కకుండా పోయాయి. వీరు అడవుల్లో క్రూరమృగాలకు, విషపురుగు లకు బలవుతుంటారు, వీరు తమ జీవన మెరుగుదలకోసం చిరకాలంనుండి అనేక తిరుగుబాట్లు చేసారు. ఈనాటికి చేస్తున్నారు. ఏ ప్రభుత్వం వచ్చినా వీరి తిరుగుబాట్లను క్రూరంగా అణిచివేయటం జరుగుతూనే ఉంది. వీరిలో అనేక తెగలున్నాయి. మన తెలుగునాట సవరులు, గోండులు పెద్ద తెగలుగా ఉన్నారు. వీరికి తమ మాతృభాషలున్నాయి వీరి భాష అభివృద్ధికి తగిన కృషి లేదు. తెలుగు జాతిలో ఉపజాతులుగానే వీరు ఉంటున్నారు. వీరికి కూడా చరిత్ర లేనట్లుగా, జాతిలేనట్లుగా, పేరు లేకుండా జీవిస్తున్నారు.

చివరకు ఎస్. సి., బి. సి., ఎస్. టి. వర్గాలందరూ "దళితులు"గా పిలువబడు చున్నారు. దళితులు అనేది కూడా ఒక జాతి పేరు కాదు: దళితులు అనగా దోపిడికి అణిచివేతకు గురైయ్యేవారని అర్థం. ఖండించబడిన వారని కూడా అర్థం ఉంది. అంతేకాని 'దళితులు' అనేది ఒక జాతికి చెందిన పేరు కాదు.

ఈ దళిత కులాలను ఆనాడు వేదాలలో నిషాదులని తరువాత కాలం చరిత్రలో ద్రావిడులని రాయడం జరిగింది.

నిమ్న కులాలు ఛండాలురని పిలువబడేవారు. ఛండాలురనగా ప్లవ, మాతంగి, దివాకీర్తి, జనంగమ, నిషాద, శ్వపచ, అంతేవాసి, పుల్కస అను నీచమైన పర్యాయ పదాలుగా చెప్పబడ్డాయి.

మహారాష్ట్రంలో మహరులనియు, బెంగాల్‌లో 'మాల్' అనియు, తమిళ నాడులో ఏరియ కులమనియు నిమ్న కులాలు పిలవబడుతున్నారు. తెలుగు నాట మాలలుగా అనగా మలలు (కొండలు) నుండి వచ్చినవారుగా కొందరు చరిత్రకారులు రాస్తున్నారు. యివన్నీ మనకు సంబంధంలేనివి. మన శత్రువుల చేత పెట్టబడినవి.

వైదిక బ్రాహ్మణులు దళితుల కిచ్చిన టైటిల్స్ యిలాగున్నాయి.

| | | |
|---|---|---|
| దస్యులు | — | (బానిసలు) |
| దళితులు | — | (అణచబడినవారు) |
| పరయా | — | (ఆర్యేతరులు) |
| అవర్ణులు | — | (వర్ణంలేనివారు) |
| కుల బాహ్యులు | — | (కులం లేని వాళ్ళు) |
| ఛండాల | — | (ఉగ్రవాదులు) |
| చండ్ | — | (కోపిష్టులు) |

యీ పైవిధముగా మనలను కించపర్చారు. అవమానించారు. మనుస్మృతి ద్వారా మానవత్వంలేని ఆంక్షలు శిక్షలు విధించారు. అటువంటి మను శాస్త్రాన్ని 1927 లోనే బాబాసాహేబ్ డా॥ అంబేద్కర్ సాహసోపేతంగా దహనం చేసి హిందూ మతోన్మాదులకు గుండెల్లో మంటలు పుట్టించారు. దళిత వైతాళికుడుగా ముందు పీఠీని నిలిచాడు.

పరమ రాక్షసత్వాన్ని ప్రబోధించిన మనువును నేటికి కీర్తిస్తూ ఇటీవల రాజస్థాన్ హైకోర్టు ఆవరణలో మనువు శిలా విగ్రహం ప్రతిష్ఠించారు. ఈ చర్య శూద్ర - దళిత కులాల వారిని అవమానపర్చడం తప్ప వేరుకాదు. ఈ మను విగ్రహ ప్రతిష్ఠపై అగ్రకుల ఆధిపత్యంలో నున్న కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాలు మౌనం వహించడం క్షమించరాని నేరం.

## భౌగోళిక, నైసర్గిక పరిస్థితులు - జాతులు

భౌగోళిక పరిస్థితులు కూడా జాతుల ఆవిర్భావానికి, పరిణామానికి కారణం కావచ్చు, ఆయా భూఖండాల్లో ఆయా జాతుల పరిణామ క్రమం వేరు వేరుగా జరిగింది. అనేక తెగలు సంచార తెగలుగా భూమిపై తిరిగి తిరిగి అనేక ప్రాంతాలు మారి మారి చివరకు ఏదో ప్రాంతంలో స్థిరపడ్డారు. ఆదిలో మానవులంతా సంచార తెగలుగా వున్నారనేది తెలిసిందే.

కాంటి నెంటల్ (డ్రిఫ్ట్ థియరీ ప్రకారం) సుమారు 25 కోట్ల సం॥రాల పూర్వంనాడున్న 5 ఖండాలు ఒకప్పుడు కలిసే వుండేవని తర్వాత తర్వాత విడిపోయాయని భౌగోళిక శాస్త్రవేత్తలు చెపుతారు. ఇప్పుడీ అయిదు ఖండాలు ఒకే చోట చేర్చితే ఒకే భూఖండంగా అమరుకుంటాయి. ఆనాటి ఏక భూ ఖండాన్ని "సఖల భూఖండమని" పేరు పెట్టారు భూగోళ శాస్త్రజ్ఞులు. యీ నాడున్న భూఖండాల వంకర, టింకర నొక్కులు అవీ సరిగా కలుస్తాయి. గనుక దక్షిణ భారతదేశం కాంటి నెంటల్ డ్రిఫ్టుకు (ఖండాంతర వికర్షణ) పూర్వం ఆఫ్రికా ఖండంలో ఒక భాగంగా వున్నదని, అప్పుడది గోండ్వాన ఖండంగా చెప్పబడిందని అంటారు. దక్షిణ దేశాన్ని దాని మాతృ భూభాగ మైన ఆఫ్రికా ఖండాన్ని కలుపుతూ "లెమూరియా" అనే భూభాగముండేది. గనుక ఆఫ్రికా జాతులకు దక్షిణ భారత జాతులకు అవినాభావ సంబంధం వుంది. తర్వాత కాలంలో "లెమూరియా" భూభాగం సముద్రం నీటిలో మునిగిపోయింది. దీనితో సంబంధాలు తెగిపోయాయి. ఈ మార్పులు మాన వుడు నాగరికత నేర్వని "నియోర్తాండల్" దశనాటి నాగరికతగా చెప్పబడు తుంది.

పురాతన మానవ నాగరికతా పరిశోధకులు హెూల్డర్ నెస్ పండితుడు ఇలా చెప్పారు. "భారత ఉపఖండంలోని దక్కను పీఠభూమి లేక ఇప్పటి

తెలంగాణా, దాని చుట్టూ ఆవరించి ఉన్న భూభాగాన్ని, గంగా సింధు మైదానం, హిమాలయ ప్రాంతాలకు భిన్నమైనది. దక్కను పీఠభూమి పాత గొండ్వాన లేక లెమూరియా అనబడే ఉపఖండంలోని భూభాగం ఆఫ్రికా వరకు వ్యాపించి ఆఫ్రికాతో కలసి వుండేది. క్రీ॥ పూ॥ మూడులక్షల సంవత్స రాల క్రితం ఆసియా, యూరప్, ఆఫ్రికా ఖండాలు మొదట కలిసే వున్నాయి. ఆ కలసియున్న భూభాగాలన్ని ఇప్పుడు హిందూ మహాసముద్రం ఆక్ర మించింది. ఈ భూభాగంలో తయారైన పర్వతాల గుట్టలు ప్రపంచంలో అన్నింటికన్నా పురాతన మైనవి. వాటిలో చాల భాగం భూమి తయారయ్యే మూడవ పరిణామ దశలో మునిగిపోగా అక్కడ ప్రవహించిన లావా రాళ్లుగా మారి ఇప్పటికి గుట్టలు గుట్టలుగా దక్కను పీఠభూమిలో ఉన్నాయి.

అలాగే ఇపుడున్న భారత ఉపఖండం ఒకప్పుడు దక్కను పీఠభూమి తప్ప మరేమీకాదని, అది ఆఫ్రికాలో కలసి ఆఫ్రికా ఖండంగా ఉండేదని, ఇప్పుడున్న ఉత్తర భారత దేశం హిమాలయాలతో సహా సముద్రములో ఉండేదని కాలక్రమేణా ఆఫ్రికా ఖండంతో సంబంధించి ఉన్న దేశంపై హిందూ మహాసముద్రం చోటు చేసుకుని దక్కను పీఠభూమి ఒక ద్వీపము లాగ వుండిపోయిందని, ఇక్కడే పురాతన మానవుడు ఆవిర్భవించాడని పరి శోధకులు నిరూపిస్తున్నారు. తర్వాత కాలంలో దక్కను పీఠభూమి ద్వీపానికి ఉత్తరంగా నున్న చైనాకు దక్కను పీఠభూమికి మధ్య సముద్ర భాగంలో మెరకవేసి యిప్పటి చైనా భూమి సంధించింది. (ఏర్పడింది) అరేబియా గల్ఫ్ 100 లక్షల సం॥రాల క్రితమే ఏర్పడింది.

హిమాలయాలు ఉత్తర భారత ప్రాంతం అలా తయారయ్యాక దక్కను గోండ్వాన గడ్డమీద ఆదిమ నరసంతతి, ఆదిమ మానవ నాగరికత ప్రపంచ మంతా వ్యాపించిందని పై పండితులు దృఢంగా చెపుతున్నారు. దాదాపు 50 వేల సం॥రాల క్రిందట హిమాలయాలు లేవు. గంగ లేదు; సింధు లేదు; గంగా - సింధూ మైదానం లేదు. రామాయణం లేదు, భారతం లేదు; సంస్కృతం లేదు. అనాటికి వేదాల్లేవు, వున్నదల్లా తెలుగు (నాగులు) వారి నాగరికత మాత్రమే.

భూగోళ పరిణామ దశలో దక్షిణ భారత భూఖండం కదలి వెళ్ళి ఆసియా ఖండాన్ని ఢీకొట్టినప్పుడు ఆ తాకిడికి అక్కడున్న సముద్రం అడుగు

భూమిపైకి లేచి మడతలుపడి హిమాలయ పర్వతాలు రూపుదిద్దుకున్నాయి. గంగా సింధు మైదానం ఏర్పడింది. తెలుగువారే అనగా నాగులే వింధ్య పర్వతాలు నదిరోహించి సింధునదీ తీరంలోని హరప్పా నాగరికతను నిర్మించారు. విజ్ఞాన శాస్త్ర పరిశీలన రీత్యా ఈ భారత ఉపఖండం ప్రథమ పౌరులు వీరే. తర్వాత ఆర్యులు దారిదోపిడి వాళ్ళలాగా వచ్చి శాంతికాముకులైన వీరిని (నాగులను) అమానుషంగా హత్యచేసి వీరి నగరాలను ధ్వంసంచేసి వీరు నిర్మించిన ఆనకట్టలను కాల్వలను నాశనం చేసి ఆ శిధిలాలపై ఆర్యులు గోశాలలు స్థాపించారు. ఈ ఆర్య నాగరికతే ఈ దేశాన్ని ఈనాటికి కుక్కలు చింపిన విస్తరిగా మార్చింది. ఈ విషయం ప్రముఖ బౌద్ధ ఫిలాసఫర్ బహుభాషా కోవిదుడు శ్రీ గడియారం శ్రీవత్స (ప్రస్తుతం 'ఆంధ్రజ్యోతి' పత్రికా సబ్ ఎడిటర్) శ్రీముఖ ఉగాది సంచికలో చక్కగా వివరించారు.

గమనించదగ్గ మరో అంశం ఏమంటే తుంగభద్ర మైదాన ప్రాంతంలో ఆనాటి లిపి మొహంజుదారో, మెసపటేమియా, మెక్సికోలోవున్న ఆయా జాతుల లిపులన్నింటికి సంబంధించినట్లు వుండటమే గాక వీటిన్నింటికన్నా పురాతనమైనది. అందుచేత పురాతన ఆదిమ మానవుని పుట్టుక, నాగరికత తుంగభద్రా మైదానం నుండే అనగా మన తెలుగు గడ్డ మీదనుండే ప్రారంభమయిందని స్పష్టపడింది. రష్యా పురాతత్వ శాస్త్రవేత్త అలెగ్జాండర్ కోంద్రకోవ్ పరిశోధన ప్రకారం భారత ఉపఖండంలోని నాగరికత దక్షిణాది నుండి ఉత్తరాదికి వ్యాపించిందని తేల్చి చెప్పారు. ఉదాహరణకు విశాఖ జిల్లాలోని బొర్రాగుహలు అతి ప్రాచీన మయినవని 1964-65 సం॥లో ఆంధ్రా యూనివర్సిటీ పురావస్తుశాఖవారు తమ సర్వేలో ఈ గుహలు లక్షల సం॥రాల నాటివని చెప్పారు. ఈ గుహలలో ప్రాచీన అపురూప శిల్పాలున్నాయి. అంతేకాదు 40 వేల సం॥రాల నుండి తెలుగువారు గోదావరి తీరాన నివశించినట్లు ఆధారాలు పరిశోధనల్లో లభ్యమయ్యాయి. దీన్నిబట్టి తెలుగు జాతి అతి ప్రాచీనమైనది అని తేలింది. (ఆర్యులు ఇక్కడకు వచ్చి దాదాపు 4 వేల సంవత్సరాలకు మించదు.)

కాంటినెంటల్ డ్రిఫ్టు జరిగిన తర్వాత యుగాల్లో కూడా కొన్ని శతాబ్దాలపాటు దక్షిణ భారత దేశాన్ని, దాని భూభాగమైన ఆఫ్రికాను కలుపుతూ "లెమూరియా" అనే భూభాగం వుండేదని ముందు చూసాం. కనుక ఆఫ్రికన్ జాతులకు దక్షిణ భారత జాతులకు అవినాభావ సంబంధంవుంది. లెమూరియా

భూభాగం మునిగిన తర్వాత ఆ సంబంధాలు తెగిపోయాయి. మరింత వివరంగా చూస్తే బ్రిటీషు జీవశాస్త్రవేత్త థామస్ హక్సలే గత శతాబ్దం చివర్లోను, ప్రముఖ చరిత్రకారుడు హెచ్. జి. వెల్స్ ఈ దశాబ్దపు ప్రారంభంలోను, రష్యన్ భూవిజ్ఞానవేత్త అలెగ్జాండర్ కొండ్రికోవ్ అయిదు దశాబ్దాల క్రిందట వేర్వేరు కాలాల్లో వివిధ పద్ధతులలో విశ్లేషణ చేసి మొట్టమొదటి మానవ నాగరిక తుంగభద్ర నదీ తీరంలో ఆవిర్భవించిందని నిర్ధారించారు. దీన్ని బట్టి తేలిందేమంటే తుంగభద్రానదీ లోయ నాగరికతను సృష్టించిన నాగులే వింధ్య పర్వతాలు దాటి హరప్పా, మొహంజుదారో నాగరికతలు నిర్మించారని వాటి విధ్వంసం తర్వాత నాగులు తూర్పుగా జరిగి బెంగాల్ మీదుగా ఒరిస్సా దాటి తిరిగి తుంగభద్ర, కృష్ణా, గోదావరి, కావేరి, పెన్నా తీరాలకు చేరుకున్నారు.

పై పరిశోధనల ప్రకారం తొలి మానవుల జన్మస్థానం తెలుగుగడ్డ మీదేనని స్పష్టపడింది. ఇది తెలుగు జాతికి గర్వకారణం.

## మానవుల వర్గీకరణ

మానవ శాస్త్రజ్ఞులు మానవులను శరీరాకృతిని (పుర్రెలు - బొమికలను పరిశీలించి) బట్టి 5 రకాలుగా వర్గీకరించారు. భౌగోళిక, నైసర్గిక పరిస్థితులను బట్టి కూడా ఈ మానవుల మధ్య విభిన్న ఆకృతులు ఏర్పడటం కూడా వుంది. 1) ఆస్ట్రిలాయిడ్ 2) నీగ్రోలాయిడ్ 3) మంగోలాయిడ్ 4) కకేషియన్ 5) ఇండో - ఆర్యన్. (లాయిడ్ అనగా రకం వంటిది అని అర్థం) మంగోలాయిడ్ అనగా మంగోల్ రకం. మనుషుల్లో తెలుపు, నలుపు, పసిమి వర్ణం లాంటివి కూడా ఈ వర్గీకరణలో చోటు చేసుకున్నాయి ఈ వర్గీకరణతో శీతోష్ణ పరిస్థితులు కూడా గమనంలోకి తీసుకున్నారు.

నేడున్న దళితులు ఆస్ట్రిలాయిడ్ జాతికి చెందిన వారని శాస్త్రవేత్తలు పేర్కొన్నారు. ద్రావిడ జాతుల వారిని మెడిటేరియన్స్ అని పాశ్చాత్యులు నామకరణ చేశారు. ద్రావిడ జాతులు అనగా అది భారతీయులు అని చెప్పవచ్చు. అనగా ఈ దేశంలో పుట్టి పెరిగిన స్థానికులు. ఈ ద్రావిడ జాతుల్లో అనేక ఉపజాతులున్నాయి. "నాగులు - ద్రావిడులు ఒకే రక్తం పంచుకు పుట్టిన వారని డా॥ అంబేద్కర్ పేర్కొన్నారు. ఆదిలోవున్న జాతులలో

ప్రధాన జాతి నాగజాతి. వీరు భారత ఉపఖండమంతా వ్యాపించి వున్నారు. ఆర్యులు వచ్చాకే వీరిలో కొందరు (ఉత్తరాదికి చెందిన నాగులు) దక్షిణ భారతానికి తరలిరావడం జరిగింది. అందుచేత ద్రావిడులనగా దక్షిణాదికి చెందిన వారని అర్థం. ఈ ద్రావిడ పేరు భూసంబంధంగా ఏర్పడ్డది. గాని వీరంతా నాగులే. ఇప్పుడున్న వివిధ కులాలుగావున్న బి.సి; ఎస్.టి; ఎస్.సి. తెగలన్నీ నాగజాతికి చెందిన ఉపజాతులే. అలాగే తెలుగు పదం కూడా దక్షిణాది వాసులని అర్థం యిస్తుంది. శరీరాకృతినిబట్టి ముఖాకృతినిబట్టి తెలుగులు నాగులుగా పరిగణించబడ్డారు. ఈ జాతులవారు సన్నగావున్న శరీరాకృతి తోను, పొడవుగాను, ముఖం పొడవుగా, కోలగా వుండటం ముఖ్య లక్షణంగా గుర్తించారు. దక్షిణాదికి వచ్చిన కొద్దీ తక్కిన జాతులవారికన్నా వీరి ముఖాకృతి సన్నంగా కోలగా వుండటం గమనించగలం. గనుక నాగజాతి అనగా తెలుగుజాతి. మంగోలాయిడ్ అంశం గల జాతిగా చెప్పవచ్చు. ఇది అతి ప్రాచీన జాతి. యీ అంశంగలవారు గనుకనే తెలుగు భూమిమీద వున్న వారిని "నాగజాతి" అన్నారు. నాగజాతికి చెందినవారు నాగుపాము తలను పోలిన ముఖాకృతి కలిగి వున్నారు. అందుకే నాగుల పేరు వచ్చి వుండవచ్చు. ఎత్తయిన చిక్‌బోన్సు గల ముఖాకృతి గల వారుగా, పాము పడగ పోలిన ముఖాకృతి గల మంగోలాయిడ్ అంశంలో ప్రాధాన్యత యిది ముఖ్యంగా చూడదగింది. కనుబొమ్మలు తీర్చి దిద్దినట్లుగా వుండి పొడవైన ముఖాకృతి వుండటం మంగోలాడ్ అంశంలో ప్రాధాన్యత వహిస్తుంది. ఇదే అంశం ఉత్తర అమెరికా ఖండంలోని మెక్సికన్‌ల పూర్వ జాతులలో చూడగలం. తెలుగుల (నాగుల) ప్రొటో ఆస్ట్రిలాయిడ్ అంశం మరొకటుంది. [ప్రొటో అనగా మొదటిది లేదా బీజరూపంలో వున్నదని అర్థం.] ఇదే అంశం యూరోపియన్ జాతులలో వుండటం గమనించదగ్గ విషయం. యీ అంశం యిక్కడ యానాదులు, ఎరుకలు వంటి జాతులలో వుండటం విశేషం. కాబట్టి యూరోపియన్ ప్రొటో ఆస్ట్రిలాయిడ్ వారికి దక్షిణ భారత దేశంలో పైన చెప్పిన జాతుల వారికి ఒకే అంశం వుంది. గాని శరీరవర్ణం మాత్రము వేరుగా వుంది. ఒకే జాతివారు నలుపు - తెలుపు వర్ణం కలిగి వుండటం భూగోళ నైసర్గిక పరిస్థితులు కావచ్చు. దీన్నిబట్టి కాంటినెంటల్ డ్రిఫ్ట్‌కు పూర్వం యీజాతులు కలిసి వున్నాయనేది. గమనించతగ్గది.

తెలుగు నేలమీద అనేక ఉపజాతులను కలుపుకుని నాగజాతి రూపు దిద్దుకుంది. దీనికి కారణం యీ జాతుల్లో నాగజాతి పెద్దది కావడం. అందు చేతనే ప్రాచీన కాలంలో తెలుగుదేశం నాగదేశంగా పిలవబడింది. తర్వాత దశలో ఈజాతి ఉత్తరాదికి వ్యాపించి వుండవచ్చు. అందుకే డా॥ అంబేద్కర్ "నాగులు ఒరిజినల్ ఇండియన్స్" అన్నారు. గనుక నాగులను ఆదిజనులుగా పరిగణించాలి.

ఆనాడు నాగుల్లో ఉపజాతులుగా వున్న తెలుగులు ప్రకాశం జిల్లా కావలి ప్రాంతంలో నివసించేవారు. కలింగులు కదంబులు గోదావరినది కు త్తరాన వుండేవారు. గాంగులు, ఆంధ్రులు ఎగువ కృష్ణా ప్రాంతములో జీవించే వారు. మహిషకులు నల్లగొండజిల్లా ప్రాంతములో నివసించేవారు. మూలకులు రాయలసీమ ప్రాంతం వారుగా ఉండేవారు. యక్షులు కృష్ణా - గోదావరి జిల్లాల మధ్య ప్రాంతంలో వుండేవారు. ఈ జాతులన్ని నాగులతో కలిసి పోయాయి. వీరిలో ఆంధ్రులనే ఆర్యులు తప్ప మిగతా జాతులన్నీ నాగజాతిలో ఉపజాతులే. యీ ఉపజాతులన్నీ స్థానికంగా పుట్టి పెరిగినవే. ఒక సుధీర్ఘ కాల ప్రవాహంలో అనేక తెగలు కలిసి ఒక జాతిగా ఏర్పడటం జరిగింది. (అనేక ఉపనదులు కలిసి ఒక మహానది ఏర్పడినట్లుగానే) చారిత్రక పురో గమనంలో విభిన్న తెగలు అనేకం కలిసి ఒక జాతిగా ఏర్పడ్డాయి. తెగలు తెగలుగా వుంటే జాతి లేదు. ఒక జాతి రూపుదిద్దుకోవడానికి నేడు కులాలు మతాలు అడ్డుగా వున్నాయి. కులాలు నిర్మూలించకపోతే ఏజాతికి పరిపూర్ణత లభించదు. సంపూర్ణజాతిగా రూపుదాల్చదు. కనుక కుల నిర్మూలన తక్షణ కర్తవ్యంగా ముందుకు వస్తుంది. పుట్టుకనుబట్టిగాని భాషనుబట్టి మాత్రమే "జాతి" ఏర్పడదు. ఈ విషయంలో కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నారు. "పుట్టుకగాని, భాషగాని ఆర్థిక అంశంగాని ఏఒక్కటి "జాతి"ని" నిర్ణయించదు. యివన్నీ కలిసే జాతిగా పరిగణించబడుతుంది. ఏ ఒక్క సాధారణాంశాన్నిబట్టి జాతి ఏర్పడదు. భాష, భౌగోళిక, రాజకీయ, ఆర్థిక, అంశాలన్నీ కలిసి జాతిగా రూపుదిద్దుకుంటుంది."

నాగుల్లు, యక్షులు, కంబులు, కళింగులు, తెలుంగులు, ద్రావిడులు, మహిషకుల్లు, మూలకులు, అస్మకులు, శౌరసేనులు, పిశాచులు, రాక్షసులు, వానరులు వగైరా తెగలన్నీ యీదేశ భూపుత్రులు, చారిత్రకులు. వీరందర్నీ కలిపి ద్రావిడులని అంటారు. (అనగా దక్షిణాత్యులని) ఈ తెగలన్నీ కలిసి జాతిగా ఏర్పడ్డాయి.

ప్రారంభంలో తెగల్లో గణతంత్రం అమల్లో వుండేది. దీన్నే మార్క్స్ "ఆదిమ కమ్యూనిష్టు వ్యవస్థ" అన్నారు. దీని తరువాత రాచరికం. రాచరికాన్ని వ్యతిరేకిస్తూ ప్రజా చైతన్యంవల్ల ప్రజాస్వామ్యం (గణతంత్రం) వస్తుంది. దీనిలో విడివిడి తెగలుండవు. ఏకమొత్తం సమాజం వుంటుంది. అయితే ఈ వ్యవస్థను పోషించేవారు కేపటిలిస్టులు అంటే వ్యాపారులు. ఆనాడు బౌద్ధాన్ని పోషించింది వీరే. అందుకే కాబోలు బుద్ధుడు తన ధర్మం వెయ్యేళ్ళుంటుందని చెప్పాడు. గణతంత్రం, రాచరికం, వ్యాపారవ్యవస్థ, మళ్ళీ యింకా ఉన్నత వ్యాపార వ్యవస్థ ఇలా పరిణామం చెందుతూనే వుంటాయి. ఈ మూడవ దశలోనే దీన్ని "జాతి" అనగలం. అందుకే "పెట్టుబడిదారీ మార్కెట్ అభివృద్ధి మాత్రమే జాతి స్ఫూర్తినిస్తుంది" అంటాడు కా॥ స్టాలిన్. యీ పరిస్థితులనుబట్టి చూస్తే నేటి తెలుగుజాతి కులాలు కారణంగా, పరిశ్రమలు వెనుకబడ్డ కారణంగా ఇంకా పరిపూర్ణమైన జాతిగా రూపొందలేదనే చెప్పాలి.

## 'నాగ' పదం పుట్టుక

భూమిమీద అతి ప్రాచీనమైన మానవజాతి ఆస్ట్రిలాయిడ్ వర్గానికి చెందిన వారని యిదివరకే చూచాం. యిది మరింత వివరంగా చెప్పాలంటే తెలుగు లాయిడ్ లేదా నాగాలాయిడ్ అని చెప్పవచ్చు. కాని కొందరు విదేశీయుల కుట్రవల్ల పేరు మారింది. తెలుగులు ఆస్ట్రిలాయిడ్లు అయితే తర్వాత నీగ్రోలాయిడ్, మంగోలులతో కలిసి పోయారు. ఆమాటకొస్తే ఇండో - యూరిపియన్ జాతులు కూడా కలిసి పోయాయి.

ఈజాతికి వేదాల్లో వున్న పేరు 'ఫణి' పణ్యం అంటే మార్కెట్టు వస్తువు. ఫణి అంటే వ్యాపారి అని అర్థం. ఆనాడు వర్తక వ్యాపారాలలో నాగులు ప్రఖ్యాతి గాంచిన విషయం తెలిసిందే. ఆర్యుల దృష్టిలో నాగులు వ్యాపారులుగా పరిగణింపబడ్డారు, ఈ 'ఫణి' నాగులకు పర్యాయపదంగా బ్రాహ్మణుల కుట్ర ఫలితంగా వారి భాషలోకి ఎక్కింది. యాస్కుడు రాసిన "నిరుక్తం"లో ఫణి - ఫణం (పడగ) వున్నది పాము అని రాయబడింది. 'నిరుక్తం' అంటే ఉత్పత్తి పదకోశం అన్నమాట. ఇది వేదాంగాల్లో ఒకటి. ఆలాగే పతంజలి రాసిన మహాభాష్యంలో కూడా ఫణి అంటే 'పాము' అని మాత్రమే రాసివుంది. ఆర్యులకు ఈ స్వదేశీ వ్యాపారులు పాముల్లాగ కని

పించారన్నమాట. ఆర్యుల ఆలోచనా ధోరణి వేరు. అయినా రకరకాల అర్థా లతో 'నాగుల' పేరు ముడివడివుంది. పాముని నాగవీరులు, పండితులు, పౌరుషానికి మారుపేరుగా స్వీకరించారు. అంతేకాదు నాగుల ముఖాకృతి నాగు పాము పడగ పోలి వుంటుందని ముందే చూచాం.

తమ జాతికి 'నాగులు'గా నామకరణ చేసుకోవడమే గాక తమ జాతికి, తమ రాజ్య చిహ్నంగా నాగు పాముని ఎన్నుకున్నారు.

ఆనాటి నాగులు ఈ షణత్రయం అనగా ధనేషణ, దారేషణ, పుత్రే షణ, ( ధనం, భార్య, పిల్లలు ) వీటిని జయించడానికి ధాన్యం, సాధన, సమాధి అనే ముమ్మొన ఆయుధం అవసరం. అదే త్రిశూలం. త్రిశూలం ఆది జనుల ఆయుధం. ఈ త్రిశూలాన్ని శివుడు ధరించేవాడు. శివుడు ఆదివాసుల నాయకుడు. ఆదివాసులనగా నాగులే. నంది - త్రిశూలము - డమర - నాగ - పార్వతి = శివుడు. ఇవన్నీ ఆనాడు ఒక్కొక్క తెగకు చిహ్నం. నంది మూలకు లకు డమరు కవితలు చెప్పే తెలుగులకు, త్రిశూలం యక్షులకు, నాగ నాగు లకు, పార్వతి స్త్రీలగణం. వీళ్ళంతా సమాఖ్యగా ఏర్పడి తమ ఆరాధనా చిహ్నంగా శివుణ్ణి, రూపొందించుకున్నారు. శివుడు ప్రశాంతతకు పర్యాయ పదం. శివుడు, మతంలో శాంతం, ధ్యానం, ప్రశాంతత ఈభావాలు నాగులవి· ఆర్యులు మొండి భౌతికవాదులు. తినడం, తాగడం, హింసించడం, సుఖించడం తప్ప మరొకటి తెలియదు. అందుకే శివుడు బ్రాహ్మణులకు లయకర్త దళితు లకు సృష్టికర్తగా మారాడు" (ఇటీవల శివుని శూలాన్ని బి జె పి వారు కొట్టే శారు ! ).

నాగచిహ్నం గురించి మరో ఉదాహరణ ఏమంటే చాళుక్యుల నాటి శిల్పంలో నాగుపాము చుట్టచుట్టుకుని పడగవిప్పి పడుకున్నట్లుంది. ఈ చుట్టలు తెగల సమాఖ్యకు చిహ్నం. చాళుక్యులు యీ ప్రతీకను మంగోల్ శిల్పులనుండి గ్రహించారని పరిశోధకులంటారు. ఇప్పటికి చోటా నాగపూర్ లోని ఆదివాసులు (ఆనాటి నాగులు) నాగపూజ చేస్తారు. పోయిన సం॥రం మంగోలియాలో ఔరుగ్ (ఉరగ) నగరం తవ్వకాల్లో బయల్పడింది. దానిలో చుట్టచుట్టుకుని వున్న నాగుపాము శిల్పం (బొమ్మ) లభించింది - దీన్నిబట్టి మంగోలాయిడ్ ఆస్ట్రిలాయిడ్ తెగల సన్నిహితం అర్థంకాగలదు.

ఆర్యులచేత నాగులు ఓడించబడ్డ తర్వాత లొంగిపోయిన (మార్గాంతరం లేక) శూద్రకులాలకు చెందిన స్త్రీలను దేవదాసీలుగా (వేశ్యలు) నియమించి వేశ్యావాటికలు సృష్టించారు. అగ్రకులాలవారు బ్రాహ్మణ పూజారి పురోహిత వర్గాలు యీ స్త్రీలపై లైంగిక దోపిడి సాగించేవారు. దేవదాసీలకు చెందినవారు ఈనాటికీ తమ నాగజాతి ఆచార వ్యవహారాలు వదలుకోలేదు. వీరు నాగుపాములను ఆరాధిస్తారు. వీరు నాగాయి, నాగమణి, భుజగవేణి, నాగబాల, నాగరాజు వగైరా పేర్లు యీనాటికి వాడుకలో వున్నాయి. ఈ స్త్రీలు నాగనృత్యము అద్భుతంగా ప్రదర్శిస్తారు.

జోగంవాళ్ళది నిజానికి ఒక కులంకాదు - కళావంతులనగా నాట్యంచేసేవారు. నట్టువగారు అనగా నాట్యగానాలు గావించేవారు. దేవాంగులు అనగా వస్త్రాలు నేసేవారు. ....రంగరాజు వస్త్రాలు కుట్టేవారు. పుష్పలాలికలు అనగా పుష్పమాలలు తయారుచేసేవారు. ఈ వృత్తులన్నీ నాగుల సొంతం. ఆర్యులు నాగులను ఓడించాక యీ వృత్తులను బ్రాహ్మణులు తమ స్వంతం చేసుకుని వారి దేవుళ్ళకు ప్రత్యేకించారు. దేవునిపేరుతో దేవదాసీలను గుడిచేటులుగా మార్చారు. అవినీతిపనులు, అరాచకాలు, హింస వగైరా అన్ని బ్రాహ్మణులు దేవుని పేరుమీదే సాగించారు.

## నాగుల జన్మస్థానము

నాగులు అతి ప్రాచీన జాతి. వీరు ధైర్యశీలురు, ప్రజ్ఞావంతులు, శ్రమజీవులు; నాగజాతి వారిచేత అనేక రాజ్యాలు పాలించబడ్డాయి. నాగుల నాగరికత యీ ప్రపంచంలోనే అతి ప్రాచీనమైనది. తుంగభద్ర, హరప్పా, మొహంజోదారో నాగరికతలకు వీరు సృష్టికర్తలు. ప్రపంచంలో బట్ట కట్టుకోవడం చేతగాని అనేక దేశాలున్న కాలములోనే వీరు మహానగరాలు నిర్మించారు. నాగుల నగర నివాసాలే నేడు నగరాలుగా వాడుకలోకి వచ్చాయి. నాగజాతివారు అత్యున్నత తత్వవేత్తలు, నౌకాయానములో ప్రసిద్ధులు, ఖగోళ శాస్త్రజ్ఞులు, గణిత శాస్త్ర కోవిదులు, వైద్యనిపుణులు, సంగీత విద్వాంసులు, వైయాకరణులు, సకల కళా మూర్తులు, ప్రగతి దాయక జీవిత విధానం గలవారు. ఆధునిక యుగ విజ్ఞానానికి, సాంకేతిక పరిజ్ఞానానికి నాగుల మేధాసంపత్తియే పునాది అని చెప్పవచ్చు.

అసలు హరప్పా నాగరికత కృష్ణా - గోదావరి నదుల లోయలవరకు వ్యాపించి వుండేదని చరిత్రకారుల అభిప్రాయం. అలాగే హరప్పా నాగరికత కంటే ముందు మరింత ఉన్నత స్థాయిలో తుంగభద్రానది లోయ నాగరికత వర్ధిల్లినట్లు అనేక సాక్ష్యాధారాలున్నాయి. హరప్పా నాగరికత ఆర్యులచేత విధ్వంసం చేయబడి నిర్మూలించబడిన తరువాత అక్కడ నాగులు దక్షిణాదికి తరలివచ్చారు. అందుచేత దక్షిణ భారతం అత్యధిక సంఖ్యాకులు నాగులచేత నిండిపోయింది. ఉత్తరాదిన మైనార్టీగావున్న నాగులు ఆయా స్థానిక జాతులతో కలిసిపోయారు.

భారతదేశ వ్యాప్తంగా దొరికిన శాసనాలు, వస్తుసామగ్రి పరిశీలిస్తే నాగులు దేశమంతా విస్తరించినట్లు ఆధారాలు కోకొల్లలుగా వున్నాయి. వీరు రాజ్యాలు, కోటలు గలిగి గణతంత్ర పాలకులుగా వర్ధిల్లినట్లు చరిత్ర పరిశోధకులు చెపుతున్నారు. నాగజాతి రాజ్య చిహ్నం సర్పం (నాగుపాము). మన ఆంధ్ర యూనివర్శిటీ చిహ్నంలో రెండు సర్పాలున్నాయి. ఆనాడు వీటిని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి (ఆనాడు వైస్ ఛాన్సలర్) గారి సూచనతో నిర్మించినట్లు తెలుస్తుంది. ఈయన బ్రాహ్మణిజానికి వ్యతిరేకి అని అంటారు.

ఈనాటికి నాగయ్య, నాగమ్మ, నాగమణి, నాగేశ్వరరావు పేర్లువున్నాయి. శ్రీకాకుళం జిల్లాలో "నాగవళీ" గుంటూరు జిల్లాలో "నాగులేరు" నది వుంది. విజయనగర సామ్రాట్ శ్రీకృష్ణదేవరాయలు తల్లిపేరు "నాగాంబ" నాగుల చవితి పండగ యీనాటికీ వుంది. ఈనాడు దక్షిణ ప్రాంతంలో ద్రావిడులు అని చెప్పబడే వారంతా నాగులేనని చరిత్ర పరిశోధకులు అంటున్నారు. డా॥ బి. ఆర్. అంబేద్కర్ రాసిన "అస్పృశులెవరు?"లో ఇలా రాసారు. "ద్రావిడ శబ్దం మూలశబ్దం కాదని గుర్తుంచుకోవడం, రెండవ అంశం తమిళ శబ్దానికి సంస్కృత రూపం "దమిళ్" అయింది. ఆ తర్వాత "తమిళ్" అయ్యింది. ద్రావిడ శబ్దం ఒక ప్రజలు మాట్లాడే భాషకు పేరేగాని ఒక జాతికి పేరుకాదు. తమిళ లేక ద్రావిడం కేవలం దక్షిణాత్యులు మాట్లాడే భాషా కాదని, ఆర్యులకు ముందు యావత్తు భారతదేశం మాట్లాడిన భాష అని గమనించవలసిన అంశం, కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకు వ్యవహరించబడ్డ భాష అది. ఆర్యులకు నాగులకు మధ్య సంబంధాలు కలగడంవల్ల నాగుల మీద వారి భాషమీద పడిన తత్ప్రభావముద్ర దక్షిణాపథంలోని నాగుల

మీద ఒకటిగాను ఉత్తరాపథంలోని నాగులపై మరో విధంగాను వున్నదంటే విచిత్రంగా కనిపించవచ్చు. ఉత్తరదేశంలోవున్న నాగులు తమభాష తమిళాన్ని వదలి ఆ స్థానంలో సంస్కృతాన్ని అలవర్చుకున్నారు, దక్షిణాపథంలోని తమిళాన్ని నిలుపుకున్నారు. ఆర్యుల భాషయైన సంస్కృతాన్ని అలవర్చుకోలేదు. యీ తేడాను గుర్తించుకున్నట్లయితే దక్షిణదేశంలోని ప్రజలకు మాత్రమే ద్రావడకపదం ఎందుకు అన్వయించబడిందో అర్థం అవుతూంది. ఉత్తర భారతంలోని నాగులు తమిళం మాట్లాడ్డం మానేసారు, ద్రావిడ నామంతో వ్యవహృతం కాకుండా పోయింది. దక్షిణ దేశంలోని నాగులు ద్రావిడ భాష మాట్లాడే కారణంగానే ద్రావిడులని చెప్పుకోవడం నిలబెట్టుకున్నారు. ఉత్తర భారతంలోని నాగులు ద్రావిడ భాషను మాట్లాడ్డం విరమించుకున్నాక ఆ భాషను మాట్లాడే ప్రజలు తామొక్కరే కాబట్టి ద్రావిడులని పిలుచుకోవలసిన అవసరం వుంది. దక్షిణాత్యులు ద్రావిడులని వ్యవహరించడానికి నిజమైన కారణం ఇదే".

ఈ పై వివరణను బట్టి ద్రావిడులు, నాగులు తెలుగులు ఒకేజాతికి సంబంధించిన వేరు వేరు పేర్లతో వ్యవహరించేవారని అర్థమౌతుంది.

హరప్పా - మొహంజోదారో, తుంగభద్ర నాగరికతలు నాగులకు చెందినవవి విదేశీ పూరాతత్వ శాస్త్రవేత్తలు ఎన్ని ఆధారాలు చూపిన అగ్రకులాలు వాటిని వెలుగులోనికి రాకుండా చేసారు. పైగా నాగులు అనాగరికులని, అపరిశుద్ధులని విద్యాలయాలతో సహా వుద్దేశపూర్వకంగా అబద్ధాలు ప్రచారం చేసారు. దీనిపై డా॥ అంబేద్కర్ అస్పృశ్యులు ఎవరు? అన్న గ్రంథంలో ఇలా రాసారు. "ఋగ్వేదంలో నాగులుగురించి ప్రస్తావించిన దాన్ని బట్టి వాళ్ళు అతి ప్రాచీనులని అనాగరిక ప్రజలు కారని ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి. నాగప్రజలకు భారత ఉపఖండంలో రాజకుటుంబాల అంతర్వివాహాలవల్ల చాల సన్నిహిత సంబంధాలు వుండేవని చారిత్రకంగా ఋజువైంది." అంతేకాదు డా॥ అంబేద్కర్ మరింత వివరంగా ఇలా అన్నారు, "ద్రావిడులన్నా నాగులన్నా ఒకే ప్రజలకు వాడబడ్డ విభిన్న పేర్లు మాత్రమే. ఇది చాలా మందికి దిగ్భ్రాంతి కలిగించక మానదు. చాల దీర్ఘకాలం చేసిన ప్రచారంవల్ల దిగ్భ్రాంతి కల్గించేమాట వాస్తవమే. అందుకే అనేకమంది శాస్త్రవేత్తలు పరిశోధనా వాస్తవాలు కోకొల్లలుగా ఉదహరించారు.

"రామాయణంలోని దక్షిణాపథం" అనే వ్యాసంలో ప్రొఫెసర్ దక్ష వార్ ఇలా రాసారు. "నాగులు సముద్రయాన జాతి. నాగరికతకు సౌందర్యానికి ప్రసిద్ధి. క్రీ. శ. 10వ శతాబ్దంలో అధికారానికి వచ్చిన చోళ వంశాలతో వాళ్ళు కలిసిపోయారు".

నాగులపై ఎంతో పరిశోధన చేసిన సి. యస్. హక్టహెూం ఇలారాశారు. "ప్రాచీన కాలంనుంచి ద్రావిడ ప్రజలు చేర, చోళ పాండ్యులుగా చీలిపోయి వున్నారు. ద్రావిడులలో "చేర" లేక "శార" శబ్దం "నాగ" శబ్దానికి తుల్యార్ధకం - శారమండలం అంటే నాగద్వీపం లేక నాగదేశం".

అంతేకాదు క్రీ. శ. తొలి శతాబ్దంలో తెలుగుదేశం తత్ పరిసర ప్రాంతాలలో నాగులు అధికారంలో వున్నట్లు అనేక ఆధారాలున్నాయి. శాతవాహనుల తర్వాత వచ్చిన శాతకర్ణులు కొద్దో గొప్పో నాగరక్తం పంచుకుని పుట్టినవారేనని చరిత్రలు చెపుతున్నాయి.

క్రీస్తుకు పూర్వం మూడువేల సంవత్సరాలనాడే నవ నాగరికతలో నాగులు వర్ధిల్లినట్లు తేలింది.

బౌద్ధ ధర్మం నాగాల తాత్విక సిద్ధాంతము. వీరి కాలములో బౌద్ధం మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లింది. నాగాల విశిష్ట నాగరికత సుమారు వెయ్యి సం॥లు దేదీప్యమానంగా వర్ధిల్లింది. నాగులు బౌద్ధధర్మాన్ని ఇరుగు పొరుగు దేశాల్లో వ్యాపింప చేశారు.

ఎన్ని అవాంతరాలు ఎదురైనా 12వ శతాబ్దం వరకు నాగజాతి రాజులు ఈ దేశంలోని అత్యధిక భూభాగాన్ని పాలించారు. నాగులను ఓడించేందుకై, ఆర్యులు వివిధ తెగల మధ్య, జాతుల మధ్య చీలికలు కల్పించి ప్రలోభాలు చూపి ఎన్నో కుట్రలు, కుయుక్తులు పన్నారు. చివరకు విదేశీయుల సహాయాన్ని కూడా ఆర్ధించారు. అయినా నాగులు తల వంచలేదు. రాజ్యాలు పోయినా తమ ఉనికిని, ప్రత్యేకతను నిలుపుకున్నారు. ఆర్యులతో కలిసిపోలేదు. నేటి దళితులే నాటి నాగులకు వారసులుగా మిగిలి వున్నారు. ఇదే చరిత్ర చెప్పిన సత్యం.

తెలుగుదేశం నాగుల నివాసమని అనేక చరిత్రాంశాలు సాక్ష్యాధారాలున్నట్లు చూశాం. ఆర్యులు రాకపూర్వం ఈదేశాన్ని పాలించింది నాగులేనని

వేరే చెప్పనక్కరలేదు. చిలుకూరి వీరభద్రరావుగారు రాసిన "ఆంధ్రుల చరిత్రము" అనే ప్రఖ్యాత గ్రంథంలో యిలా రాశారు. మేము పూర్వ ప్రకరణములందు చెప్పినట్లుగ ననారాంధ్రులు తప్పక నాగులనియె మా అభిప్రాయం. ఆర్యులు కొందరు నాగుల పక్ష మవలంబించి నాగుల మతమునే కొంతవరకు స్వీకరించి యార్యాచారముల గొంతవరకు నాగులచేత నవలంబింప చేసిన వారార్యాంధ్రులు. ఆ కారణముచేతనే ఐతరేయ బ్రాహ్మణమునం దాంధ్రులు కిరాతక జాతులతో చేర్చబడి యున్నారు. అటు పిమ్మట నాగరాజులు ఉత్తర దేశపు ఆర్యులతో పోరాడి దక్షిణమునకు వచ్చి దండకారణ్య ప్రదేశమున స్థావరము లేర్పరచుకుని తమ రాజ్యమును విస్తరింపజేపి యుందురు. వీరినే మన్వాధి స్మృతి కర్తలు. యవనులు, చీనులు, పహ్లావులు, కిరాతకులు మొదలగు వారితో చేర్చి తరుమబడిన క్షత్రియులని (ద్రావిడులని) పేర్కొని యుండును.

గుంటూరు జిల్లాలోని పల్నాడు చరిత్రాత్మకమైంది. ఈ పల్నాటి వీరరస చరిత్ర అందరికి తెలిసిందే ఈ ప్రదేశాన్ని పల్లవుల ఏలుబడికి ముందు నాగులు పాలించారు. ఈ పల్నాడు మీదుగా నాగులేరు ప్రవహిస్తుంది. ఈ పేరు ఆనాటి నాగులచేతనే పెట్టబడి వుంటుంది. అలాగే పల్నాటి సంగ్రామాన్ని నడిపిన నాయకురాలు నాగమ్మ పేరు నాగులను సూచించే ఒక ప్రత్యేకత కల్గివుంది.

నాగుల కుటుంబ వ్యవస్థ బలమైన పునాదుల మీద నిలబెట్ట బడింది. నాగులు మాతృస్వామిక వ్యవస్థ అమలు జరిపారు. స్త్రీలకు ప్రాధాన్యత ఇచ్చారు. స్త్రీ–పురుషులు అక్క–తమ్ములవలె, మంచి స్నేహితులవలె సరి సమానులుగా జీవిస్తారు. కలసి మెలసి వుంటారు. వారి కళలు, బొమ్మలు ఇందుకు నిదర్శనం. స్త్రీ పురుషునితో సమానం.

తూర్పుగోదావరి జిల్లాలో 20 తెగలు ఆదిమవాసులున్నారు. వీరు ద్రావిడ, ముందార, భాషలు మాట్లాడతారు. వీరిలో సవరులు, గోండ్లు, కౌరవ, చెంచులు, కోయలు, కొండరెడ్లు, ఎరుకలు, యానాది ముఖ్యులు. వీరంతా నాగజాతిలో ఉపజాతులే.

హిందూ ఇతిహాసాలు నాగులను నీచంగా వర్ణించి ప్రచారం చేసాయి. అసురులు మ్లేచ్ఛులు, నక్తంబరులు, యవనులు, హూణులు, యక్షులు,

గంధర్వులు, కిన్నెరలు, కింపురుషులు, శకులు వగైరా తెగలు ఆర్యులు కారు. వీరంతా ఆర్యులకు బద్ధ విరోధులు. వీరిని ఆర్యులు మాయోపాయము చేత కృత్రిమంగా, క్రూరంగా, వంచనతో ఓడించారు. వారి పుక్కిటి పురాణాల్లో గాధలనే చూద్దాం. భీముడు ప్రేమించి పెళ్ళిచేసుకున్న హిడింబి ఘటోత్కచుడిని కన్నది. శూర్పణకను ముక్కు చెవులు కోసి లక్ష్మణుడు అవమానించాడు. పాండవ మధ్యముడు 'ఉలూచి' అను నాగకన్యను వివాహ మాడాడు కృష్ణుని మనుమడైన అనిరుద్ధుడు నాగరాజు అయిన భాణుని కుమార్తె ఉషాకన్యను ప్రేమిస్తాడు. ఈ వివాహాన్ని ఆర్యులు అంగీకరించినా నాగులు అంగీకరించలేదు. మోసపూరితమైన యుద్ధం చేసి ఉషా కన్యను అపహరించి ఎత్తుకుపోయారు. ఈలాంటి కథలు భారతంలో కోకొల్లలు. అందమైన నాగ స్త్రీలను కృత్రిమంగా, అందవిహీనులుగా, క్రూరమైన ఆకృతిగల వారుగా, రాక్షసులుగా వర్ణించి ప్రచారం చేసారు. నాగ స్త్రీలను ఆర్యులు పెండ్లాడవచ్చుగాని ఆర్య స్త్రీలను ఆర్యేతరులు వివాహ మాడరాదు. పురాణాలు నాగ స్త్రీలను వివాహమాడినట్లే చిత్రించారు. ఆర్య స్త్రీలను ఆర్యేతరులు వివాహము చేసుకున్నది అరుదు. యక్షరాజు రావణబ్రహ్మ భార్య మండోదరి (సీతకంటె అందమైనది) వంటి నాగ స్త్రీలను పతివ్రతల జాబితాలో చేర్చారు. ఇక్కడకు వచ్చిన ఆర్యులు కూడా నాగులను చూచి అనేకం నేర్చుకున్నారు. ఇక్కడున్న పద్ధతులను అనుసరించక తప్పిందికాదు. వివాహ వ్యవస్థ అప్పటికి స్థిరపడలేదు. రామాయణం నాటికి నిలదొక్కుకుంది. భారతంలోని నియోగి పద్ధతి (భర్త అనుమతితో ఇతరులవల్ల పిల్లలను కనవచ్చు. కుంతి అలాగే కన్నది.) బహుపత్నీత్వం ఆనాటి విధానాలు. (ద్రౌపది 5గురు భర్తలు కల్గివుంది) అహల్య, తార, ద్రౌపది, సీత, మండోదరి వంటి వారిని మహా పతివ్రతల జాబితాలో చేర్చారు.

ఋగ్వేదకాలంనాటికి జీవిత భాగస్వామిగా ఉన్న స్త్రీని అధర్వణవేదం వచ్చేనాటికి పిల్లలు కనే యంత్రంగా మార్చేసారు. అందుకే వేదాలు అపౌరుషేయాలని బ్రాహ్మణులు చేసే ప్రచారాన్ని నెహ్రూ తన "భారత దర్శనం" గ్రంథంలో ఖండించాడు. వేదాలు మానవులు రాసినవే అని రుజువుచేశాడు. 'ధర్మం' అంటే కర్తవ్యాన్ని ప్రబోధించే శాసనం. ఈ ధర్మం ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క విధంగా మారుతూ వచ్చింది. ఎల్లకాలానికి ఒకే ధర్మం చెల్లుబాటు కాదు. మానవుని జీవితావసర వస్తువులు ఉత్పత్తిచేసే సాధనాలు

మారినపుడల్లా ధర్మం మారుతూ వచ్చింది. వ్యవసాయంలో వచ్చిన అభివృద్ధిలో నూతన రాజ్య వ్యవస్థకు పునాదులు పడ్డాయి. సంచార తెగలు స్థిరపడ్డాయి. నాగరికతకు మూలమైంది. ఒక దశలో వర్ణసంకరం విపరీతంగా సాగింది. అదే కులాల పెరుగుదలకు దారి తీసింది. మరో దశలో వర్ణాంతర వివాహాలు నిషేధించబడ్డాయి. అందుచేతనే ఆర్యులు రాసిన ధర్మశాస్త్రాలు పరస్పర విరుద్ధంగా వున్నాయి. నాగులను (ఈనాడున్న ఎస్. సి. ఎస్. టి. బి. సి. ల వగైరా దళితులను) అణచివేయడానికే స్మృతులు రాసారు. మను ధర్మశాస్త్రం క్రీస్తుకు పూర్వం 105 సం॥లో రాసారు. ఇది 24 ప్రకరణలు 1080 చాప్టర్లు లక్ష శ్లోకాలు కల్గివుంది. "ధర్మం'' అనే మాటకు ఆనాటి భాషలో కర్తవ్యం అని అర్థం.

## పురాణ, ఇతిహాసాలలో నాగులు

పురాణల, ఇతిహాసాల రూపంలో ఆర్య బ్రాహ్మణులు తమ చరిత్రను రాసుకున్నట్లు అర్థమవుతుంది. వీరికి ప్రధాన శత్రువులైన నాగులను నీచంగా వాటిలో వర్ణించారనేది యిదివరకే చూసాం.

రామాయణంలో సుగ్రీవుడు సీతను వెతుకుటకు వానరులను పంపుతూ భోగవతిపురం గురించి వర్ణించి చెప్పను. ఈ నగరాన్ని వాసుకి అను నాగ రాజు పాలించేవాడు. ఈ భోగావతిపురం దక్షిణాపథంలో వున్నట్లు చెప్ప బడింది. అనగా దండకారణ్యం ఏదో ఒక భాగంలో వుండి యుండును.

భాగవతంలో శ్రీకృష్ణుడు కాళీయుడనే నాగరాజును మర్దించినట్లు, కాళిందీ కన్యలను వివాహమాడినట్లు కూడా చూచాం. యిక్కడ విడ్డూరం ఏమంటే కాళీయుడను నాగపాముగా చిత్రించారు. నాగపాముకి చెందిన కన్యలు నాగపాములే అయితే కృష్ణుడు వాటిని ఎందుకు వివాహమాడినట్లు ? యిలాగ తలా తోకా లేని కథలు గాధలతో నిండి వున్నాయి.

అలాగే మరో కథ కూడా మరింత విడ్డూరంగా వుంది. అమృతంకోసం దానవులు-దేవతలు వాసుకి అనే సర్పం తాడుగా చేసుకుని మందర పర్వతం కవ్వంగా నుపయోగించి పాల సముద్రాన్ని మథించినట్లు భాగవతంలో చెప్ప బడింది. అనగా యిక్కడ దేవతలనగా బ్రాహ్మణులు; దానవులనగా నాగులు.

దేవతలు దానవులను మోసంచేసి వాసుకి అను నాగరాజు సహాయంతో తమ ప్రదేశాన్ని కాపాడుకుని వుంటారని అర్థమవుతుంది. నాగులు గురించి లెక్క లేనన్ని కథలు పురాణాల్లో సాక్షిగా నిలిచాయి.

తక్షకుడనే నాగరాజు తన తండ్రిని చంపినందుకు ఆగ్రహించిన జనమేజయుడు నాగవంశము నంతను నాశనంచేయ తలపెట్టెను. ఆర్య ఋషు లందరిని ప్రేరేపించి 'సర్పయాగం' పేరుతో దొరికిన నాగులందరిని నిర్మూ లించారు. చాలామందిని యీ యాగంపేర సంహరించడం జరిగింది. దీనితో నాగులలో ప్రతీకారజ్వాలలు మిన్నుముట్టాయి. యిది గమనించి కొంత కథ నడిచాక సర్పయాగం ముగించారు. ఈ సందర్భంగా కొందరు నాగులు ఆర్యులుగా మారడం, కొందరు ఆర్యులు నాగులపక్షం వహించడం జరిగింది. ఘోరమైన ఈ దుర్మార్గ సర్పయాగం తర్వాత నాలుగు వందల సంవత్సరాల వరకు నాగుల చరిత్ర కనబడకుండా పోయింది. (క్రీ. పూ 678 వరకు) తిరిగి నాగజాతికి చెందిన శిశునాగ వంశంవారే మగధ రాజ్యాధిపత్యం వహిం చింది తెలిసిందే. ఈ వంశానికి చెందిన కడపటి తొమ్మిదిమంది నందులలో కూడా చంద్రగుప్తుడు సింహాసన మెక్కేవరకు నాగులు పాలించినట్లు చరిత్రల వల్ల స్పష్టమవుతుంది. నాగులైన నందులను నాశనము చేసేందుకు ఆర్య బ్రాహ్మణుడైన చాణిక్యుడు చంద్రగుప్తుని చేరదీసి కౌటిల్య రాజనీతితో వ్యవ హరించిన సంగతి మనకు తెలిసిందే. కుటిలాత్ముడైన చాణిక్యుని ఈనాడు అగ్రకులాలు సినిమాతీసి ఆకాశానికెత్తి పొగుడుతున్నారు.

క్రీ. శ. రెండవ శతాబ్దమున పాలించిన మల్లిగనాగు, చందనాగు, కూడ నాగు, శ్రీనాగు అనువారలు నాగవంశజులని వేరే చెప్పనక్కరలేదు. తమిళ కావ్యములందు నాగుల చరిత్రలు ఎంతో ఘనంగా వివరించబడింది. ద్రావిడ దేశమందలి మరవలత్రి, యినారులు, ఒరియారులు, ఒనియారులు, అరద లారులు, వరదవారులు మొదలగు తెగలవారందరు నాగులని చెప్పబడింది. 11వ శతాబ్దినుంచి ఒలియర్లన్న నాగజాతివారు పరాక్రమశాలురుగా ఒక శాసనమందు వర్ణించబడింది. కరికాల చోళుడు వీరిని జయించెనని ఒక తమిళ కావ్యమందు వర్ణించారు.

బుద్ధుని దంతము గురించి అనేక గాథలున్నాయి. వాటి సారాంశం యిలాగుంది. కృష్ణానది తీరానున్న అమరావతి నగరమే ఆనాటి ధరణికోట.

దీనినే దాన్యకటకం అంటారు. ఆ గాథల్లో ఉదహరించిన కట్టడం అమరావతి స్తూపమని నిశ్చయముగా చెప్పవచ్చు. ఈ స్తూపం నందలి చిత్రపు బొమ్మ లను పరిశీలిస్తే నాగుల, నాగరాజుల జీవిత చరిత్రలు గోచరిస్తాయి. దీన్నిబట్టి ఈ ప్రదేశం ఆనాడు నాగుల కాటపట్టని, నాగరాజులచే పాలించబడెనని స్పష్టమవుతుంది. ఈ చిత్తరువులలో ఇద్దరు బుద్ధుని బొమికలు పట్టుకుని పడవ టాపుపై నిలిచి ఒడ్డునకు వస్తుండగా నాగరాజు వారికి స్వాగతం చెప్పి నట్లుంది. ఇక్కడ నాగరాజులకు సంబంధించిన అనేక చిత్తరువులున్నాయి. దీన్నిబట్టి ఆనాటి ధరణికోట (దాన్యకటకం) నాగరాజులకు రాజధానిగా వుండెనని తెలుస్తుంది. ఈ చిత్తరువులలో నాగరాజులకు ఏడేసి పడగలుగల పాములు, రాణులకు మూడేసి పడగలుగల పాములు, శిరమునకు వెనుకప్రక్క చిత్రించాడు. ఇతర నాగులకు ఒక్క పడగ మాత్రమే వున్న పాములున్నాయి. దీన్ని పరిశీలించగా తేలిందేమంటే బౌద్ధానికి పూర్వం తెలుగుదేశమందు నాగులకు నాగబాము రాజ చిహ్నంగా వుండి, అదే తరువాత కాలంలో ఇల వేల్పుగా మారివుండవచ్చు. ఈ విషయం యిదివరకు చెప్పేవున్నాం.

## ద్రావిడులే నాగులు

నాగులే ద్రావిడులనే అంశముపై చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రము "అన్న గ్రంథములో ఇలా రాశారు." ఎవరిని ద్రావిడు లని ఉద్ఘోషించుచున్నారో వారి పూర్వులే నాగులు. పూర్వము వారికి నాగు లనియె పేరు గలిగి యుండెను. గాని ద్రావిడులని పేరు గలిగి యున్నట్లు గన్పట్టదు. ద్రావిడులను పేరు ఇటీవల సంస్కృత గ్రంథకారులు, స్మృతి కర్తలు మొదలగు వారిచే బెట్టబడినది; గాని నాడు స్థిరమైనదిగాదని తోచు చున్నది. నాగులే ద్రావిడులని మా యభిప్రాయం సరియైన యెడల దక్షిణా పథ వాసులను ద్రావిడులనుటకు మేమంగీకరింతుము". ఇదే అభిప్రాయాన్ని డా॥ అంబేద్కర్ తన పరిశోధనలో బయటపెట్టడం తెలిసిందే.

పురాణాలలో ఈ నాగుల దేశాన్ని నాగలోకంగాను పాతాళలోకంగాను చిత్రించారు.

ఈనాటి ఢిల్లీనగరం ఆనాడు ఖాండవవనం. దీనిని నాగులు పాలించే వారు. శ్రీకృష్ణుని సహాయంచే ఖాండవవనం దహించి నాగులను ఓడించారు.

తక్షకుడనే నాగరాజుని తప్ప మిగిలిన నాగుల నందరిని నిర్మూలించెనని చెప్పబడింది. ఈ ప్రదేశమునందే పాండవులు "ఇంద్రప్రస్థ" అను నగరమును నిర్మించారని భారతంలో చెప్పబడింది.

ఖాండవవనం దహనం తర్వాత ఓడిపోయిన నాగులకు చెందిన నాగ కన్యలను అర్జునుడు వివాహమాడినట్లుంది. అర్జునుడు సమయభంగ కారణంగా తీర్థయాత్రచేసిన సందర్భంలో ఉలూచి అను నాగకన్యను వివాహమాడెను. మణిపురాధీశుడగు నాగరాజు చిత్రవాహనుని కుమార్తె చిత్రాంగదను అర్జునుడు వివాహమాడినట్లు, ఆమెకు బబ్రువాహనుడను కుమారుడు జన్మించినట్లు, ఉలూచికి ఇరావంతుడను కుమారుడు జన్మించెనని, యితడు భారత యుద్ధంలో చనిపోయెనని వారి గ్రంథాలలోనే రాసుకున్నారు. బబ్రువాహనుడు బహు పరాక్రమవంతుడు. ధర్మరాజు రాజసూయయాగాన్ని ఎదుర్కొన్నాడు. అర్జునునితో పోరాటం సాగించి, చివరకు తండ్రియని తెలిసి సహకరించాడు. పాండవుల తర్వాత సింహాసనమెక్కిన పరీక్షిత్తురాజు కాలమున నాగులకు ఆర్యులకు వైరం మరింత తీవ్రమైంది. అర్జునుని మనుమడైన పరీక్షిత్తురాజు తపస్సు చేసుకుంటున్న ఋషిమెడలో చచ్చిన పాముని వేసినందున ఋషికుమారుడు ఆగ్రహించి తక్షకుడనే నాగరాజుని ప్రోత్సహించి పరీక్షిత్తుని చంపించెను. ఈ కథలో తక్షకుని పాముగా చిత్రించారు.

దక్షిణాపథమనగా నర్మదానదికి దిగువ భాగం. దక్షిణ శబ్దంనుండి దెక్కన్ శబ్దం పుట్టిందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. హిందీలో దెక్కన్ అనే పధం ఇంగ్లీషులో డెక్కన్ వాడుకలోకి వచ్చింది. డెక్కన్ దేశమనగా దక్షిణపథమని చెప్పబడుతుంది. ఆర్యులు ఉత్తరం నుండి దక్షిణంనకు వచ్చిన మార్గంనకు దక్షిణాపథమని కూడా అంటారు, ఈ దక్షిణాపథంలోని దేశాలకు దక్షిణపథ దేశాలని చెప్పబడింది. వింధ్య పర్వతములకు ఉత్తరం నున్న దేశములను ఆర్యావర్తన మనియు, దక్షిణ భాగమున నున్న ప్రాంతాలను మ్లేచ్ఛ దేశములనియు, ద్రావిడ దేశములనియు, దక్షిణాపథమనియు ఆర్యులు తమ సంస్కృత గ్రంథాల్లో రాసుకున్నారు. ఎవరు ఏమి చెప్పినా తెలుగుదేశము దక్షిణాపథంలోనిదని వ్యవహరించ బడింది.

ఆనాడేగాక యిటీవల చరిత్రలలో కూడా నాగులగురించి ఎంతో వివరణ బైటకు వచ్చింది. క్రీ. శ. 4వ శతాబ్దం మధ్య సముద్రగుప్తుడను గుప్త

చక్రవర్తి దక్షిణాది దిగ్విజయ యాత్రకు బయలుదేరి గణపతి నాగడను ఒక నాగరాజును జయించినట్లు చరిత్రలు చెపుతున్నాయి.

బుద్ధుడు బౌద్ధధర్మ ప్రచారానికి సింహళద్వీపం వెళ్ళడం జరిగింది. ఆనాడది నాగద్వీపంగా పేరు గాంచెను. దానిని ఆనాడు మహోదరుడను నాగరాజు పాలించెను. ఆ రాజ్యానికి చెందిన అపురూప వజ్రసింహాసనముకై నాగరాజుల మధ్య వచ్చిన వివాదాన్ని బుద్ధుడు పరిష్కరించి వారికి జ్ఞానోదయం కల్గించెను. చివరకు నాగరాజులు ఆ వజ్ర సింహాసనాన్ని బుద్ధునికి సమర్పించెను. ఆనాడు ఆ సింహాసనంమీద కూర్చుండే బౌద్ధ ధర్మమును ప్రబోధంచేసి యెనుబదికోట్ల నాగులను బౌద్ధులుగా మార్చెనని బౌద్ధ గ్రంథాలలో చెప్పబడింది. (రత్నాకరి, రాజావళి మొదలగు చరిత్రలు).

అలాగే కళ్యాణీపురాధీశుడగు నాగరాజుని కూడా బుద్ధుడు తన మతంలోకి చేర్చుకుని వజ్ర సింహాసనాన్ని అతనికిచ్చి అక్కడొక వృక్షమును నాటి తిరిగి వచ్చెను. ఆయన తిరిగివస్తూ నాగరాజులారా ! ఈ పవిత్రమైన వృక్షాన్ని కాపాడి మీ మనస్సులను శాంతి పర్చుకోండని బోధించెను.

ఆనాడు బుద్ధుడు మహా తపస్సులో మునిగివున్న దశలో ఎండా వాన తగలకుండా ముచిలిందుడను నాగరాజు రక్షణ కల్పించెను. దానినే ఒక మహా శిల్పి నాగజాతి చిహ్నం నాగపాముని ఏడు పడగలుగా చిత్రించి బుద్ధునకి నీడ కల్పించినట్లు అద్భుతంగా మలిచాడు. బౌద్ధజాతక కథలను ఆదారం చేసుకుని ఆశిల్పి దీనిని చిత్రించాడు. ఈ శిల్పం నాగార్జున కొండవద్ద వుంది.

"ఆంధ్రుల చరిత్ర" అనే గ్రంథంలో శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం యిలా రాశారు. "క్రీ. పూ. 7వ శతాబ్దమందు మగధ రాజ్యమును నాగవంశజులగు రాజులు పాలించిరని చరిత్రలవలన మనకు తెలియుచున్నది. ఈ వంశం శివనాగ వంశమని పిలవబడుచుండెను. ఈ వంశస్థులా కాలమున దక్షిణ ప్రాంతములో నివసించుచున్న నాగజాతికి చెందినవారే యనుట అసమంజసం కానేరదు. చంద్రగుప్త మౌర్యునిచే రాజ్యభ్రష్టులు కావించబడిన నందులు కూడా ఈ వంశీయులేనని తోచుచున్నది". ఆ గ్రంథంలో ఇంకా యిలా రాశారు. "శివనాగ వంశంలో ఆరవవాడైన యజాతశత్రువుని కాలములో మహనీయుడగు గౌతమ బుద్ధుడు జన్మించెను". దీన్నిబట్టి నాగుల ప్రశస్తి బోధపడగలదు.

ఈలాంటి అనేక విషయాలు పరిశీలించిన మీదటనే చిలుకూరి వీరభద్రరావుగారు 'ఆంధ్రుల చరిత్రము' లో యిలా రాశారు. "మన దేశ చరిత్రను వ్రాసిన గ్రంథములయందు పాశ్చాత్యులేమి, హైందవ చరిత్రకారు లేమి, తాము వ్రాసిన గ్రంథములయందు నాగుల చరిత్రమును విశదీకరించక యేమి కారణముచేతనో విస్మరించి యున్నారు. నాచుచే గప్పబడిన శుద్ధ జలమువలెనే వీరి చరిత్రయంతయు బురాణగాథలచే గప్పబడి చరిత్రకారుల నేత్రములకు గోచరంగాక యుండెను. ప్రాథమికార్యులు దస్యులతో పోరాడి నట్లుగ ఋగ్వేదాదులయందు దఱచుగా గనబడుచుండినను, తరువాత వచ్చిన యార్యులీ నాగులతోడను, నాగకుటలతోడను బోరాడినట్లుగా మహాభారత గ్రంథములయందు గానబడుచున్నది. ఆంధ్రుల దండకారణ్యమందాంధ్ర రాజ్యమును స్థాపించి పరిపాలనచేసి వాసికెక్కుటకు పూర్వమీ నాగులీ దండ కారణ్యమును ఆక్రమించి కిరాతక జాతులన్నింటిని జయించి రాజ్యమును స్థాపించి పరిపాలన చేసినట్లుగ గాన్పించుచున్నది".

నాగులు తదితర స్వదేశీ జాతుల చరిత్రలను భాషలను నాశనం చేసిన కారణంగా పశ్చిమ దేశ చరిత్రకారులు కూడా తమ చరిత్రలను ఆర్యబ్రాహ్మణులు పుక్కిటి పురాణాలమీద ఆధారపడి రాశేరనేది మనం గుర్తించు కోవాలి.

## నాగుల బౌద్ధం

శివుడు నాగులకు పూజనీయుడయ్యాడు. తర్వాత కాలంలో శివుడిని కూడా ఆర్యులు తమ దేవుళ్ళ జాబితాలోచేర్చి విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులుగా త్రిమూర్తులుగా చేశారు. శివుడిని తమ సొంతం చేసుకుని నాగులను అనుసరించే అనేక మందిని ఆర్యులు వంచన చేశారు.

హిందూ మతంలోని ఏ దేవతకైనావున్న "నాగాభరణం" తెలుగు వారిని జయించామని చెప్పుకునేందుకు గుర్తు. నాగుల రాజ చిహ్నం నాగు పాముని విష్ణువు పాన్పుగా మార్చడం; దేవసేనాపతి కార్తికేయుడి కాళ్ళ దగ్గర పాము పడివున్నా, కృష్ణుడు కాళీయమర్ధనం పేరుతో నాగుపాము శిరస్సును తన పాదాలతో తొక్కిపెట్టినట్లు చూపినా ఇవన్నీ తెలుగువారైన

నాగులను తొక్కిపెట్టామని చెప్పుకోవడానికే నాగజాతి చిహ్నంను అవమాన పర్చడమే.

అమరావతిలోని స్తూపాలు. బోధివృక్షం. బుద్ధుని పాదముద్రలు, ధర్మ చక్రం, బుద్ధుని ఆయన శిష్యుల భౌతికావశేషాలు వాస్తవ ప్రమాణంలో ఉన్న బుద్ధమూర్తులు నాగరాజుగా మూర్తిభవించిన బుద్ధవిగ్రహం ఆరాధించబడేవి. మొదటి రోజులలో బుద్ధునికి రూపారాధన లేదు. ఆయన సాంకేతికాలైన వస్తువులను పూజించేవారు. నాగారాధన బౌద్ధమతంలో వేళ్ళూనుకుంది, మొదట రాజచిహ్నంగా ఉన్న నాగుపాము రానురాను ఆఖరు దశలో పూజా మూర్తిగా మారిపోయింది. స్తూపాలకు పాము చుట్టుకొని వున్నట్లు నిర్మించడం, నాగరాజులు స్తూపాలకు పూజ చేయడం, పడగక్రింద పాముచుట్ట మీద బుద్ధుడు కూర్చొని వుండటం వంటి చిత్రాలు ఉన్నాయి. ఇవన్నీ బౌద్ధం పట్ల నాగుల గాఢాభిమానాన్ని తెలియజేస్తాయి.

తెలుగులు నాగపూజావలంబకులు. వీరి బౌద్ధ శిల్పాలలో నాగమూర్తి విన్యాసం, అలాంటి నాగ-నాగిని సింహళ శిల్పాలలోను, ఎక్కువ భంగిమలలో దేహసౌష్ఠవంలో అలంకారాదులలో వస్త్ర విన్యాసంలో, అనురాధా పురాదులలో వున్న ప్రాచీన శిల్పాలలో తెలుగు (నాగాల) శిల్పాలకు ప్రతి రూపాలే.

వ్యవసాయం అభివృద్ధి చెందటానికి ప్రజలు బౌద్ధాన్ని బాగా ప్రోత్సహించారు. బ్రహ్మణిజం అనుసరించిన యజ్ఞాలు, యాగాలు, జంతు బలుల వల్ల పశుసంపద ఎంతో నష్టపోయింది. దీనితో వ్యవసాయం నష్టపోయింది. పంటలు దెబ్బతిన్నాయి. కరువు కాటకాలు ఏర్పడ్డాయి. దీనితో ప్రజలకు ఆర్య సంస్కృతిమీద అసహ్యం పుట్టింది. ఇట్టి పరిస్థితులలోనే బౌద్ధం పుట్టుకొచ్చింది. బౌద్ధానికి మంచి గుర్తింపు వచ్చింది. దక్షిణ భారతంలో తెగలన్నింటిలోను నాగజాతి బౌద్ధాన్ని అభివృద్ధి చేసింది. తెలుగు సంస్కృతిలో బాగా లీనమైన తెగలలో నాగులు ముఖ్యులు. కణ-బెణ (కృష్ణానది) ప్రాంతం నాగలోకమని పిలువబడేది. అమరావతి, నాగార్జున కొండ శిల్పాలలో రాజులు, రాణులు శిరోవేష్టనాల మీద పాము పడగలుండటం, వారు నాగ జాతి వారనడం సుస్పష్టం. సింహళ రాకుమారుడు బుద్ధిని దండాన్ని తీసుకు వెళ్ళిన కథలో కృష్ణానదీ ముఖద్వార ప్రాంతపు నాగరాజు ప్రసక్తివుంది.

అమరావతి శిధిలాలో "నాగులు" అనే మాట వున్న రాతిపలక దొరికింది. హాలుని రాజ్యకాలంలో బృహత్కథ రాసిన గుణాఢ్యుడు ఒక నాగరాజుకి బ్రాహ్మణ కన్యకు కలిగిన సంతానం. శాతకర్ణి భార్య నాగనిక నాగజాతి పడుచు.

బుద్ధిని కాలాన్ని నేటి కాలంతో పోల్చితే మనకెంతో ఆశ్చర్యం కల్గుతుంది. బుద్ధినికాలం భారత ఉపఖండం జనాభా 2.50,00,000 మాత్రమే (2 1/2 కోట్లు) సూర్యచంద్ర రాజులమని చెప్పుకునే రాజవంశాలన్నీ మహాభారత యుద్ధాలలో (ఆనాడది ఒక కొండ తెగల పోరాటం) నశించగా నాగవంశీయులైన శిశునాగ, శివనాగ వగైరా పేర్లతో క్షత్రియులైనారు. క్షత్రియత్వం పొందిన వీరిని సుక్షత్రియులుగా బ్రాహ్మణ పురోహిత వర్గాలు గుర్తించలేదు. అందుకే వీరంతా (శూద్రులు) గౌతమ బుద్ధుని ఆకర్షించారు. ఇది జరిగి ఇప్పటికి 2600 సంవత్సరాలైంది.

బ్రహ్మణిజానికి వ్యతిరేకంగా ఆదినుండి నాగులు పోరాడుతూనేవచ్చారు నాగులు బౌద్ధాన్ని విస్తృతంగా ప్రచారం చేసారు. ఆంధ్రమహావిష్ణువు అనే హిందూ రాజు శ్రీశైలప్రాంతాన్ని పాలిస్తున్న నిశంభువు అనే నాగరాజును చంపి. ఆ రాజ్యాన్ని జయించాడు. నాటి నుండి తెలుగు దేశంలో ఆర్యులకు స్థానం ఏర్పడింది. ఇప్పటి కృష్ణా జిల్లా శ్రీకాకుళంలో ఆంధ్ర విష్ణువు పేర ఒక దేవాలయం వుంది. ఆనాడు నాగులను ఓడించడంలో మొత్తం బ్రహ్మణ సంఘాలన్నీ ఏకమై ఒక సమాఖ్యగా ఏర్పడి ఈ కుట్ర చేసారు. తదనంతరం నాగులు ఉత్తరం తరలి వెళ్ళి వాకాటు రాజులై శాతవాహనులను ఓడించారు.

చివరకు అనేక మాయోపాయాలతో నాగుల రాజ్యాలను కూలదోసారు. నాగుల పేరు చెబితే బ్రహ్మలు మండిపడిపోయేవారు. క్రూరంగా కూట యుద్ధాలద్వారా (గెరిల్లా యుద్ధం) నాగులను ఒడించి అణచి వేశారు. ఆ నాగులే నేటి దళితులు-శూద్ర-నిమ్న కులాలకు గిరిజనులకు చెందినవారంతా నాగులే.

పశ్చిమ దేశమున మళయాళమున కొంత భాగంనకు "తుళువ" దేశమని పిలువబడేది. ప్రాచీన కాలంలో ఈ దేశాన్ని దళితులే (నాగులు)

పాలించారు. ఉత్తర కర్నాటకమునకు చెందిన కదంబరాజగు మయూరవర్మ పదేపదే యీ దళిత రాజ్యంపై దాడి చేయడం జరిగేది. చివరకు తుళువ దేశపు దళితరాజు హనశిఖుడు మహావీరత్వంతో పోరు సల్పి మయూరవర్మను చావదన్ని తరిమివేశాడు. ఇక గత్యంతరం లేక మయూరవర్మ పుత్రుడు లోకాదిత్యుడు గోకర్ణ నుండి సేనతో వచ్చి దళితులలో నొక తెగవారగు "కొరగారు" ప్రభువు కుటుంబమందలి కన్యను వివాహమాడి తుళువ దేశం లోనే స్థిరపడిపోయేడు. ఇతనికి బ్రాహ్మణులు మంత్రులుగా వుండిరి. తరువాత కాలంలో దళితులకు చెందిన యీ కొరగారు రాజైన నందుడు మంగుళూరుకి సమీపమందలి నందవరు నుండి గొప్ప సైన్యంతో వచ్చి లోకాదిత్యుని జయించి తిరిగి కొరగార ప్రభుత్వాన్ని స్థాపించేడు. 200 ఏండ్లు దళిత రాజు నందుని వంశంవారు తుళువ దేశాన్ని పాలించారు. తరువాతి కాలంలో మయూరవర్మ వంశంవాడగు కామదేవుడు వనవాసంనుండి దండెత్తి వచ్చి దళితులను కౄరంగా ఓడించి హింసించాడు.

ఈ విధంగా భారత ఉపఖండంలో ఆర్యులకు నాగులకు ఎడతెగని యుద్ధాలు జరిగి చివరకు నాగులు ఓటమి చెందారు.

## నాగుల ప్రశస్తి

నేటి ఆధునిక యుగంలోకూడా పచ్చి అబద్ధాలు ప్రచారమవుతున్నాయి సనాతన బ్రహ్మణ కులతత్వ వాది విశ్వనాధ సత్యనారాయణ రాసిన "వేయి పడగలు" నవలకు ఆంధ్ర యూనివర్సిటీవారు బహుమానం ప్రదానంచేసారు. ఈ నవల వర్ణాశ్రమ ధర్మాలను సమర్ధించింది అలాగే "ఆంధ్ర ప్రశస్తి" అనే గ్రంథంలో "నాగ రాజైన విశుంభుడిని రాక్షసుడుగా వర్ణించి ఇతనిని ఆంధ్ర విష్ణువు అను ఆర్యరాజు చతురంగ బలాలతో నాలుగుసార్లు బంధించి వధించాడు అని రాశాడు! ఆ పుస్తకాన్ని కాలేజి విద్యార్థులకు పాఠ్యాంశాలుగా ప్రభుత్వం పెట్టింది. ఆనాటి నాగులను ఈనాటికీ రాక్షసులుగా చిత్రించడం ఎంత దుర్మార్గం! (విజయవాడకు దాదాపు 90 మైళ్ళ దూరంలో వున్న శ్రీకాకుళం గ్రామంలో నేటికి ఆంధ్ర విష్ణు దేవాలయం వుంది.) నాగులను హతమార్చినందున ఆర్యులు ఆంధ్ర విష్ణువుని అవతార పురుషునిగా ఆరాధిస్తారు. కుల వ్యవస్థను సమర్ధించే "వేయి పడగలు" నవలకు బహు

మానం ఇచ్చిన మన విశ్వ విధ్యాలయాలు బ్రాహ్మణాధిపత్యం క్రింద ఎలా మగ్గిపోతున్నాయో దీన్ని బట్టి అర్థం చేసుకోగలం. రాక్షసులు అనే వారు న్నారని ఈనాటికి విద్యాలయాల్లో భోదించడం ఘోరం, దుర్మార్గం !

మరో ఉదాహరణ చూద్దాం: కాళిందుడనే నాగరాజు గొప్ప సామ్రా జ్యం కలిగి ప్రజారంజకంగా పాలించేవాడు, ఆర్యుల అవినీతి చర్యలను ఎదుర్కొనేవాడు. ఇతన్ని హతమార్చేంత వరకు ఆర్యులు నిద్రపోలేదు. జిత్తులమారి శ్రీకృష్ణుని ద్వారా మోసపూరితంగా నయవంచనతో విషపూరిత మైన పానీయాలు ఇచ్చి హత్య చేయడం జరిగింది. ఇదే కాళిందుని మర్దనగా కట్టుకథలు కల్పించారు. ఆనాడు రామాయణంలో చెప్పబడ్డ లంక ఈనాడు మొహంజాదారోగా చరిత్రలో పరిగణించబడుచున్నది. ఆర్యులు సంచారతెగకు చెందినవారు పచ్చిక మైదానాలు వెతుక్కుటూ తిరిగేవారు. యిల్లు వాకిలి నిర్మించుకోవడం ఆనాటికి తెలియదు. అప్పటికే నాగులు వీరికి ఉపజాతిగాని యక్షులు మహానగరాలు నిర్మించుకున్నారు. ఆనాటి లంకా నగరాన్ని రావ ణుడు పాలించేవాడని, రావణుడు శైవ భక్తుడని, మహా అందగాడని, పండితు డని వారి రామాయణంలోనే రాయక తప్పిందికాదు. రామాయణాన్ని రాసిన వాల్మీకి ఎ.సి.కి చెందినవాడు గనుక కొన్ని నిజాలు వెళ్లగక్కక తప్పిందికాదు.

"రాముడు లంకాపట్టణంలో సుందరమైన భవనాలను, దేవాలయాలను తన శక్తివంతమైన బాణములతో నాశనంచేశాడు" (రామాయణ యుద్ధకాండ 75వ అధ్యాయం).

హనుమంతుడు లంకనుచూచి అందులో "చందమామలాంటి, మెరుపు లాంటి సౌందర్యవతులను చూచి ఆశ్చర్యపడతాడు.

రావణుడి భవంతిలో ప్రవేశించిన హనుమంతుడు తనలో తానే యిలా అనుకున్నాడు "ఇది స్వర్గమో లేక అమరుల ప్రదేశమో, అమరావతి నగరమో అయివుండాలి" (రామాయణ సుందరకాండ 9వ అధ్యాయము)

నాగ స్త్రీల సౌందర్యం ఈనాటికి అజంతా చిత్రాలలో చూడవచ్చు. ఇటువంటి నాగులను యక్షులను ఆర్య బ్రాహ్మణులు రాక్షసులుగా వికృతంగా చిత్రించారు.

"యక్షులు"గురించి హిందూ మత(గంథాలు రాక్షసులుగా వికృతంగాచిత్రించారు. యక్షులు నాగులకు సంబంధించినవారే రావణ, ఇంద్రజిత్తు, కంస, జరాసంధ, నరకాసుర, కీచక, శిశుపాల, బకాసుర, మహిషాసుర, శూరసేన మొదలైన వారందరిని, రాక్షసులుగా భయంకరంగా చిత్రించారు. వీరంతా ఆర్యుల దుర్మార్గాలను, అక్రమాలను జంతుబలులను, యజ్ఞయాగాలను మద్యపానాన్ని ఎదిరించి పోరుసల్పినవారె. రావణుని కుమారుడు నాగుబోతు ఇంద్రున్ని చావదన్ని తన రథచక్రాలకు కట్టి లంకకు తీసుకుపోయిన కథమనకు తెలిసిందే! ఇంద్రునిపై కృష్ణుడు అనేకసార్లు దండెత్తాడు. బలరామకృష్ణులుజైన మతానికి చెందిన వారు. జైనమతాన్ని దెబ్బకొట్టేందుకు కృష్ణుడిని కూడా తమ దేవుళ్ళ జాబితాలో చేర్చుకున్నారు. కృష్ణుడు యాదవరాజు. అనేక సందర్భాల్లో ఆర్యులు యాదవులను అడ్డుపెట్టుకుని నాగులను దెబ్బతీసారు.

ఒక్కవాక్యంలో చెప్పాలంటే ఆర్యుల అక్రమాలకు వ్యతిరేకంగా ప్రతిఘటించింది ప్రధానంగా నాగులే. పరాయిదేశాల నుండి వచ్చిన ఆర్యుల్లో కొన్ని తెగలు ఆదిలో నాగుల పంచన చేరి చివరకు చాప క్రిందనీరులాగపాకి పరోక్షంగాను ప్రత్యక్షంగాను యుద్ధాలుచేసి నాగులను ఓడించారు. కృతఘ్నులై విద్రోహులుగా మారారు.

యాదవులు క్రమేణాబలం పుంజుకున్నారు. నాగులు బలపర్చే బలమైన రాజులను నాశనం చేసి మరీ కీలు బొమ్మ ఆర్యరాజులను అధికారపీఠం మీద నిలబెట్టడానికి ప్రయత్నించారు. అందుకే కృష్ణుడు కీర్తించబడ్డాడు.

మధుర (గుజరాత్) ద్రావిడ ప్రాంతం. కృష్ణుడు నల్లటివాడు అయినా! బ్రాహ్మణులు తమ ఆదిపత్యం కోసం వర్ణసంకరానికి కూడా ఇష్టపడ్డారన్న మాట!, కృషుడు జిత్తులమారి తనానికి లోనై ఆర్యులకు సపోర్టు చేయడం సహించలేక నాగులైన నరకాసురుడు, జరాసంధుడు, శిశుపాలుడు కృష్ణుని మీద అనేకసార్లు దాడులు చేసారు. కొన్ని సందర్భాల్లో కృష్ణుడు పారిపోయాడు కూడా, వేదయుగంలో నాగులు, దస్యులు, శబరులు, కిరాతులు అనే నాలుగు ఆర్యేతర జాతులున్నాయి. వీరిలో దస్యులు ఆర్యులచేత పూర్తిగా నాశనం చేయబడ్డారు. శబరులు ఆఫ్ఘనిస్థాన్, టర్కీ, ఇరాన్, ఇరాక్, రష్యా దేశాలకు పారిపోయారు. కిరాతులు హిమాలయాలు, నేపాల్, భూటాన్, అరు

హాచలప్రదేశ్, టిబెట్‌లలో దాక్కున్నారు. నాగులు నిలువగా దిగి వింధ్య, ఆరావళి, బీహారుల్లో మాలేకొండల దక్షిణానికి,, తూర్పుగాను జరిగి అస్సాం బర్మా నాగాలాండ్ మీదుగా థాయిలాండ్, కంబోడియా, మలేషియాలకు వ్యాపించారు.

ఈ జాతులను ఓడించాక ఆర్యులు స్థిరపడ్డారు అగసాలె (కంసాలి) కమ్మరి, కుమ్మరి, సాలె వగైరా శూద్రకులాలు 13వ శతాబ్దం తర్వాత జంధ్యాలు తగిలించుకున్నారు. పల్లెకారులు తమిళ, అస్సాం రాజ్యాలు స్థాపించుకున్నారు. కాబట్టి వర్ణవ్యవస్థలో స్థానంకోసం జంధ్యాలు తగిలించుకుని అగ్ని కుల క్షత్రియులైనారు.

బ్రాహ్మణ భావజాలం రాజ్యానికి వచ్చినప్పుడు దాని ప్రలోభానికి లొంగిపోయిన వారే శూద్రులు. వీళ్ళకు వర్ణవ్యవస్థలో ఆఖరిస్థానమైనా లభించింది. ఈనాడు వారినే మనం బి.సి. లంటున్నాం. (వెనుకబడిన తరగతులు) ఆర్యులకు లొంగకుండా పోరాడి దొరికిపోయి బందీలైనవాళ్లు అంటరాని కులాలయ్యారు. వాళ్ళకొరకు గ్రామాలకు చివర మాలపల్లెలు సృష్టించారు. వారే ఈనాడు మాలమాదిగలుగా అంత్యనివాసులుగా (అంత్యవాసులు) స్థిరపడ్డారు చాణుక్యుని అర్థశాస్త్రంలో నాలుగు వర్ణాలతో పాటు 15 సంకరవర్ణాలుకూడా "అంత్యవాసులు" పేరిట పేర్కొన్నాడు. గ్రామ పొలిమేరల చివరనివసించే వారే అంత్యవాసులు: వీరు స్మశానాల్లోనే ఉండాలని మనువు శాసించాడు. వీరే పంచములని, చండాలురని, శ్వపచులు అని పిలువబడ్డారు. వీరి స్థితి శూద్ర బానిసల స్తితికన్నా అధ్వాన్నంగా ఉండేది. శూద్రులను అగ్రవర్ణాలకు బానిసలుగా మార్చితే పంచములు గ్రామం మొత్తానికే బానిసలు. అసలు ఆర్యులకు దొరకకుండా మైదాన ప్రాంతాలు విడిచి కొండల్లోను, అడవుల్లోను ఉంటూ పోరాటం చేసేవాళ్లు ఆదివాసులుగా మారారు. వీరిని ఇప్పుడు గిరిజనులంటున్నారు. వీరే ప్రభుత్వ రికార్డులలో షెడ్యూలు ట్రైబ్స్‌గా రాస్తున్నారు. (ఎస్.టి.) వీరినే షెడ్యూలు తెగలని కూడా అంటున్నారు, ఈరకం నాగజాతి చీలి, ఓడి శిధిలమయిపోయింది. నాగ జాతీయులైన బి.సి., ఎస్.టి. ఎస్.సి. కులాలకు రిజర్వేషన్లు పనికిరావని, భూములు పంచరాదని అగ్ర కులాలు ఈనాటికి వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. తలలెత్తినచోటల్లా ఊచకోత కోస్తున్నారు.

నాగులు తొలి సముద్రయానకులు, ప్రపంచంలో తొలిసారిగా 'నావ కనిపెట్టింది నాగులే, దీనితో నాగుల ధైర్య సాహసాలపై ఆర్యులకు తీరని ద్వేషం. అందుచేతనే సముద్రయానం చేసిన ఆర్యులకు ప్రాయశ్చిత్తంచేసు కున్నప్పటికిని స్వర్గం లభించదని తమ గ్రంథాల్లో ఆంక్షలు విధించారు. ఇది మనకు తెలిసిందే.

శ్రీ రాధాకృష్ణముఖర్జీ అనే మహాశయుడు తొలి సముద్రయానం మీద ఒక గ్రంథం ఇంగ్లీషులో రాశారు ఇది తెలుగులో 1937లో అనువాదం అయింది. దీని ప్రతి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వుంది. యిది అందరికి అందుబాటులో ఎందుకు రాలేదో అర్థం కాకుండా వుంది. ఖండాంతరాలకు వెళ్ళిన తొలి నౌక గీయించిన బొమ్మలు వున్నాయంటారు. తెలుగువారి (నాగుల) సముద్రయాన విద్య గురించి అథర్వణ వేదంలో కూడా ప్రస్తావన వుంది.

ఇండోనీషియా లిఖిత భాండాగారంలో నాగుల (తెలుగుల) సముద్రయానానికి సంబంధించిన 100 గ్రంథాలున్నాయట.

ప్రకృతిని జయించాలనే తపన నాగులకుండేది. అందుచేతనే శివ ఆరాధికునిగా రూపొందించుకున్నారు. శివుడుఅంటే తనలో తాను బీజ రూపంలో వున్న ప్రకృతి శక్తి. నాగులది ప్రకృతికి మూలమైన భౌతికశక్తి ఆరాధన. రూపం శివుడు. శక్తి పార్వతి. ఆర్యులు రాకముందు భారత ఉప ఖండమంతా శైవంతోనిండి వుంది. తర్వాత కాలంలో ఆర్యులు వచ్చాక ఆర్యులకు వ్యతిరేకంగా స్థాపించబడ్డ బౌద్ధంలో నాగులు చేరిపోయారు.

ఆఫ్ఘనిస్తాన్‌లో ఒకప్రాంతంలో ఇప్పటికి నాడుకలోవున్నబ్రాహ్మనీ(Bra hni) భాషతెలుగు కూటమికి చెందినదని భాషాశాస్త్రజ్ఞులు తెలియచేస్తున్నారు ఆలాగే ఇప్పటి పాకిస్తాన్‌లోని హైదరాబాద్ నగర పరిసరాలంతటా తెలుగు కూటమికి చెందిన నాగులు అలనాడు నివశించారని చరిత్రకారుల అభిప్రాయం సంస్కృత ప్రాకృత భాషలకు మూలమైన దేవనాగర లిపి తెలుగు లిపి అనగా నాగుల లిపి నుండి ఎరువు తీసుకోబడినదే.

సంస్కృత భాషకు మొదట అక్షరాలు అనగా 'లిపి' లేదు. నాగుల లిపిని స్వీకరించాక దాన్ని దేవనాగరి భాష అన్నారు. ఆర్యులు తమ సాహిత్యాన్ని ఒకరి నుండి మరొకరు నోటిద్వారా విని కంఠస్థం పట్టడం అంటే లిపి అర్ధంగాని భాషమాత్రమే వుండేది. ఉపనిషత్ అనగా దగ్గరకూర్చొని వినడం. ఇక్కడికి వచ్చాకనే నాగుల లిపిని కాపీకొట్టారు దానినే కొన్నిమార్పులు చేసి సంస్కృతించి సంస్కృతానికి లిపిని సృష్టించారు. అందుకే సంస్కరించబడ్డది గనుక సంస్కృతమన్నారు-

తెలుగు భాషకు (అనాటినాగభాష) రావణుడు వ్యాకరణం రాసిన సంగతి తెలిసిందే ఇంతస్పష్టమైన చరిత్ర కలిగివున్నప్పటికిని యింకాకొందరు ఆర్య బ్రహ్మణ పండితులు సంస్కృతాన్నుండే ద్రావిడ భాషలు పుట్టాయని వాదించడం విడ్డూరంగా వుంది క్రిందపడ్డా విజయం మాదేనన్నట్లుంది.



# నాగులను పాములుగా చిత్రించిన ఆర్యులు

ఆర్యులు భారత ఉపఖండం చేరేనాటికే నాగులు ఉన్నతమైన సంస్కృతిని కలిగి వున్నారనేది యిది వరకే చదివాము. ఆర్యులు అప్పటికి తిరుగుబోతు తెగలుగా వుంటూ పశువుల కాపరులుగా జీవించారు. పశువుల మేతకు భూమి కావల్సి వచ్చింది. ఈ భూములకోసం సాగించిన యుద్ధాలే నాగులకు ఆర్యులకు జరిగిన యుద్ధం. యీ విషయం భారతంలో కూడా చూడగలం.

ఆర్యులు వచ్చేనాటికే నాగులు స్థిరనివాసులు. నివాస కట్టడాలు నిర్మించుకున్నా వ్యవసాయాభివృద్ధే స్థిర నివాసులుగా మార్చింది. ఆనాటి ఉత్పత్తి విధానాలతో పోల్చినప్పుడు ఆర్యుల కంటే నాగులు ముందున్నారు. ఆర్యులు కూడా నాగులను అనుసరించి వ్యవసాయం మీదే కేంద్రీకరించారు. దీనితో పశువుల మేతకేగాక వ్యవసాయాభివృద్ధికి భూములు కావలసివచ్చాయి. (భారతంలో జరిగిన యుద్ధాలు భూముల కోసం జరిగినవే). దీనితో నాగులకు ఆర్యులకు మధ్య ఎడతెగని పోరాటాలు ఘర్షణ ప్రారంభమైంది. వ్యవసాయానికి నివాసానికి నదులప్రాంతాలు అవసరం. ఇవన్నీ ఆనాటికే నాగుల వశంలో వున్నాయి. గనుక యుద్ధాల ద్వారా నాగులను జయిస్తే తప్ప ఆర్యులకు మరో మార్గంలేదు. ఈ విషయాలను ఆనాటి హరప్పా, మొహెంజోదారో నాగరికతల్లో చూడగలం. ఆర్యులు వాటిని విధ్వంసం చేసిన క్రూరత్వం తెలిసిందే "చివరికిది నాగులతో రాజీలేని శత్రుత్వం క్రిందకే మారింది. ఆనాటి నుండే నాగులకు చిహ్నమైన నాగు పాములను, నాగులను హీనంగా చూడసాగారు. నాగులను నాగరాజులను పాముల క్రిందే వర్ణించారు. నాగులను పాములగాను, పాములను నాగులుగా కలగాపులగం చేసి వారిష్టం వచ్చినట్టు సాహిత్యం సృష్టించారు.

ఉదాహరణకు నాగుల జన్మగురించి వీరి పురాణాలలో యిలా రాసుకున్నారు. "బ్రహ్మదేవుడు కొడుకు మరీచి. ఆయన సంతానం కశ్యపుడు, కద్రువుల వివాహ ఫలితంగా పుట్టినవారే తొమ్మిదిమంది నాగులు. వీరు అనంత, తక్షక, వాసుకి, కంబళ, కర్కోటక, పద్మ, మహాపద్మ, శంకు, కుశిక, అనేవి యీ నవనాగులపేర్లు". వీరి సంతానమే నేడున్న రకరకాల పాములని వీరి గ్రంథాలలో చిత్రించారు.

ఈ నవనాగులే ఆనాటి నాగరాజులు. వీరిని కౄరంగా పాములుగా చిత్రించారు. వీరంతా ఆర్యులకు వ్యతిరేకంగా పోరాడిన మహాయోధులు.

హిందూ పురాణాల్లో సృష్టికర్త మూడులోకాలను సృష్టించినట్లుంది. వీటిలో స్వర్గలోకం దేవతలకు, భూలోకం మానవులకు, భూమికి అడుగున ఉన్న పాతాళలోకాన్ని నాగులకు యిచ్చినట్లుచెప్పబడింది. నాగలోకంలోనాగ దేవతలు అధిపతులనికూడా రాశాయి. నాగదేవతలు పాతాళ లోకాన్ని అద్భుతంగా తీర్చిదిద్దుకున్నారని అందమైన పట్టణాలు, నగరాలు నిర్మించుకున్నారని, నాగదేవతల రాజధాని పేరు భాగవతి అని ఈ నగరం ఇంద్ర నగరమైన అమరావతి కన్న అందమైనది అని వ్రాశారు.

వీటిని పురస్కరించుకునే అనేక జానపదగాథలు పుట్టుకొచ్చాయి. ఉదహారణకు రాముడు తనయుడుకుశుడు 'కుముదావని, అనే నాగకన్యను వివాహమాడినట్లు మహాకవి కాళిదాసు రఘువంశంలోరాశాడు(ఆనాడుకాళిదాసు రచనలు ఫ్యూడల్ చక్రవర్తులకు వ్యతిరేకంగా వుండేవి. కొన్ని బ్రహ్మాణిజానికి వ్యతిరేకంగా పరోక్షంగా రచించిన రచనలున్నాయి)

అయోధ్య రాజుమాంధాత తనయుడు పులుకుత్సుడు నర్మద అనే నాగరాణిని వివాహము చేసుకున్నాడు. ఆనాగరాణి 'నర్మద' పేరుతోనే నేటి నర్మదా నదిని పిలుస్తున్నారు. బౌద్ధజాతక కథల్లో నాగులమీద విశేషమైన వర్ణనలు వారి గుణగణాలు వర్ణించబడివున్నాయి. నాగులు ఎంతో తెలివిగలవారని, విజ్ఞాన శాస్త్రమేధావులని, వైద్యశాస్త్రపండితులని ఆపుస్తకాల్లో పేర్కొన్నారు. చిత్రకళ, శిల్పకళవంటి అనేక లలితకళల్లో నాగులకు విశేషనైపుణ్యం వుంది. యీవిషయం కొంతవరకు యిదివరకుచదివాం, ప్రస్తుతం మనం చెప్పే 'నగరి, భాషనాగుల నుండి వచ్చిందే.

ఆనాటి గాధలేగాక క్రీస్తుకు పూర్వం 3-6 శతాబ్దాల కాలంలో మగదను పాలించిన బింబిసారుడు, అజాతశతృవు, (బుద్ధినిసమకాలికుడు) శిశనాగులు, నాగవశం వారని బౌద్ధచరిత్రలు చెపుతున్నాయి. యిటీవల పరిశోధనలు కూడా వీటికి దగ్గరగా వున్నాయి.

ప్రస్తుతం మధ్య ప్రదేశ్‌లోని 'విదిశ'గ్వాలియర్ ప్రాంతాలను క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దంలో పాలించినవారు నాగవంశస్తులే,

గాంగా తీర ప్రాంతమంతా నాగవంశస్థుల క్రింద వుండేదని శివుని దీవెనలతో వారు ఆప్రాంతాన్ని పాలించారని తెలియచెప్పే రాగిసలకం (శాసనం) ఒకటిలభించింది. వీరికాలంలో వాడిననాణేలపై శివునికి సంబందించిన నంది త్రిశూలాలతో పాటు పాము పడగ నీడన కూర్చున రాజముద్రలుండేవి.

చరిత్రకారుడు కవి, పండితుడైన కల్హణుడు 12వ శతాబ్దంలో తన గ్రంధాలలో నేటికాశ్మీరుదేశాన్ని నాగలోకంగా చెప్పాడు. కాశ్మీరులోని నదులు, కొలనులు, నదులు, సరస్సుల, పరిసరాలలో. నాగులు జీవించారని వీరికి నీల- నాగ అనే నాగరాజు రక్షణకల్పించేవాడని ఆయన వర్ణించాడు. ఆర్యులు చెప్పేనాగలోకం బహుశా కాశ్మీరుకావచ్చు.

6వ శతాబ్దంలో భారత ఉపఖండం సందర్శించిన చైనా యాత్రికుడు హుయేన్‌సాంగ్ కాశ్మీరులో పెద్ద నాగదేవత మందిరాన్ని చూచి అద్భుతంగా వర్ణించాడు.

హిందూరాజు విక్రమాదిత్యుడు కుబేరగంగ అనే నాగకన్యను వరించాడు. దక్షణాదిరాజు వంశీయుడైన పల్లవ, చోళ, చేర విజయనగర, మరాఠ రాజులు కూడా నాగకన్యలను వివాహమాడారు.

నేటి నాగలాండ్‌లోని ప్రజలు కూడా నాగజాతి వారని, వారిని వుత్తరాది కొండల్లోకి ఆర్యులు తరిమివేసి వుంటారని యీనాటికి వారు తమ సొంత భూమిగా నాగలాండ్‌ని భావించిదాని స్వయం నిర్ణయాధికారం కావాలని యీనాటికీ పోరాడుతూనేవున్నారు. నాగలాండ్‌లోని కొండలు నాగదేవతల నివాసమని ఈనాటికి నమ్ముతున్నారు.

సింధు లోయలో దొరికిన అవశేషాలలో పడగవిప్పిన త్రాచులు యిరువైపులా వుండగా సింహాసనం మీద కూర్చున్న మాతృమూర్తి విగ్రహముంది. యిలాంటి మట్టి బొమ్మలు అనేకం లభించాయి అలాగే పాములు మధ్యనున్న గరుడ పక్షివున్న బొమ్మలు కూడా దొరికాయి. ఈ ఆధారాలనుబట్టి క్రీస్తుకు పూర్వం 3వేల సంవత్సరాలనాడే నాగదేవతలను ఆరాధించే ఆచారం వుందని అర్థమవుతుంది.

ప్రస్తుతం తమిళనాడులో "నాగపట్నం" ప్రాంతం ఒకప్పుడు నాగులకు నిలయమని ఆ ప్రాంతంలో అనేక మంది నాగులను చూచినట్లు ప్రఖ్యాత భూగోళశాస్త్రజ్ఞుడు క్రీస్తుశకం 150సం॥లో 'టోలిమీ' పేర్కొన్నాడు.

ఆనాటి స్మారక చిహ్నాలన్నీ యీనాడు పూజలు చేసే స్థితికి చేరాయి. బెంగాల్‌లో ఆషాఢమాసంలో కృష్ణపక్షం అయిదవరోజున నాగరాజు మాన సుని పూజలు జరుపుతారు. చివరకు యీ నాగపూజలు ఎలా పరిణమించా యంటే నాగపాములు తమ జోలికి రాకుండా కాపాడుకోవడానికి పూజలు ఒక మార్గమని భావించే స్థితికి వచ్చారు.

మహారాష్ట్రంలో కూడా 'నాగపంచమి' శ్రావణమాసపు శుక్లపక్షం అయిదవరోజున జరుపుకుంటారు. ఆనాడు సర్ప పూజలను నిర్వహిస్తారు. ఆనాడు నాగసర్పాలను సేకరించి కుండలలోపెట్టి ఊరేగింపుగా తీసుకెళ్ళి దూరంగానున్న అడవుల్లో వదిలి వస్తారు.

కేరళ రాష్ట్రంలో నాగపూజ చేస్తారు. పెరటిలో పుట్టలను నిర్మించి మన్నారశాలగా నాగదేవత పూజచేస్తారు. ఇలా పూజలుచేస్తే సంతానం కలు గుతుందనే మూఢ నమ్మకం కూడా వారికుంది.

కర్నాటకలో కూడా కేరళలో జరిపినట్లే నాగ ఉత్సవాలు జరుపు తారు. 'నాగమండలం పేరుతో జరిగే ఈ ఉత్సవంలో అయిదు నాగజంటలను చిత్రీకరిస్తారు. మరోవైపు నాగదేవతలు ఆవహించిన ప్రజలు భక్తిశ్రద్ధలతో నాగనృత్యాలను చేస్తారు.

తెలుగునాటి నాగుల చవితి పేరుతో జరిగే పూజలు మనకు తెలిసిందే. నాగుల చవితినాడు స్త్రీలు స్నానంచేసి పాముల పుట్టలకు పాలుపోసి భక్తితో ప్రార్థించుతారు. పుట్టచుట్టూ ప్రదక్షిణలు చేస్తారు.

అలాగే నాగరాజుల విగ్రహాలను చెక్కేందుకు "నాగరత" అనే గ్రం థంలో ప్రత్యేక సూచనలు వున్నాయి. అలాగే నవనాగులను గురించి మాయా మాత అనే గ్రంథంలో రూపవర్ణములు యివ్వబడ్డాయి. యివన్నీ ఏదోరూపంలో పరోక్షంగానో, ప్రత్యక్షంగానో నాగుల ప్రత్యేకత, విశిష్టత అర్థం చేసుకోవ డానికి ఉపకరిస్తాయి.

(ఈ విషయాలు ఇంకా వివరంగా శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారి స్వాతి పత్రిక (12-11-92)లో సవివరంగా వివరించారు.

# రామాయణంలో నాగులు

ఆర్య బ్రాహ్మణుల ప్రోత్సాహంతో వాల్మీకి రామాయణం రాశాడు. పరాక్రమశాలి, సత్ప్రవర్తనుడు, స్పురద్రూపి, సద్గుణవంతుడు వంటి రాముని పేరుతో ఒక దివ్య పురుషుని కీర్తిస్తూ కావ్యం రాయవలసిందిగా వాల్మీకిని ప్రేరేపించారు. ఆర్య బ్రాహ్మణుల తరపున నారదడు వాల్మీకితో చెప్పి రాయించాడు. యిది బుద్ధుని సమతుల్యునిగా చిత్రించారు. బౌద్ధ ప్రభంజ నానికి వైదిక మతం పూర్తిగా పెకిలింపబడింది. తిరిగి దానిని పునరుద్ధ రించే బాధ్యత వైదిక మహర్షులపై బడింది. అందుకే రామాయణం రాయిం చారు. రామాయణం వాల్మీకి రాసిన దీనికి అనేక ప్రక్షిప్తాలు చేర్చబడ్డాయం టారు. అందుకే రామాయణం పరస్పర విరుద్ధంగా వుంది.

అయితే రామాయణం వాల్మీకి చేత ఎందుకు రాయించారు ? ఇక్కడే వుంది ఆర్యబ్రహ్మణుల కౌటిల్యం దీనికి కారణలేమిటంటే వాల్మీకి నాగజాతి యుడు. ఆనాటి కాలంలో వైదికమతానికి వ్యతిరేకంగా, బ్రాహ్మణులు సాగించే యజ్ఞయాగాలు బలులవంటి హింసావివాధాలకు వ్యతిరేకంగా నాగజాతి ప్రజలు బౌద్ధమతం స్వీకరించారు. ఆ జాతి పండితుని వంచించి వత్తిడిచేసి, ఎరబెట్టి రాయించారు. అత్యధిక సంఖ్యాకులుగల నాగజాతీయులను వైదిక మతంవైపు మరల్చడానికి పన్నిన వ్యూహాత్మక ఎత్తుగడయిది. అలాగే సంస్కృతభాషలో ఆనాటి వైదిక బ్రహ్మణులను తలదన్నిన పండితుడు వాల్మీకి.

(బహుజన దళితులను మోసగించడానికి అగ్రకులాలు అంటరానివాడైన అంబేద్కర్‌చేత భారత రాజ్యాంగాన్ని రాయించినట్లు).

వాల్మీకిని కిరాతకుడని ప్రచారంచేసి ఆనాటి అనేక స్వదేశీ తెగలను జాతులను మోసగించి రామాయణాన్ని నూరిపోశారు. "కిరాతకుడు" అంటే నెమలి పించం ధరించి అడవిలో తిరిగే బోయి అని అర్థం 'కిరాత' అనే మాటకు కొండ ప్రాంతాలలోను, అడవి ప్రాంతాలలోను నివసించే ఒక తెగను సూచించే పేరని వీరు శూద్రులుగా పరిగణించబడ్డారని నిఘంటువులు చెబు తున్నాయి. వాల్మీకి కిరాతతెగకు చెందిన శూద్రుడు. నాగవంశీయుడు. వాల్మీకికి అనేక మంది శిష్యులున్నట్లు తెలుస్తుంది. అందుకే కులపతిగా విఖ్యాతి గాంచాడు.

రామాయణం చాలా ప్రాచీనమైనదని ఆర్య పండితులు బుకాయిస్తారు. గాని బుద్ధుని తరువాతనే రామాయణం రాయబడింది. రామాయణంలో బౌద్ధం గురించి అక్కడక్కడ ఉదహరించడాన్ని బట్టి రామాయణం బుద్ధుని తరువా తనే బుద్ధిజానికి వ్యతిరేకంగా ప్రత్యామ్నాయంగా రాయబడింది.

రామాయణంలో ఆర్య-ఆర్యేతర పదాలున్నాయి. ఆర్యేతరులు అనగా నాగజాతి. దీనికి చెందిన ఉపజాతులను ఆర్యేతరులుగా పిలిచేవారు. రామాయణంలో రాక్షసులు అని రాసిన మాట వాస్తవంకాదు. ఆర్యులు తమ శత్రువులను రాక్షసులుగా వర్ణించి ప్రచారం చేయడం పరిపాటయిన సంగతి యిది వరకే చదివాము. రామాయణంలోని తాటకి, సూర్పణఖ పాత్రలు రాక్షసులు కారు, వీరు ఆర్యులు సాగించే హింసాపూరిత యజ్ఞాలను నిరోధించడం, దురాక్రమణదారులైన ఆర్యులను తమ భూముల నుండి తరిమికొట్టడం వంటి వీరోచిత పోరాటాలు జరిపిన వీరనారీమణులు నాగస్త్రీలు.

రావణుడు పదితలలు గలవాడని వికృతంగా వర్ణించి ప్రచారం చేశారు, రావణుడు దశాననుడుకాడు. రావణుని తల్లి అతని మెడలో ఒక ముత్యాల హారం వేసింది. ఆహారంలోని మణులలో అతని శిరస్సుతొమ్మిదిసార్లు ప్రతిబింబించడం వల్ల అతడు దశానన, దశగ్రీవ, (దశకంఠ)శబ్దాలతో ప్రసిద్ధుడయ్యాడు, జైనరామాయణం ప్రకారం రావణుడు జైనభక్తుడు, వైదికమతానికి వ్యతిరేకంగా జైనమతం పుట్టుకొచ్చిన సంగతితెలిసిందే, రావణుడు నాగ జాతిలో ఉపజాతిగా వున్న యక్ష వంశానికిచెందినవాడు,

జైనంలో గాథ, హైందవంలో 'నంద' 'కుమారః నామాలవలె' నాగ నామం' బౌద్ధంలో ప్రసిద్ధం, భారతదేశచరిత్రలో అత్యంత ప్రాచీన రాజవంశం నాగులదే, భగవద్గీత 10ప్రకరణ 29 శ్లోకంలో నాగుల ప్రసక్తివుంది' 'నాగులలోనేను' 'అనందుడను అన్నాడు కృష్ణుడు. అనందుడు బుద్ధుని శిష్యుడు కావచ్చు

జలప్రళయం తదితర ప్రకృతియిబ్బందుల కారణంగా జరిగిన అనేకనేక మార్పుల వల్ల మొదటిసారి ప్రజలు (నాగులు) దక్షిణాదినుంచి ఉత్తరాదికి వలసవెళ్లడమూ అక్కడ నాగరిక పట్టణాలు నిర్మించడమూ తెలిసిందే.

తర్వాత కొంతకాలానికి జరిగిన భౌగోళికమైన మార్పుల వల్ల ఉత్త రాదినుంచి దక్షిణాదికి వలసరావడమూ జరిగాయని చరిత్ర పరిశోధకులు తెలియచేస్తున్నారు. రామాయణాన్ని విశ్లేషిస్తే ఈలాగుంది.

తాటకిభర్తయైన సునందుని అగస్త్యుడు హత్యచేశాడు. బ్రహ్మణదిక్కారి, జలస్తంభన నిపుణుడు అయినవాతాపినికూడా అగస్త్యుడు హత్యచేశాడు. నాగ వంశీయులు నౌకాయాన నిపుణులన్న విషయం తెలిసిందే,

జన స్థాన నివాసులు 14000 మంది.వారంతా యజ్ఞవ్యతిరేకులు, అనగా అహింసావాదులు, వారి అధిపతిఖరుడు, యితడు మిక్కిలి సౌందర్య వంతుడు. సంపన్నుడు. ఈ సంపదమీదనే ఆర్యగణానికి కన్ను కుట్టింది. వీరి యజ్ఞవ్యతిరేక సిద్ధాంతం మీదనే ఆర్యగణానికి ద్వేషం కల్గింది. యజ్ఞ విరోధులు అహింసావాదులు గనుక ఆయు నాలెందుకు?

బౌద్ధభిక్షువు, సంపన్న కుటుంబీకుడు కాశీనివాసి అయిన ఖరుడు. యిత నిని రాక్షసునునిగా చిత్రించారు.

సాయుధులైన రామలక్ష్మణులు మునిగణంతో దండకారణ్య ఆశ్రమ ణకు ఉద్యమించారు. శూర్పణఖ ఈ వార్తను అన్నఖరునితో చెప్పి ఉత్తేజ పర్చి ప్రతిఘటనకు పూనుకున్న నాగకన్య శూర్పణఖ ధ్యాన నిమగ్నుడై వున్న శూర్పణక కుమారుడైన సాంబుని లక్ష్మణుడు హత్యచేశాడు.

ఈ దారుణ హత్యకు శూర్పణఖ చలించిపోయింది. ఈ హత్యసంగతి తేల్చుకునే నిమిత్తం రాముని నివాసానికి వెళ్లింది. శూర్పణఖ సౌందర్యాన్ని రామలక్ష్మణులుచూచి ఆశ్చర్యపోయారు దుఖసముద్రంలో మునిగివున్నశూర్పణ ఖను కామిని మిషతో ముక్కు చెవులు కోసి పరాభవించారు. సౌందర్యంలో నాగకన్యలు పేరెన్నిక గన్నవారని అందరికి తెలిసిందే.

రామలక్ష్మణుల ఘోరకృత్యాలకు శూర్పణఖ అన్న ఖరుడు వగైరా ప్రతిఘటించారు. రాముడు ఖరునిచూచి బ్రాహ్మణ కంటకుడా! అని సంబో దిస్తాడు. నాగవంశీయులు బౌద్ధులుకదా! అందువల్ల బ్రహ్మణకంటకులు. ఖరుడు నాగవంశ సంజాతుడు.

సాయుధమునిగణం మద్దతుతో రామలక్ష్మణులు కరదూషణాదులుగ వగైరా 14,000మంది నాగులను హతమార్చారు. చివరకు ఖరుని జన్మ స్థానం రామలక్ష్మణుల వశమయింది, దండకారణ్యం యావత్తు వారిసొంత మయింది. ఈహింసను సీత అంగీకరించదు. "ఏవిరోధం లేకుండా అసురలును (నాగులను) చంపడం, ఏ అపరాధం చేయని ప్రాణులను చంపడం నాకుఇష్టం లేదు"(అరణ్యకాండ 9 సర్గ మొత్తం 33 శ్లోకాలు) సీతకు సమాధానంగా రాముడు యిలా అంటాడు "నేను నా ప్రాణమైనా, నిన్నైనా, లక్ష్మణునైనా విడిచి పెడతానుగాని విశేషించి బ్రహ్మణులకై చేసిన ప్రతిజ్ఞను విడువలేను" అని అన్నాడు (అరణ్య 10-27) వైదికమతం మీద రామునికున్న గాఢాభి మానం యిలా వ్యక్తమయింది—

(అగ్రకుల నాయకులు వారి పార్టీలు రామరాజ్యం గురించి, అయోధ్య గురించి బరి తెగించి పోరాడుతున్నదందుకే).

ఎంతో అందమైన లంకా నగరం నాగవంశానికి చెందింది. విష్ణువు వారిని తరిమేశాడు. వారు పాతాళలోకానికి పోయి తలదాచుకున్నారు. పాతాళ లోకమంటే అర్థం అండర్‌గ్రౌండుకు (అజ్ఞాతవాసానికి) పోయారన్నమాట.

లంకానగరం కుబేరుని వశమవుతుంది. చివరకు రావణుడు కుబేరుని తరిమి పుష్పక విమానం పొంది లంకను తిరిగి స్వాధీనం చేసుకున్నాడు.

అసురులు, ద్రావిడులు, నాగులు, లిచ్ఛవులు చేరులు వీరి ఆచార వ్యవహారాలన్నీ ఒకేలావుంటాయి. ఈ పేర్లు ఆయా ప్రాంతాలనుబట్టి ఒకే జాతికి (నాగ) వాడిన నామాంతరాలు.

ఇక్కడ గమనించాల్సిదేమంటే ఆర్యులకు ద్రావిడగణానికి (నాగులు) జరిగిన యుద్ధాలను వాల్మీకి రామ-రావణ యుద్ధంగా రామాయాణాన్ని చిత్రించి వుండవచ్చునని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం.

తన పరివారం నాశనమయిపోవడం, తమ్ముడు ఖరుడు మరణించడం చెల్లెలు శూర్పణఖ పరాభవం అన్నీ రావణుని కలచివేశాయి. చివరికి ముల్లును ముల్లుతోనే తీయాలనుకున్నాడు. మారీచుని సహాయంతో సీతను రావణుడు

కిడ్నాప్ చేశాడు. అంతేగాని సీతను ఏ మాత్రం నొప్పించి పరాభవం చేయ లేదు. అకారణంగా అన్నదమ్ములైన వాలి సుగ్రీవులకు విబేదాలు సృష్టించి వాలిని చంపి తమ్ముడైన సుగ్రీవునికి రాజ్యం యిస్తాడు రాముడు. చివరకు సుగ్రీవుని సైన్యం లంక మీదకు దండయాత్రహరించింది. సుగ్రీవుని ప్రధానమంత్రి ఆంజనేయుని సహాయంతో ముందుగా శత్రు బలాన్ని అంచనా వేస్తాడు. నాగుల బలంతో పోల్చుకుంటాడు. "శత నాగబలులు" సహస్ర నాగబలులు తో అంచనా వేస్తాడు. ఈ అంచనా ప్రకారం రావణుని వెనుక శతసహస్ర నాగబలం వున్నదని వ్యక్తమవుతున్నది.

భారత ఉపఖండంలో మొదట వుండినవారు నాగ జాతీయులు. కనక పర్వతం అంటే మేరు పర్వతం. యిది కూడా ఆనాడు నాగుల వశంలో వుండేది. యిక్కడ బంగారం లభించేదని ప్రతీతి.

సీతను వెదకమని సుగ్రీవుడు వానర సైన్యానికి ఆజ్ఞాపించాడు. రావణుడు భోగవతీపురంలో సీతను దాచివుంచాడేమోనని సుగ్రీవుడూహించాడు.

"సర్ప నిలయమైన నగరం భోగవతీపురం. అందులో మహా ప్రాజ్ఞుడైన వాసుకి నివశిస్తున్నాడు. ఆ భోగవతీపురం వెదకదగింది. దాని మధ్య ప్రదేశము లందూ వెదక తగిందని" అంటాడు.

(సర్ప నిలయమంటె పాములుకాదు. నాగులను ఆర్యులు హీనభావంగా వర్ణించేవారు. అలాగే వానరులు అంటే కోతులుకాదు. అదొక మానవజాతి ఆ తెగకు కోతిని చిహ్నంగా పెట్టుకున్నారు. వానర చిహ్నం గలిగిన తెగ గనుక వానరులన్నారు).

భోగవతీపురం మహా ఐశ్వర్యవంతమైన నగరం. యిది నాగుల చేత పాలించ బడేది. భోగవతీపురం పాతాళానికి రాజధాని.

హనుమంతుడు సీతను వెతుకుటకుపోయి అశోకవనంను చూచి [illegible]ంద పరవశుడవు వాడు. "అశోక" అనేది దుఃఖ నివారణను సూచించే ప[illegible] ఈ పదం బౌద్ధ సిద్ధాంతపరమైనది. అశోకవనం బౌద్ధారామం.

రావణుని లంక ప్రజాతంత్ర గణతం[illegible] పరిషద్ (రిపబ్లి[illegible]) [illegible]న లిచ్ఛవుల రాజధానియైన వైశాలికి ప్రతిబింబ లావుంది. ప్రజలమ[illegible] [illegible]ృచ్ఛ

తగ్గులు లేనపుడు ఐక్యత వుంటుంది. ప్రజలుసంతోషంగావుంటారు. లంకఆలా గున్నది. అందువల్లనే లంకలోని ప్రజలందరూ సంతోషంగావున్నారని హను మంతుడు చెపుతాడు.

మొత్తమీద రామాయాణం విశ్లేషిస్తేతేలిందేమంటే రాముడు హైందవ మతరక్షకుడుగాను రావణుడు బౌద్ధమతం రక్షణకోసం పోరాడినట్లు అర్థమవు తుంది. రాముడుకేవలం బ్రహ్మణుల రక్షణకోసమే పోరాడినట్లుంది.—



# శూద్రులపై భిన్నాభిప్రాయం

ఇటీవల కాలంలో శూద్రులపై చాలా వరకు చర్చ జరిగింది. దీనిపై కొంత వరకు సాహిత్యం వచ్చింది. బ్రహ్మణిజం కల్పించిన చాతుర్ వర్ణ వ్యవస్థలో శూద్రులు 4వ వర్ణంగా చెప్పబడిన విషయం తెలిసిందే. శూద్రులు ఆఖరి కులం అనేదిగాని, అగ్రకులాలకు బానిసలుగా మారాయనే స్పందన గాని వీరికి తట్టకుండా పోయింది. దీనికి కారణం ఈ వర్ణవ్యవస్థలో నిర్మించిన నిచ్చెన మెట్లులాంటి సామాజిక వ్యవస్థ. అస్పృశ్య కులాలు శూద్రులకు సంతృప్తిని కలిగించాయి. ఈ వర్ణవ్యవస్థలోని కీలకం ఇక్కడే వుంది. దురదృష్టవశాత్తు తమకు జరిగిన జరుగుతున్న అన్యాయాలకు వ్యతిరేకంగా పోరాడాలనే ఆలోచన ఈ శూద్ర కులాలకు తగినంతగా లేకుండా పోయింది. (ఇటీవల కాలంలో కొంత వరకు ఆలోచనలో పడ్డారు). ఈ ఆధునిక యుగంలో కూడా పూజారి, పురోహిత మాయాజాలంలో కొట్టుకుపోవడం ఆశ్చర్యంగావుంది.

శూద్రులలో రెడ్లు, కమ్మ, వెలమలు అగ్ర కులస్థాయికి ఎదిగారు. ఈ నయా అగ్రకులాల వారు తిరిగి తమ క్రింద నున్న శూద్రకులాలను అణగద్రొక్కడం ప్రారంభించారు. రిజర్వేషన్లకు వ్యతిరేఖంగా అగ్రకులాలతోపాటు నయా అగ్రకులాలు కూడా పోరాడుతున్నాయి. బ్రాహ్మణిజం దృష్టిలో నేటికి శూద్రకులాలు నీచంగానే చూడబడుతున్నాయి. ఇదంతా ఆచార సాంప్రదాయాల పేరుతో కొనసాగుతూనే వుంది.

శూద్ర-నిమ్న కులాల స్వేచ్ఛ స్వాతంత్రాలకై మహారాష్ట్రంలో జ్యోతిరావు పూలే, తమిళనాడులో పెరియార్ రామస్వామి సాగించిన మహోన్నత ఉద్యమాలు భారత ఉపఖండాన్ని కుదిపివేశాయి. దీనికితోడు డా॥ అంబేద్కర్ సాగించిన విరోచిత పోరాటం మరింత ముందుకుపోయి అనేక విజయాలు సాధించడం జరిగింది.

శూద్రులపై అంబేద్కర్ రాసిన "శూద్రులు ఎవరు?" ఆర్య వ్యవస్థలో శూద్రులు నాలుగో వర్ణంగా ఎలా అయ్యారు? అలాగే "మను స్మృతిలో శూద్రులు అనే రచనలు చారిత్రక, పరిశోధనా రచనలుగా వున్నాయి. ఈ రచనలు తీవ్రమైన సంచలనాన్ని సృష్టించాయి. అయితే డా॥ అంబేద్కర్ "మను

స్మృతిలో శూద్రులు" అనే రచనలో శూద్రులు ఆర్య సంస్కృతిలో వారేనని ఒకప్పుడు వీరు గౌరవంగా సమానంగా చూడబడినవారేనని వివరించారు. అయితే శూద్రులు ఎందుకు నాలుగో వర్ణంగా నీచమైన వారుగా చూడబడు తున్నారు ? అందుకుగల కారణాలేమిటి ? అనే అంశాలు వీరి రచనలో లేకుండాపోయాయి. ఇవి లేకుండా వీరి రచన యొక్క లక్ష్యం, ఆశయం పూర్తికాదు. ఈ రచన కొంత అసంపూర్తిగానే మిగిలిపోయింది. ఇక్కడే శూద్రుల విషయంలో అంబేద్కర్‌గారి రచన గందరగోళంగావుంది. డా॥అం బేద్కర్ ఆలోచనలో "ఆర్యులలో భాగమే శూద్రులు" ఆర్యుల ఆచార వ్యవహారాలు పాటించనందువల్ల వెలివేయబడ్డవారే శూద్రులు అని రాశారు. అందుకే దీనికి జవాబు అంతుచిక్కకుండా వుంది.

దీనికి పూర్వరంగంలోనే దాగివున్నట్లనిపిస్తుంది "ఆర్యులు ఇక్కడవారే వీరు ఇతర దేశాలనుండిరాలేదు" అనేదే డా॥ అంబేద్కర్ భావం. ఈ వాద నకు అనుకూలంగానే శూద్రులు ఆర్యులకు చెందిన వారేనన్నను. డా॥ అంబే ద్కర్ దృష్టిలో నిమ్న కులాలతో పాటు అందరూ భారతీయులే. అయితే సమాజంలో అత్యధిక సంఖ్యాకులుగా వున్న శూద్రనిమ్న కులాలు ఎందుకు వెలివేయబడ్డారనే దానికి జవాబు రాకుండా పోయింది. దేశ, విదేశ చారిత్రక పరిశోధకులు, ఆర్యులు ఇతరదేశాల నుండి భారత ఉపఖండానికి వలస వచ్చిన వారేనని అనేక ఉదాహరణలతో నిరూపిస్తున్నారు. దీనిపై అంతు లేనంత సాహిత్యం వచ్చిపడింది. అయినా డా॥ అంబేద్కర్ లాంటి మహా మేధావి చరిత్ర పరిశోధకుడు" ఆర్యులు భారతీయులే ఇక్కడవారే" అనిఎలా చెప్పగలుగుతున్నారో అర్థం కాకుండాపోయింది. ఆర్యులకూ ఆర్యేతరులకు మధ్యసాగిన అనేకయుద్ధాలలో భారతఉపఖండం రక్తపాతంతో తడిసి ముద్ద యిన సంగతి డా॥ అంభేద్కర్ విస్మరించడం ఆశ్చర్యంగానే ఉంది. ఆయన బ్రతికి ఉంటే ఈ లోపం ఎక్కడ జరిగింది? ఎందుకుజరిగింది? ఎలాజరి గింది? అనేది చెప్పివుండే వారే.

శూద్రుల విషయంలో వారిరచనలోఇలాగుంది"ఆర్యులు దండయాత్రల ద్వారా శూద్రులను జయించారనడం తప్పు ఆర్యులు బైట నుండి వచ్చారనే కథ; భారతదేశానికి బయట, నుండే మొదట వచ్చిన ఆర్యులు స్థానికులపై

దండెత్తారనడానికి ఆధారాలులేవు. ఆర్యుల పుట్టిల్లు భారతదేశమని చాలా ఆధారాలున్నాయి" శూద్రాస్ అండ్‌కౌంటర్ రివల్యూషన్ వాల్యుం 3, పేజీ 420)

డా॥ అంబేద్కర్ ఇంకా ఇలా రాసారు" ఆర్యులు బయటనుండి వచ్చి భారతదేశంపై దండెత్తారని చెప్పే విషయం రుజువుకాలేదు" పై పుస్తకంలో వాల్యూం -7,పేజి 75 దస్యులు, దాసులు, శూద్రులు ఒకే అర్థాన్నిస్తాయి. అనగా బానిసలు అనిఅర్థం. దీనిపై అంబేద్కర్ ఇలా అన్నారు.

"జాతిపరంగా చూస్తే దస్యులు- ఆర్యేతరులనడం తప్పు భారత దేశంలో దస్యులు ఆదిమవాసుల జాతికి చెందినవారు కారు. ఆర్యసంఘంలోని వారే దస్యులు"

(పై పుస్తకంలో వాల్యూం-3p4.201)

ఆర్యులపట్ల డా॥అంబేద్కర్ ఇంత స్పష్టంగా కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పారు కనుకనే బి.జె.పి. తదితర మత సంస్థలవారు అగ్రకులాలవారు డా॥ అంబే ద్కర్‌ని ఆకాశానికి ఎత్తి పొగడటం ప్రారంభించారు. అంత మాత్రాన ఆయన నిజాయితీని శంకించవవసరంలేదు. అన్ని కులాలను ఏకీకరణచేసి కుల నిర్మూలన సాధించే తపనతో పైవిధంగా చెప్పివుండవచ్చు లేదా చరిత్ర పరిశోధనలో ఈ విషయం మేరకు ఎక్కడో లోపం జరిగి వుండవచ్చు. ఆయన దళితుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అగ్రకులాలతో రాజీలేని పోరాటం సాగించిన సాంఘిక సమరయోధుడు. దళిత వైతాళికుడు. ఆయన త్యాగం, సేవలు ఫలితంగా దళితులు అనేక విజయాలు సాధించారు. ఇది మరువరానిది. ఆయన రచనలు నేడు మందుపాతర్లలాగ పేలిపోతున్నాయి. బ్రాహ్మణిజం పునాదులు కదల సాగాయి. అగ్ర కులాలకు దడ పుట్టిస్తున్నాయి. మత్తులో నున్న దళితులను మేల్కొలుపుతున్నాయి.

శూద్రులు ఆర్యులలోనివారే ననడానికి ఈసాక్ష్యం చూపుతున్నారు. "రుగ్వేదం (X49) ఇంద్రుడు "నేను(ఇంద్రుడు) కౌవి అనే మానవుడి మేలు కోరి నా వజ్రాయుధంతో వధించాను. కృపను రక్షణోపాయాలతో రక్షించాను సుస్నను వధించడానికి వజ్రాయుధాన్ని ధరించాను. దస్యులకు ఆర్యనామధే యం లేకుండా చేసాను". ఈ మాటలు అర్థాన్ని గత చారిత్రక వాస్తవాన్ని బట్టి పరిశీలిద్దాం.

ఆర్య తెగలు ఏడు ఉపనదులున్న సప్తసింధు నదీప్రాంతంలోకి వచ్చి సింధూలోయలో వున్న హరప్పా మొహంజోదాలోని ద్రావిడ (నాగులు)ప్రజలకు చెందిన పురాతన నాగరిక పట్నాలను నాశనం చేసి స్థానిక ప్రజలను హత మార్చి ఆర్యులు గోశాలలు నిర్మించుకున్నారు. సప్త సింధు ప్రాంతాన్ని ఆక్రమించుకోవడంతో వచ్చిన తగాదాలోపడి ఆర్య తెగలు ఒకదాన్ని ఒకటి నాశనం చేసుకోజూచాయి. ఈ దశ రాజ్య యుద్ధంలో భరతగణం గెలిచింది.

ఆర్యులు సింధునది ప్రాంతాన్ని ఆక్రమించాక గంగానది మైదానాన్ని ఆక్రమించడం మొదలుపెట్టారు. ఇక్కడ గమనించాల్సినదేమంటే ఇదంతా క్రీ॥పూ॥ 1500 సం॥ నుండి 1700 సం॥ వరకు కొనసాగింది. ఆర్య తెగలు మద్య పంపకాలవద్ద యుద్దాలు జరిగి కొన్ని తెగలను భరతగణం వారు వెళ్ళగొట్టారు. ఆ తరిమి కొట్టిన ఆర్యగణాలు ఇతర జాతులతో కలిసి పోయారు. ఆర్యగణాలు స్థానిక ప్రజలను తీవ్రమైన హింసాకాండకులోను చేయడం వంటి పాశవిక చర్యలకు కొన్ని ఆర్యగణాలు ఆమోదించి వుండరు. అట్టివారిని దస్యులనడం ఆర్యులకు పరిపాటయింది. దీన్ని దృష్టిలో పెట్టుకుని తరిమికొట్టబడిన ఆర్య తెగలు గురించే ఇంద్రుడు "దస్యుల్లకు ఆర్య నామధేయం లేకుండా చేశాను" అని త్రాగుబోతు మాటలు వదిలాడు. ఇంద్రుడు ఎల్లప్పుడు సోమపానం మత్తులో జోగేవాడనే దానికి వారి గ్రంథాలే సాక్ష్యం. అసలు మన వేదాలే కట్టుకథలని, ఇవన్నీ నమ్మరాదని ఇవి కల్పితాలని, అతిశయోక్తులని అనేక మంది తత్వశాస్త్రవేత్తలు చివరకు బుద్ధుడు చెప్పడం జరిగింది. మన ఆలోచన చరిత్ర పరిశోధనగా ఉండాలి. సామాజిక శాస్త్రవేత్తలు, పురావస్తుశాస్త్రజ్ఞులు చెప్పిన వాస్తవాల ఆధారంగా వుండాలి అప్పుడే నిజాన్ని చూడగలం.

అసలువిషయానికి వద్దాం.ఆర్యులు భారత ఉపఖండానికి ఎక్కడనుండి వచ్చారు? అనేది భిన్నభిప్రాయాలతో కూడా ఉందిగాని ఆర్యులు బయట నుండి వచ్చినవారేననే వాదన అత్యధిక చరిత్రకారులుఆమోదించిందే. స్లావిక్ దేశాలు (ఇరాన్, ఇరాక్) అనగా ఆసియామైనరునుండి ఆర్యులు వచ్చారన్న వాదం పాతది. ఇటీవల కొన్ని చారిత్రక పరిశోధనల ప్రకారం హంగరీమైదానం నుండి వచ్చిఇరాన్ ఇరాక్‌లో మజిలీవేసి అక్కడ నుండి వచ్చారనేదికొత్త

వాదన. యూరప్‌నుండి ఇండియాకు రావాలంటే జైజాంటి యాం మీదుగా ఇరాక్, ఇరాన్ చేరి ఇండియాకు రావల్సివుంది. మరోదారిలేదు. ప్రముఖ చరిత్ర పరిశోధకులురోమిల్లాథాపర్ ఇలా రాసారు.

"ఆర్యులు భారతీయులుకారు. వారు విదేశీయులు. వారు. ఈశాన్య ప్రాతం కాస్పియన్ సముద్రం. చుట్టూ ఉన్న ప్రాంతం నుండి వచ్చారు. (అదిసోవియట్ ఆసియా రిపబ్లిక్కుల (ప్రాతం)

"ఆర్యులు ఆర్క్టిటిక్ మహాసముద్రప్రాంతం నుండి హిందూ కుష్‌పర్వ తాల మీదుగా ఉత్తర ధ్రువ ప్రాంతం నుండి భారతదేశం వచ్చారు" అని ప్రముఖ స్వాతంత్ర సమర యోధుడు తిలక్ రాశారు

అలాగే"ఆర్యులు ఇతరప్రాంతాలనుండి భారతదేశం వచ్చారని" మాజి రాష్ట్రపతి ప్రముఖ భారతీయ తత్వవేత్త రాధకృష్ణ పండితుడు తనభారతీయ తత్వశాస్త్రంలో రాసారు:

"చరిత్ర లోపం జరిగింది" అనే గ్రంథంలో గార్డియన్ చైల్డు ఇలా రాశారు"క్రీ"పూర్వం 1200 సంగరాల ప్రాంత లిపి బద్ధంగాని వాఙ్మయాధా రాలు భారతదేశానికివచ్చిన ఆర్యులు గురించి వారి అనాగరిక జీవితం గురించి తెలియ చేస్తాయి"

"ఆర్యులు క్రీస్తుకు పూర్వం రెండువేల సంవత్సరాలకు పూర్వం భారత దేశానికి వచ్చినపుడు వీరు పశుపాలక సంచార జీవితం గడుపుతున్నారు. గుర్రం వాహనంగా ఉండటం, పశుపాలక మంద రూపంలో కావలసినంత ఆహారాన్ని వెంటతీసుకుపోవడం, ఇనుము తెలిసివుండటం, వారికిసైనిక విజ యాలను సమకూర్చిపెట్టాయి. క్రీస్తుకు పూర్వం 1750 ప్రాంతానికే సింధు లోయ ప్రజలను జయించారు"

ప్రముఖ చరిత్రకారులు కంబంపాటి సత్యనారయణ
[ఆంధ్రు సంస్కృచరిత్ర]

"అర్సులు భారతదేశానికి క్రీస్తుపూర్వం 3వేల2750 ప్రాంతంలో దబ దబా గుంపులు, గుంలుగా తెగలు, తెగలుగా రాసాగారు. అప్పటికే సింధునది తీరంలో గొప్ప పట్టణ నాగరికత మహెూజ్వలంగా విలసిల్లుతూ ఉండేది.

1927లో జరిగిన తవ్వకాలు ఫలితంగా పశ్చిమ పంజాబులోని హరప్పా, సింధురాష్ట్రంలోని మొహంజుదారో నాగరికత కేంద్రంగా వెలుగులోనికి వచ్చాయి. ఆ తర్వాత జరిగిన, నేటికి జరుగుతున్న పరిశోధనల ఫలితంగా సింధు నాగరికత కేవలం సింధుతీరంలోనే గాక ఉత్తర, తూర్పు, దక్షిణ ప్రాంతాలుకుడా ఆనాడు విస్తరించినట్లు దాఖలాలు లభిస్తున్నాయి. "కమ్యూనిజం మాసపత్రికలో శ్రీ ఏటుకూరి బలరామమూర్తి భారతీయ సంస్కృతి నుండి)

భారతదేశ చరిత్ర అతిప్రాచీనమైంది. సుమారు 4వేల సంవత్సరాలవాటిది- ఆర్యులు, శకులు యవనులు [గ్రీకులు] కుషానులు, హూణులు, గూజ్జరులు, జాట్‌లు,మొదలైన ఎందరో మధ్య ఆశియా నుండి వచ్చి అంతకు ముందు ఇక్కడ నివసిస్తున్న అసురులు, గిరిజన తెగలలో కలిసిపోయరు. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ, ఏర్పడి వీరందరూ యిముడ్చుకోబడ్డారు;

–చంద్రరాజేశ్వరరావు భారత కమ్యూనిస్టుపార్టీ మాజికార్యదర్శి (విశాలాంధ్ర) దినపత్రికలో

**4-4-93**

మాజీప్రధాని నెహ్రూపండితుడు తాను రాసిన ప్రఖ్యాత గ్రంధం: భారత దర్శిన్‌లో "ఆర్యులు మధ్యాసియానుండి వచ్చినవారు ఒకతెగ హిందూకుష్‌పర్వతాలు మీదుగా కైబర్, బొలాన్ కనుమల ద్వారా. సింధుప్రాంతమునకు వలస వచ్చినారు"

ఆర్య తెగలు సహజంగా వారిలో వారు పోట్లాడుకోవడం, జూదమాడటం, త్రాగడం వగైరా దురలవాట్లు గలవారు యిందువల్ల వారిలో ఒక తెగ ఐరోపాకు వలసపోయారు. తెగలు అభివృద్ధి చెందుట, వాస యోగ్యములు మృగ్యమగుట, కూడా వారి మధ్య పోరాటాలకు, వలసలకు కారణమైంది.

యూరప్‌కు పోయిన తెగలకు వారసుడే హిట్లరు. జర్మన్ ప్రజలు ఆర్యన్ జాతివారు. పౌరుషవంతులు, పోరాటయోధులు, ప్రపంచమంటే మనదే అనే దోరణితో జర్మనీ ప్రజలను జాతీయ దురహంకారంతో హిట్లరు రెచ్చగొట్టాడు. అనేక యితరజాతులతెగలను హతమార్చాడు. ముఖ్యంగా యూదు

లను సర్వనాశనం చేయాలని లక్షలాది మంది యూదులను హిట్లరు ఊచకోత కోయించాడు. చివరకు రెండో ప్రపంచ యుద్ధంతెచ్చి కొట్లాది మంది ప్రజలను సర్వనాశనం చేశాడు. హిట్లరు ఆర్యజాతి పేరు మీదుగా యూదులను సర్వనాశనంచేస్తే ఇండియాలో ఆర్యులు నాగజాతిని హతమార్చి అణచివేశారు. ఆర్యులు ఎక్కడవున్నా హింసా ప్రవృత్తి వారి లక్ష్యంగా వున్నట్లుంది.

ఈ జర్మన్ జాతివారిని "అరియనులు అంటారు. యిది ఆర్యశబ్దం" నుండే పుట్టింది. వీరు వట్టి స్వార్థపరులు. యితర జాతులు తమకు లోబడి వుండాలనేది వీరిభావం. ప్రపంచ జాతులను పాలించేహక్కుత మకు మాత్రమే వున్నదనే ఆధునిక సిద్ధాంతం కలదు. దీనినే అర్యన్ "సుపీరియారిటీథీరి" అంటారు. నేటికి యిక్కడ వున్న ఆర్య బ్రాహ్మణులకు కూడా యీ భావనే వుంది.

"ఆర్యులు విదేశీయులనడం కట్టుకథ" అని ఇటీవల అర్య బ్రాహ్మణ పండితులు ఆధారాలు లేని ప్రచారాన్ని జోరుచేశారు. వారు ఎంత ప్రచారం చేసినా చరిత్ర వాస్తవాలను కాదనడం ఎవరికి సాధ్యం కాదు. ఇటీవలే భారత ప్రధాని పి.వి. నరశింహరావుగారు 1993 సెప్టెంబరు 20,21,22 తేదీలు ఇరాన్ పర్యటించారు. ప్రధాని వెంట ఆహ్వానిత పాత్రికేయునిగా" ఆంధ్ర జ్యోతి"దినపత్రిక మేనేజింగ్ డైరెక్టరు శ్రీ కె.జగదీస్‌ప్రసాద్ ఇరాన్ దేశాన్ని సందర్శించారు. ఈ సందర్భంగా 10 అక్టోబరు 1993న ఆంధ్రజ్యోతి పత్రికలో "ఆర్యుల దేశం ఇరాన్" అనే శీర్షికతో ఒకవ్యాసం ప్రచురించారు. అందులో యిలాగుంది. 'క్రీస్తుకు పూర్వం 3000 యేళ్ల క్రిందట హంగేరి మైదానాల నుంచి హస్త సింధు ప్రదేశానికి వలస వచ్చిన ఆర్యులు మొదటిసారిగా ఒకచోట స్థిరపడిన దేశానికి 'ఇరాన్' అని పేరు. అయితే ఆ ప్రాంతంలో సుమారు లక్ష యేళ్ల కిందట నుండే మానవులున్నారు. వారు ప్రస్తుతము 'ఫార్' అనబడే అటవిక జాతివారు. ఈ ఫార్‌ల దేశం'పర్షియా'. వీరి భాష పార్సీ. ఈ వాస్తవాన్ని ఎవరూ కాదన లేరు ఈపర్షియానే నేడు ఇరాన్ అంటున్నారు, క్రీస్తుశకం 640లో అరబ్బులు దాడిచేసి ఇస్లాంను అధికార మతం చేశారు, ఆతర్వాత 850యేళ్ల పరదేశీయులదాస్యంలో నలిగిపోయింది. ఈ కాలంలోనే పర్షియా అన్నా పేరును ఇరాన్‌గా ప్రచారంలోకి తెచ్చారు వ్యాసంలో యింకా యిలా రాశారు" భారతదేశంలో శూద్రులైన నందులు,

మరో బలీయమైన మగధ సామ్రాజ్యాన్ని స్థాపించిన కాలంలోనే క్రీస్తుకుపూర్వం 550లో పార్సీలు అర్యరాజులను ఓడించి తమ సామ్రాజ్యాన్ని నెలకొల్పారు.

మరో ఉదాహరణ:- అర్యులు బైట నుండి ఇక్కడకు వచ్చారనడానికి ఇటీవల మరో ఉదాహరణ; వెలుగులోకి వచ్చింది ;స్వాతంత్రం వచ్చాక (అదికార మార్పిడి) పురాతత్వ శాస్త్రజ్ఞులు రామాయణంలోని నగరాలు అందు వర్ణించిన అంశాలపై ఇక్కడ పరిశోధనలు, తవ్వకాలు జరిగాయి. ఆధారాలు లభించలేదు. రామాయణంలోని కొన్ని అంశాలు బొత్తిగా అతిశయోక్తులుగా వున్నాయి ఈకారణాల వల్ల కొందరుశాస్త్రిజ్ఞులు, చరిత్ర పరిశోధకులు అసలు రామాయణం జరగలేదు పొమ్మన్నారు. ఇప్పుడు తేలిందేమంటే రామాయణ కథ ఇరానీ ప్రాంతానికి చెందిందని బైట పడింది. మహాకవి వాల్మీకి రామాయణం ఒక చరిత్రగా రాయలేదు రాసిందిసగం నవల రూపంలో, కల్పన సగం అద్భుతమైన ఊహ కలగలిపి మహోన్నతంగా చిత్రించారు దీనికికొంత చారిత్రక సత్యం లేకపోలేదు. అదే ఇపుడు ప్రొఫెసర్ సుకుమార్ సేన్ అధర్వణ వేదం ఆధారంగా పరిశోధనలు చేసి "రాముని చరిత్రకు పీఠిక" అనే గ్రంధాన్ని రచించాడు. దానిలో రాముని మాతృభామి "మార్గ"-తుర్కు మేనిస్తాన్ లోవున్న "మేర్వ్" అని తేల్చి చెప్పారు. ఇది ఇరానీ భాష మాట్లాడే ప్రాంతం అందువల్ల "మార్గవరాముడు" అని పేరు' ఇదిభార్గవరాముడు (పరశురాముడు) ఇతనూ వేరు అని తెలుపడానికి. పనికొస్తుంది "బర్గ" కూడా ఇరాన్‌లోనే ఉంది పరిశోధకుని లెక్క ప్రకారం రామాయణ కాలం క్రీ.పూ. 2024-1646 సం; రాముడు జయించిన లంక సింధు ప్రాంతంలోని "మొహంజోదారో" అని వివరించాడు. మహాకవి విశ్వకవి రవీంద్రనాధటాగూర్ తన పర్షియన్‌యాత్ర అనే గ్రంధంలో "లంక" అంటే మొహంజోదారో. అయి వుంటవచ్చని ఊహ వెల్లడించాడు. రాముడు వింధ్య పర్వతాలు దాటిరాలేదని మన చరిత్రకారులు చెబుతున్నారు. దీన్నిబట్టి ఇప్పుడున్న "శ్రీలంక" కాదని ఇదీవరకే తేలిపోయింది. దీన్నిబట్టి అర్యులు భారత ఉపఖండం మీదకు దాడికి బయలుదేరిన తొలిజురోల్లో రాముడు ఉన్నాడని అర్ధమౌతుంది రావణుని స్వర్ణ లంకను రాముడు జయించాడు (వివరాలకు ఆంధ్రజ్యోతి28-3-93పత్రిక చూండండి)

ప్రముఖ జర్నలిస్టు, హేతువాది నార్ల వెంకటేశ్వరావు హరప్పా నాగరికతను ఆర్యులే విధ్వంసం చేశారని స్త్రీలు, పిల్లలు అనే వివక్షలేకుండా ముక్కలు

ముక్కలుగా నరికి పోగు లెట్టారని, ఎముకలు గుట్టలుగా తవ్వకాలలో బైట పడ్డాయని వారి రచనల్లో వివరించారు.

ఆర్యులు తమ వేదాల్లో చెప్పిన అసురులు, దస్యులు, హరప్పా ప్రజ లేనని, వీరు ఆర్యులవలే కర్మకాండలు, యజ్ఞయాగాలు చేయరని దేవతలను పూజించరని, వీరు ధనవంతులని దిట్టమైన కోటలు కట్టుకున్నారని అనాటి వేదాల్లోరాసుకున్నారు' ఈకోటలను ఇంద్రుడు నాశనం చేశాడని చెప్పబడే ఈ వర్ణన హరప్పా నగరాలకు సరిపోయిందని ఈ నాటి పురాత్వత శాస్త్రజ్ఞులు' చెబుతున్నారు. ఇంద్రుడు ధ్వసం చేశాడని చెప్పబడుతున్నా :హరియూపియా ఈనాటి హరప్పా అవే దేనని నేడు భావించబడుతుంది. హరప్పా నాగులకు చెందినది.

దీన్నిబట్టి ఆర్యులు ఇక్కడకు రాక ముందే నాగులసంస్కృతి, సభ్యత ఇక్కడ ఉన్నతస్థాయిలో వుందని స్పష్టమైంది ఆర్యేతరులందరూ ద్రావిడులు కారుకాని ద్రావిడులందరూ ఆర్యేతరులే. సింధునాగరికత బయటపడకముందు ఆర్యులునాగరికులని ఇక్కడున్న ద్రావిడులు అనాగరికులనిఇక్కడ చరిత్రలన్నీ రాశాయి. ఈ సింధు నాగరికత బైటపడ్డాక అగ్రకులాలకు చెందిన చరిత్ర కారులు తేలుకుట్టిన దొంగల్లాగ అయ్యారు.

దీనిపై సోవియట్, పశ్చిమ దేశాలకు చెందిన ప్రాచ్యభాషా పండితులు హరప్పాలిపి ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదని దృఢంగావాదిస్తున్నారు.

ఇటీవల సోవియట్ ప్రముఖ శాస్త్రవేత్త డాక్టర్ బోనుగార్ప్ లెవిన్, నికి తాగురోవ్లుకంప్యూటర్ సాయంతో హరప్పా లిపిని పరిశీలించి వర్గీకరణచేసి ఇది ద్రావిడ భాషా కుటుంబానికి చెందిందేనని -1985 మార్చి 10వ విలేఖ. రుల గోష్టిలో వెల్లడించారు.

ఆర్యులు,శూద్రులు ఒకటేనంటే ఆర్యులు భాష సంస్కృతంకాగా శూద్రులు (ద్రావిడులు)భాష వేరుగా వుంది. ఆచారాలు,సాంప్రదాయాలుపూర్తిగాభిన్నం

ఒకవైపున ఇంద్రుడు వజ్రాయుధంతో వధించాడు అనే రుగ్వేదంలోని మాటను డా॥అంబేద్కర్ ఉదహరిస్తునే:స్థానికులపైదండయాత్రలు జరిపివారిని జయించారని చెప్పడానికి ఆధారాలులేవు; అంటున్నారు. పైచెప్పిన రుగ్వేద

వాక్యాలు అంబేద్కర్ చెప్పినవాక్యాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. వీటిని లోతుగా మనంపరిశీలించాల్సిన అవసరముంది' ప్రముఖహేతువాది హేతువాద రచయిత సి.వి. రాసిన "వర్ణవ్యవస్థ" అన్న గ్రంధంలో ఇలా రాసారు శూద్రులకు ఉపనయన సంస్కారాన్ని బ్రహ్మలు నిరాకరించి నందు వల్లనే పాలక వర్గాలుగా నున్న శూద్రులు బానిస రూపంలో కూరుకు పోయారు అని శ్రీఅంబేద్కర్ వాదిస్తున్నారు. ఈవివరణ పూర్తిగా అశాస్త్రీయమైనది.శ్రీఅంబేద్కర్‌వాదనను ఏవిధమైన చారిత్రక అధారం సమర్ధించనేరదు శ్రీ సి.వి.ఇంకాఇలారాశారు "మధ్యాసియానుండి క్రీస్తుపూర్వం 1500లో తండాలు తండాలుగా ఇండియాలో ప్రవేశించిన పశుపాలకులైన ఆర్యులు వేలాదిసంవత్సరాలుగా ఈదేశంలో ఉంటున్నా ద్రావిడ మన్‌క్మేర్ ప్రజల్ని యుద్ధాల్లో ఓడించి బానిసల్ని చేసి చాకిరికి పెట్టారు. వారే అనంతర కాలంలో వర్ణవ్యవస్థలో శూద్రులుగా మారారు' ఈసత్యాన్ని నిరూపించేందుకు ఆదిమార్యుల ప్రధమ గ్రంధమైన రుగ్వేదమే ఎదురులేని నిదర్శనం. ఇందుకు చెందిన వివరాలకోసం పాఠకులు రాహుల్ సాంకృత్యాయన్ రాసిన "రుగ్వేద ఆర్యులు" అనేగ్రంధం చూడడం మంచిది ఇంకా మరింత వివరణలోకిపోతే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్కిస్టు) అగ్రనాయాకులు, ట్రేడ్ యూనియన్ నాయకుడు నండూరి ప్రసాదరావుగారు రాసిన "బుగ్వేద సంహిత అనువాద సమీక్ష"అను గ్రంధంలో ఇలారాసారు.

"క్రమముగా వర్ణవిభేదాలు బయలుదేరాయి, ఓడిపోయిన దాస ప్రజలు బానిసలుగా చేయబడ్డారు, బానిసలన్న అర్ధానికి దాసులు అనేది పర్యాయ పదమైనది, బుగ్వేద కాలం చివరకు ఏవిధంగా వర్ణభేదము లేర్పడినవో తెలుస్తుంది: ఇంకా ఇలారాసారు

"దీన్నిబట్టి ఒకటి స్పష్టమవుతుంది బుగ్వేద ప్రారంభంలోనే పురోహితులున్నారు. వారుకూడా ఇతరులువలె యుద్దాలలో పాల్గొనేవారు భరద్వాజుడు వశిష్టుడు, విశ్వామిత్రుడు, వారిపుత్రులు, వంశీకులు, అనేక యుద్దాల్లో పాల్గొన్నారు. బ్రహ్మణులకు, క్షత్రియులకు భేదంలేదు, కానిసప్తసింధును జయించిన తరువాత ధస్యులను, దాసులను బానిసలుగా చేసుకున్న తర్వాత పణులను లోబర్చుకున్న తర్వాత ఈచాతుర్ వర్ణ కల్పన జరిగింది"

ప్రముఖ జర్మన్ ఇండాలజిస్టు, పెక్కుమంది భారతీయ మార్కిస్టు పరిశోధకులకు మార్గ దర్శకులయిన వాల్టేర్‌రూబెన్ రాసిన"ప్రాచీన భారతసమాజంలో బానిసలస్థితి గతులు" అన్న గ్రంధంలో..... వీరికంటే (ఆర్యులు) ఎక్కువ

విలువైన (సంఖ్యగల) బానిసలను కలగిన పితృస్వామిక కుటుంబాల తోను ఈతెగలుఇండియాకు తరలి వచ్చినట్లు కనబడుతుంది. వీళ్ల సాపేక్షంగాఆదిమ విజేతలే అవడంచేత మరింతఅభివృద్ధి చె, దిన మొహంజోదార్ హరప్పా వంటి సింధుప్రాంతానికి చెందిన రాజ్యాలను పట్టణాలను నాశనం చేసినట్లు కనబడుతుంది.

అయితే ఆర్యులు బానిసలను కలిగివున్నారా ? లేదా ? అనేది చర్చనీయాంశమైంది. ఆర్యులు భారతదేశానికి వచ్చే ముందే ఇరాన్ ఇరాక్ దేశాలలో ఆదిమ వాసుల తెగలను ఓడించి వెంట తెచ్చుకున్నారనిపిస్తుంది.

మౌర్యయుగం క్రీ।। పూర్వం 322 నాటిది. ఈ దశలోనే కౌటిల్యుని అర్థశాస్త్రం పుట్టుకొచ్చింది. ఈ అర్థశాస్త్రంలో శూద్రులు ఆర్యులలో భాగముగానే చిత్రించాడు. దీనికి పూర్వరంగం ఏమంటే చుట్టూ విదేశీయ దాడులు ప్రారంభమయ్యాయి. అలెగ్జాండరు పెద్ద ఎత్తున సైన్యంతో దాడి ప్రారంభించాడు. శూద్రులు, ఆర్యులు ఒకటే అనుకోకపోతే శూద్రులు శతృవులతో కలిస్తే వచ్చే ప్రమాదాన్ని కౌటిల్యుడు గుర్తించి ఆర్యుల క్షేమం కోరే శూద్రులను ఆర్యులతో కలిపివేసే ప్రయత్నం చేసాడు. దీనికితోడు గ్రీకు దండయాత్ర కారణం. దీనికి ముందు మహా పద్మనందుడు శూద్రుడు ఇతడే మగధలోని రాజ వంశాన్ని కూలదోసి నంద వంశాన్ని స్థాపించాడు. ఈ కక్షతో చాణిక్యుడు నంద వంశాన్ని నిర్మూలించడానికి మరో మార్గంలేక మరో శూద్రుడైన చంద్రగుప్త మౌర్యునికి రాజ్యాధికారం కట్టబెట్టి శూద్రులను చీల్చి నంద వంశాన్ని నాశనం చేయడం జరిగింది. నంద రాజులకు కూడా రాక్షసుడనే బ్రాహ్మణుడు ప్రధానమంత్రిగా వుండటం గమనించతగ్గదే. మౌర్య సామ్రాజ్యానికి కూడా బ్రాహ్మణుడైన చాణిక్యుడే మంత్రిగా వ్యవహరించాడు. ఆనాటికి వర్ణవ్యవస్థ అస్తవ్యస్తంగావుంది. వర్ణ సంకరం విపరీతంగా సాగుతుండేది.

క్రీ।। పూర్వం 300-270 నాటికి మనుస్మృతి అమల్లోకి వచ్చింది. కులవ్యవస్థను పకడ్బందిగా అమలు జరిపే సూత్రాలు నిర్దేశించబడ్డాయి. ఎన్నో కఠోరమైన శిక్షలు, ఆంక్షలు హింసాకాండ అమల్లోకి వచ్చాయి. అనేక రకాల స్మృతులు వెలువడ్డాయి. కౌటిల్యుని అర్థశాస్త్రంగాని, మను, నారద, పరాశర, గౌతమ వగైరా స్మృతులన్ని దళిత కులాలను అణచడానికి అగ్రకులాల రక్షణకు వచ్చినవే. ఎన్నో స్మృతులు వచ్చినా, పురాణాలు సృష్టించినా శూద్ర, కులాలు తమ ఉనికిని, ప్రత్యేకతను కోల్పోలేదు. ఆర్యులలో కలసిపోలేదు. ముస్లిం దండయాత్రలు అగ్రకులాలకు గర్వభంగం కలిగించాయి. అప్పుడే కొంత కళ్ళు తెరిచి దళిత కులాలను తమలో కలుపుకోవాలని చూశారు. వర్ణ వ్యవస్థను కొంతవరకు సడలింపచేశారు.

# ఇండియాలో బానిసత్వం లేదా ?

ఇతర దేశాల మాదిరిగా భారతదేశంలో బానిస వ్యవస్థలేదని కొందరు దేశ విదేశ రచయితలు గ్రంథాలురాసి ఇక్కడ కులవ్యవస్థను మరుగుపర్చారు. బానిసత్వం కంటే మరింత నికృష్టమైన కులవ్యవస్థ నేటికి కొనసాగుతున్నది. బానిసత్వం లేదనడం విడ్డూరంగా వుంది. బానిస వ్యవస్థలో బానిస యజమానికే పరిమితమైవుంటే కులవ్యవస్థలోని బానిసలు అగ్రకులాలందరికి శాశ్వతంగా అణిగి మణిగి వుండాల్సింది. అమెరికా, యూరప్, దేశాలలోని ఆనాటి బానిసలకు కొన్ని సందర్భాలలో బానిసత్వం నుండి విముక్తి పొందటానికి అవకాశలుండేవి. నేటి ఈ కులవ్యవస్థలో అలాంటి విముక్తి లేకుండాపోయింది. వర్ణ వ్యవస్థతోపాటు బానిస వ్యవస్థ వేదయుగం నుండి బౌద్ధ యుగం వరకు సాగింది. బౌద్ధయుగంలో దాదాపు వెయ్యి సం॥రాలు మినహాయిస్తే నేటికి కుల వ్యవస్థ, బానిస వ్యవస్థ కొనసాగుతూనే వున్నాయి. ఇంత సుదీర్ఘ కాల బానిసత్వం కొనసాగింపు ప్రపంచ చరిత్రలోనే అరుదు. ఈ రెండు వ్యవస్థల మధ్య ఐక్యత-ఘర్షణ భారత సమాజ పరిణామానికి కీలకమయినాయి. ఆర్థిక పరిణామంలో భాగంగా సమాజ పరిణామం సాగడం మనకు తెలిసిందే. పై వర్గాలు కొన్ని సందర్భాలలో కొందరు క్రింద వర్గాలుగా మారడం జరిగింది. అనులోమ, విలోమ వివాహాలు సర్వసాధారణమయ్యాయి. ఆర్యేతరులు కొందరు ఆర్యులయ్యారు. ఆర్యులు ఆర్యేతరులయ్యారు. శూద్రరాజులు కొందరు ఆర్యులనిపించుకోడానికి పడరానిపాట్లుపడ్డారు. పూజారి పురోహిత వర్గాలు, బ్రాహ్మణులు క్షత్రియులై (రాజ్య పాలకులు) రాజ్యాలు ఏలారు. ఇలాగే ఎన్నోసార్లు చిల్లర మల్లర మార్పులు చేర్పులు జరిగినప్పటికివి ప్రధానంగా భారత సమాజం అగ్రకుల-దళిత కులాలుగా విడిపోయాయి. రెండు శత్రు శిబిరాలుగా నేటికి వుండటం గమనించతగ్గ అంశం. బానిసలుగా మార్చబడ్డవారు ప్రధానంగా నాగులే-నాగులే ఆర్యులకు బద్ధశత్రువులు.

వేదయుగంలో ఋషులు, మహర్షులు, మునులు, బ్రహ్మర్షులు, వగైరా పేర్లతో వున్నా వారి ఆశ్రమాలన్ని ఫ్యూడల్ కేంద్రాలుగా సృష్టించబడ్డాయి. ఈ ఆశ్రమాలలోని ఋషులు కందమూలాదులు భక్షించి నీరు, గాలిమాత్రమే తీసుకొని జీవించేవారవి ప్రచారం చేశాయి. ఆచరణలో వీరు చక్రవర్తులను మించి సుఖ భోగాలు అనుభవించేవారు. మధ్య మాంసాలు, మత్తు పదార్థాలతో యథేచ్ఛగా జీవించారు. వీరి పోషణకు అగ్రకులాల్లోని పర్ణెన్నులు

రాజ్యపాలకులు వేలాది గోవులను, వందలాది బానిసలను, వేలాది ఎకరాల భూఖండాలను (ఒక్కొక్కరికి) దానాలుగా సమర్పించేవారు. వీటినే భూదానం, గోదానం, కన్యాదానాలు పేరుతో బ్రహ్మణ ఋషులు స్వీకరించేవారు. భరధ్వాజుడు. యాజ్ఞవల్క్యుడు, రైభ్యుడు, శ్వేతకేతు,ఉద్దాలకుడు, గౌతముడు,కణ్వుడు వశిష్ఠ, విశ్వామిత్ర వగైరా అంతా ఇటువంటి భూకామందులే. ఒక్కముక్కలో చెప్పాలంటే వీరంతా బానిస యజమానులుగా వుంటూ వీరికి తేరగా వచ్చిన భూముల్లో అప్పనంగా లభించిన బానిసలతో వ్యవసాయం చేయించి దోపిడి సాగించారు. ఈ భూఆక్రమణలో స్థానికంగా వున్న ఆదివాస ప్రజలను రాజ్యపాలకుల అండతో హత మార్చి అడ్డులేకుండా చేసుకునేవారు. ఇలా ఎందరో ఆదివాసులు భూములు కోల్పోయారు. భూములు కోల్పోయిన ఆదివాసులను ప్రతిఘటించిన తెగలను దుంప నాశనం చేసే వరకు ఈ ఋషులు నిద్రపోయే వారుకాదు. దండకారణ్యంలో భూములపై ఆది వరకే హక్కు భుక్తం కలిగి వున్న కర దూషణాదులను, మారీచ, సుబాహులను, తాటకి శూర్పణఖలను ఈ విధంగానే శ్రీరాముని చేత ఋషులు హతమార్చడం జరిగించటవి అను కోవాలి. నాటి నుండి నేటి అరణ్యాలలోను, కొండల్లోను నివశిస్తున్న ఆదివాసులు భూములను సంపదలను పాలకులు వారి సంబంధీకులు దోపిడి చేస్తూనే వున్నాయి. ఆదివాసులు తిరగబడితే ఆనాడు రాక్షసులని (ఈనాడు నక్సలైట్లులాగ) పేరుపెట్టి సర్వనాశనం చేయడం జరిగింది.

ఇక్కడొక విషయాన్ని విశదమ్చే పరిశీలించాల్సివుంది-ఆర్యులు భారత ఉపఖండంలోకి రాకముందున్న వ్యవస్థవేరు. వచ్చాక మారిన పరిస్థితివేరు ఈ రెండింటిని కొందరు చరిత్రకారులు కలగాపులగం చేసి రాయడంవల్ల కొన్ని వాస్తవాలు మరుగునపడ్డాయి.

ఆర్యులు రాకముందు భూమి వ్యక్తుల చేతులలోలేదు. అనగా భూస్వామ్య వ్యవస్థలేదు. భూమిపై హక్కు అక్కడ నివసించే ప్రజలందరికి సమానం. అందువల్ల భూమి కొనడం అమ్మడం అనేవి ఆనాడులేదు. పన్నులు తీసుకునే అవకాశం మాత్రం రాజులకుండేది. నాగులు తదితర ఆది జాతులు గణతంత్ర వ్యవస్థ మాతృస్వామిక వ్యవస్థలు కలిసికట్టుగాసాగినవి. ఆర్యులు వచ్చాకకూడా ఈ వ్యవస్థ అంత తేలికగా మారలేదు. ముస్లిం రాజుల వరకూ దాని ఛాయలు కొనసాగాయి. భూమిపై ప్రజలందరికి గల సమానహక్కుగల

లక్షణాలు ఆదిమ సమాజం నుంచి మనకు సంక్రమించాయి. పరాయివాళ్ళు వచ్చేంత వరకూ మన గ్రామాలు స్వయంపోషకాలుగా వర్ధిల్లడానికి మూల కారణం యిదే. దీనినే దేశ విదేశ చరిత్రకారులు కొందరు గొప్పగా వర్ణించి రాశారు. అనాడు సంఘశక్తిని ఆరాధించారు. వ్యక్తుల కంటే సంఘం గొప్ప దని గుర్తించారు. అయితే ఆర్యులు వచ్చాకనే యీ ప్రజాతంత్ర గ్రామీణ వ్యవస్థ క్రమక్రమంగా నాశనం చేయబడింది. భూములు వ్యక్తుల చేతులలోకి పోయాయి. ఆర్య రాజుల అండతో మంచి భూములన్నీ బ్రాహ్మణ ఋషులకు దఖలు పర్చారు. అగ్రహారాలు ఏర్పడ్డాయి. దీనితో రాజ్యాంలో ఉపరాజ్యం సృష్టించబడింది. ఆర్థిక ఆయువుపట్టు బ్రాహ్మణ అగ్రహారాల చేతులలోకి పోయింది. ఓడిపోయిన నాగులు, యక్షులు వగైరా జాతులవారిని అణచి వారిని బానిసలుగా మార్చి వ్యవసాయం సాగించడం జరిగింది. ఈ వ్యవస్థ ప్రారంభ దశలోనే మాలపల్లెలను సృష్టించారు.

ఈదేశానికి వచ్చిన ఆర్యులు (బ్రాహ్మణులు) శక్తివంతమైన గుర్రాలు, ఆయుధాతోల దాడులు చేసి అనేక విజయాలు సాధించినప్పటికిని స్థానికులైన అటవిక తెగలు, అప్పటికే అభివృద్ధి చెందిన గ్రామరాజ్యాలు దేశవ్యాప్తంగా వున్న నాగులు వగైరా అభివృద్ధి చెందిన జాతులు. శక్తివంతంగా తెగించి పోరాడారు క్రీస్తుకు పూర్వం 413 నుంచి 322 వరకూ పాలించిన నందులు శూద్రులే. నందుల అనంతరం రాజ్యానికి వచ్చిన క్రీ.పూ 322 నుండి 183 వరకూ పాలించిన మౌర్యులుకూడా శూద్రులే. ఒక శూద్రుడైన అశోకుడు నిర్మించిన సామ్రాజ్యం ప్రపంచాన్నే కుదిపేసిందంటే అనాటి స్థానికులైన నాగుల బలం ఏలాంటిదో అర్థంచేసుకోవచ్చు. ఇదిగమనించే ఆర్యులు శూద్రరాజ్యాల పంచనచేరి నయవంచన(నమ్మకద్రోహం) చేశారు శూద్రులదేవుళ్ళను, దేవతల ను ఆర్యులు సొంతం చేసుకున్నారు వారి అచార వ్యవహారములతో ఏక మయ్యారు. విదేశీపైనిక శక్తికంటే స్థానిక సంఘబలం మిన్న. దీనినికౌటిల్యుడు గుర్తించి శూద్రరాజులను లోబరచుకొని వారిద్వారానే శూద్రులను దెబ్బతీయ డం జరిగింది. కౌటిల్యుడు రాసిన అర్థ శాస్త్రమే దీనికి తార్కాణము. ఇందులో "శూద్రులతో కలిసిపోయినట్లు నటించి వారి మధ్య స్పర్ధలు కల్పించిరి ఒకరిలో నొకరు పోరాడి నాశనమయ్యేటట్లుచేయాలి. తమ తమ రాజ్యాలగురించి ప్రచా రం చేసి వారి ఘనతను కీర్తించి వారికి లోంగిపోయే స్థితికి ఈగణాలను తీసు కురావాలి. స్త్రీలను ప్రయోగించి ఈనాయకుల మధ్య వృధాకలహాలు సృష్టిం

చాలి వితంతువులను. యోగినులుగా ఈగణాల లోనికి పంపించి ఆనాయకు లకు స్త్రీవ్యామోహాన్ని పెంచివారు ఒకరినొకరు చంపుకునేలా చేయాలి" ఈ రకంగా అర్థశాస్త్రంలో అనేక పేజీలు రాయడంజరిగింది దీన్నిబట్టి అనాటి నాగుల సంఘాలు ఎంత శక్తి వంతమయినవో ,నాగులను ఎలా వయవంచనతో హత మార్చారో అర్థం కాగలదు.

అనాడు ఈ గణాలకు అధిపతులుగా ఉన్న కొందరు గణాధిపతులను కూడా లొంగదీసి వారిని ఆర్యులు తమలో కలుపుకొని వయవంచన చేసారు. ఆలాంటి గణపతే యీనాటి విఘ్నేశ్వరునిగా, గణపతిగా పూజలు చేయడం జరుగుతుంది. ఒక గణానికి ఒక చిహ్నం వుండేది. ఈనాడు దేవునిలా పూజింపబడుతున్న గణపతి చిహ్నం ఏనుగు. ఏనుగు తలవున్న మూర్తులను ప్రవేశపెట్టి స్థానికులను వంచన చేసారు. అనాడు గణాలు ఏనుగు, పాము, చిన్న ఎలుక వగైరా జంతువుల పేర్లతో తమ చిహ్నములను ఏర్పరచుకున్నారు. రుద్రునికంటే గణపతికి ఎక్కువ ప్రాధాన్యత యిచ్చారు. గణపతులు అనాడు అనేకులుండేవారు. కొందరు గణపతులు ఆర్యుల మాయలోపడి లొంగిపోయారు. ఈ శూద్ర ఆదిమ జాతులను పిశాచులు, రాక్షసులు వగైరా నీచమైన పేర్లతో చిత్రించి, వర్ణించి తమ పురాణాలనిండా కట్టుకథలతో నింపివేశారు. ఈలాంటి ఎన్నో మాయలు, మోసాలు చేసి ఒక భౌతిక, చారిత్రక సత్యాలను ఎన్ని విలువుల గోతిలో కప్పివేశారో వారి వైదిక సాహిత్యమే ప్రభల నిదర్శనం. ఆనాటి గణాలను, సంఘాలను ఆర్య బ్రాహ్మణులు తీవ్రంగా ద్వేషించారు. అటవిక సమాజాలనుండే అంతా వచ్చేమనే గుర్తులేకుండా పోయింది. దక్షిణాదిన అత్యధికులుగా వున్న నాగులు తదితర గొప్పజాతులను యీ పై విధంగానే నాశనం చేశారు. సామ, దాన, భేద దండోపాయాలు కల్పించి అన్ని పోరాట రూపాలు అనుసరించి కుల వ్యవస్థను స్థిరపర్చి చివరకు ఆర్యులే అగ్రకులంగా అధిపతులయ్యారు. ఈ స్థానిక ప్రజలను శూద్ర, పంచమ కులాలుగా నామకరణం చేశారు దీన్నిబట్టి బానిసత్వం లేదనటంకాదు. బానిసలుక్రింద బానిసలను సృష్టిచారు. యిదే కులవ్యవస్థలోని కీలకం.

# ఆంధ్రులంటే ఎవరు ?

భారత ఉపఖండంలోని జాతుల్లో తెలుగు జాతికి ఒక ప్రత్యేకత వుంది భారత ఉపఖండాన్నే ఎంతో ప్రభావితం చేసిన నాగుల భౌతిక చరిత్రలనుండి తీసివేశారు. అలానే ఆంధ్రుల చరిత్రను గందరగోళం చేసారు. క్రీ.పూ, 200 నుండి క్రీ. శ. 200 వరకు బౌద్ధజాతక కథలు హిందూ పురాణాలు యించు మించు అనాటివే. ఈ రచనలు ఒకరిమీద ఒకరు పోటీగా రాయడం జరిగింది. పురాణాలు అనాటి బానిసల సమస్యల నెత్తలేదు. ఒక కథను ఒకే అంశాన్ని రెండు దృక్కోణాలనుండి రాయడం జరిగింది. బ్రాహ్మణులు ఎంత సేపూ అందరిని కులవ్యవస్థలో బందీలుగా చేసేటట్లు రాశారు. అందుచేత కృత్రిమత్వం ఎక్కువ. బౌద్ధజాతక కథలు వాస్తవాలకు దగ్గరగా వున్నాయి. వైదిక సాహిత్యమంతా కాకమ్మ కథల్లాంటివే అయినప్పటికిని వాటిలో కొన్ని నిజాలు దాగి వున్నాయి. వాటినుండే మనకు కావలసిన చారిత్రకాంశాలు వెదికి బయటకు తీయాల్సివు ది మరోమార్గంలేదు. భారతీయ చరిత్ర కొంత విదేశీయులనుండే ఎరువు తెచ్చుకొనే దుర్గతిలో వున్నాం.

మన జాతికి తెలుగు-ఆంధ్ర అనే రెండు పేర్లు వాడుకలో వున్నాయి. మన పండితులు రాసిన చరిత్ర తదితర గ్రంథాలన్నీ "ఆంధ్ర" పదాన్నే వాడటం జరిగింది. ఇటీవల "ఈనాడు" దినపత్రిక వచ్చేవరకు మన దినపత్రికలన్నీ "ఆంధ్ర" పేరుతోనే వచ్చాయి. భాషమీద సాహిత్యంమీద బ్రాహ్మణులకే అధిపత్యం వుండటంవల్ల ద్రావిడ, తెలుగు ప్రజలపట్ల ఆదినుండి వున్న వ్యతిరేకతే యీనాటి వరకు కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది. "తెలుగు' అతి ప్రాచీనమని అందరకూ తెలిసిందే. ఆంధ్ర-తెలుగు వైరుధ్యం యీనాటిదికాదు. 1921లో ఆంధ్ర విశ్వవిధ్యాలయం బిల్లు మద్రాసు కౌన్సిల్‌లో పెట్టినప్పుడు సర్‌కూర్మా వెంకట రెడ్డినాయుడుగారు "ఆంధ్ర" అనే పదాన్ని వ్యతిరేకించారు. "ఆంధ్ర" అన్న పదం సంస్కృతమని "తెలుగు" ద్రావిడ పదమని, గనుక ఆంధ్ర పదాన్ని తొలగించిదాని స్థానంలో తెలుగుపదం చేర్చి 'తెలుగు యూనివర్శిటీగా ఉండాలని నాయుడుగారు అనాడే వాదించారు కాని కౌన్సిల్‌లో బ్రాహ్మణాధిక్యతవల్ల సవరణ ఓడిపోయింది. ఇటీవల కాలంలో శూద్ర, నిమ్న కులాలలో బ్రాహ్మణ వ్యతిరేఖత పెరిగి తెలుగుపేరు వాడుకలోకి వచ్చింది. తెలుగు భాషా సమితి ఎర్పడ్డాక "తెలుగు విజ్ఞాన సర్వస్వం"

పేరుతో 16 సంపుటాలు వెలువడ్డాయి. అలాగే ఇటీవల రెడ్లు, కమ్మ తదితర బ్రాహ్మణేతర కులాల పండితులు ముందుకు రావడంతో తెలుగు వాడుక లోకి వచ్చింది. తెలంగాణా సాయుధపోరాటం, అమరజీవి పొట్టిశ్రీరాములు తదితర అనేకమంది అమర హీరోలు తెలుగు ప్రజల మహోన్నత ఉద్యమ ఫలితంగా చివరకు 1956లో భాషారాష్ట్రాలు సాధించుకున్నాం. కేంద్రంలో తిష్టవేసిన బ్రాహ్మణ బనియా ముఠా "ఆంధ్రప్రదేశ్ పేరుతో భాషారాష్ట్రాన్ని ఏర్పరిచారు. ఈ పేరు మనం పెట్టుకున్నదికాదు. కేంద్రం మనపైన రుద్దింది. రాష్ట్రం అన్నమాట తొలగించి "ప్రదేశ్" అని చేర్చారు. రాష్ట్రం అంటే దేశం. ప్రదేశ్ అంటే ప్రాంతం. కేంద్రానికి తెలుగుజాతిపట్లవున్న వ్యతిరేకత దీనికి కారణం.

ఇక ఆంధ్ర అనే పదం గురించి పరిశీలిద్దాం. శతపద బ్రాహ్మణాలలో 'ఆంధ్రి' అనే మాటవుంది. అది ఒక ఆర్య తెగకు చెందిదిగా కనిపిస్తుంది. విశ్వామిత్రుని సంతతివారే ఆర్యులని చెప్పబడింది. శిభి చక్రవర్తి కొడుకుల్లో కూడా ఒకడు ఆంధ్రుడు వున్నాడు. అతని సంతానమే ఆంధ్రులని కూడా అం టారు. వింధ్యసీమలో ఏర్పడ్డ భోజరాజ్యంలో ఆంధ్రిరాజ్యం ఒకటివుండేది.

అశోకుని శాసనాలలో 'అందకులు' అనే మాట వుంది. అంధుకులనే భిక్షువుల సంఘం ఒకటి అమరావతిలో వున్నట్లు బౌద్ధగ్రంథాలు ద్వారా తెలు స్తుంది.

పల్లవుల రాజైన శివస్కంధవర్మ తన- 'మయిదవోలు' శాసనంలో కృష్ణా, గుంటూరు మండలాన్ని "అందపదా" అనిరాయించాడు. ఇది ప్రాకృతి భాషకు సంబంధించిన పదం. సంస్కృతంలో 'ఆంధ్రి' శబ్దాన్ని ప్రాకృతంలో 'అందక' అని వాడేవారు.

గ్రీకు రాయబారి 'మొగస్తనీసు' క్రీ॥పూ 4వ శతాబ్దంలో) 'అందరే' అనే రాజ్యం చాలా బలమైనదిగా వున్నట్లు తన 'ఇండికా' అనే గ్రంథంలో రాసుకున్నాడు. అంధ్రి రాజుల పదానికి ప్రాకృతంలో అందరే అనివాడాడు అనగా రాజులమబట్టి వారు పాలించే దేశాన్ని పిలిచే అలవాటున్న రోజులలో 'అందరే' అనేది దేశం పేరుగా భావించాలి. అందరే ఆర్య రాజులశబ్దం.

టాలెమీ, పెరిప్లసు అను చరిత్రకారులు "అందరే" అనురాజ్యం కృష్ణా గోదావరి సీమకు లోపలగా (పడమరగా) ఉందని రాశాడు. అదే నేటి మరాఠీ

సీమ"అందరే" ఒక రాజ్యం అది ప్రజలపేరు, భాషపేరుగాని కాదు. రాజులపేరు యిది. ఆర్యరాజుల నుండి వచ్చింది.

పురాణాల్లో 30 మంది ఆంధ్రభృత్యులనే వారు మగధను 450 సం॥ రాలు పాలించినట్లు రాశారు. వారిపేర్లు పాలనకాలాన్ని కూడా యిచ్చారు. వారి పేర్లలో కొన్ని మరాఠాను పాలించిన రాజులకు సరిపోయినట్లు ప్రతిష్టాన పురాన్నిరాజధానిగా పాలించినట్లు శాతవాహనులు శాసనాలద్వారాతెలుస్తుంది· ఆశాశనాలు బొంబాయికి దగ్గరగావున్నా కార్లే, జున్నూరు, నాసిక్ వద్ద నున్న బౌద్ధ గుహలలో వున్నాయి' మొదట ఒకతెగకు పేరుగావున్న "ఆంధ్ర" నామం వెయ్యి సం॥రాల కాలచరిత్రలో జరిగిన పరిణామలవల్ల భాషకు కూడా క్రమంగా వర్తించబడింది.

ఇంతకీ అంధ్రుల గురించి వచ్చిన గందరగోళం ఏమంటే కొందరు దళితచరిత్రకారులు ఆంధ్రులు దళితులకుచెందినవారని తెలుగులుపై కులాలకు చెందినవారని యిటీవల·కొన్ని వ్యాసాలు రాయడం జరిగింది ఇది వాస్తవాలకు దగ్గరగా లేదని చెప్పడానికి యింత రాయవలసి వచ్చింది.

తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'శాలివాహనుడు' అనే పుస్త కంలో యిలాగుంది. 'ఆంధ్రుల మాదిరిగా ఉత్తరాది నుండి దక్షిణాపథానికి వచ్చిన యితర జాతుల వారూ వున్నారు వీరిలో నలులు, జ్ఞాతృకులు ఇక్ష్వా కులు చెప్పదగినవారు. నలులదేశం తెలంగాణా నల్లగొండ ప్రాంతం. జ్ఞాతృ కులు ఓరుగల్లు ప్రాంతంలో వలసలు స్థాపించారు. యింకా ఇలారాయబడింది. 'ఉత్తరపథం నుండి ఆయా జాతులు వచ్చేటప్పటికి దక్షిణ భారతదేశం నిర్మానుష్యమైన ప్రాంతం కాదు. యిక్కడ తెలుగులు, నాగులు, యక్షులు, మహిషకులు మొదలైన వారున్నారు. మూలకులు అశ్వకులు గణతంత్ర వ్యవస్థలోనివారు ఈ తెగలు తరువాత నాగుల్లో కలిసిపోయారు.

మొట్టమొదట వింధ్య పర్వతాల్లో కాపురంచేసి ఆ తరువాత దక్షిణా పథంలో వ్యాపించిన ఆంధ్రులు సర్వజాతుల వారికి తలకట్టుగా వున్నారు. ఆంధ్రులు ప్రభువులు కావడంచేత మిగిలిన జాతులు వారు ఇందులో కలిసి పోయారు. అందువల్లనే మహాభారతంలో ఆంధ్రులు అనేకులు (ఆంధ్రశ్చబహ వం) అని చాటుకున్నది. అందువల్లనే యీ దేశానికి అంధ్రదేశమని ఇక్కడ భాషకు అంధ్రభాష అని పేర్లు ఏర్పడ్డాయి.

నాలుగున్నర శతాబ్దాలు వర్ధిల్లిన మహా సామ్రాజ్యాన్ని పాలించిన శాత వాహనులు ఈ ఆంధ్రజాతికి చెందిన వారే. ఆంధ్రదేశం జాతిని సూచిస్తే శాతవాహన పదం కులాన్ని చెపుతుంది.

(ఆఫ్ఘనిస్తాన్‌లోని "అంధకులు" ఆంధ్రుల ప్రాచీన పట్టణం అని అం టున్నారు).

ఆంధ్రుల గురించి మరికొన్ని చరిత్రలు యిలా రాస్తున్నాయి. ఆర్యులు ఉత్తర హిందూస్తానం చేరిన కాలంలో ఆర్యుల మధ్య పోట్లాటలు సంభవించి రెండు పక్షాలుగా చీలి బలవంతమైన పక్షంతో గెలవ బలంలేని పక్షం అగ స్త్యుడు చూపిన దారిని పడి దక్షిణ భారతదేశంలోని దండ కారణ్యం చేరుకొ న్నారు. ఆనాడు దండ కారణ్యం కాకులు దూరని కారడవి, అంధకార బం ధురం, దీనిని అంధకారణ్యమని పిలిచేవారు "అంధిక"అంటే సంస్కృతభాషలో చీకటి అని అర్థం. దక్షిణాదికి తరలి వచ్చిన ఆర్యులకు. ఈఅరణ్యమే నివాస మయింది. అంధకారణ్యములో నివశించారు కాబట్టి ఆంద్రులని పిలిచారు క్రమంగా యీమాట "ఆంధ్రులని" మారిపోయింది. ఉత్తరాది నుండి వచ్చి ఈ ఆంధ్రులు నాగులతో కలసిపోయి నాగాంధ్రులు గా కూడా పిలబడ్డారు. అలాగే ఆర్యులలో స్థిరపడ్డవారివి ఆర్యాంధ్రులు గా పేర్కొన్నారు.

అలాగే పుట్టపర్తి నారాయణా చార్యులు గారు రాసిన "ఆంధ్రులచ రిత్ర" అను గ్రంథంలో యిలా రాశారు,వింధ్యకు దక్షిణముగా ప్రయాణించిన ఆంధ్రజాతి, ఇచ్చట నివశిస్తున్న "పుండ్రులు "పులిందులు శబరులు మొద లగు వారితోకలిసిపోయి జీవించుట ప్రారంభించినది. ఆంధ్రులు రాకముందు ఈ దక్షిణ దేశమున నాగులు,యక్షులు మొదలగు కొన్ని జాతులు నివశిస్తు న్నాయి. జాతిబేధం లేని యక్షులు, నాగులు బౌద్ధాన్ని స్వీకరించారు. అందు చేతనే తెలుగునాట బౌద్ధం ఆనాడు విస్తృతంగా వ్యాపించింది.

దీన్నిబట్టి ఆంధ్రులు ఇక్కడవారు కాదని వీరు ఉత్తరాదికి చెందిన వారని స్పష్టపడుతుంది. వీరు ఆర్యుల మాదిరిగా ఇతర దేశాల నుండి వచ్చిన వారు కాకపోవచ్చు. ఉత్తర భారతానికి చెందినవారు కావచ్చు. అయినా వీరు ఆర్యమతాన్ని స్వీకరించారు. రెండోవైపు బౌద్ధాన్నికూడా పెంచి పోషిం చారు.

పైగ్రంధంలో యిలా వుంది. "మొత్తం మీద సంస్కృత, ప్రాకృత సాహిత్యాల్లోని కధల్ని దివ్యాంశాలు వదిలి సూక్ష్మంగా పరిశీలిస్తే శాతవాహనుడనే ఆంధ్ర జాతీయుడొకడు భిన్న జాతులవారయిన స్త్రీ పురుషులకు జన్మించాడని నిర్ణయించవచ్చు. ఆంధ్రజాతిలో యక్షులు, నాగులు వున్నారు. ఈ జాతుల్లో జన్మించిన పురుషుడు అన్యజాతి స్త్రీని ప్రేమించి పెండ్లాడి వుండవచ్చు. ఆనాటికే వర్ణాంతర వివాహాలు వున్నాయి. అప్పటికి యింకా ఈ భూభాగంలో ఆర్య సంస్కృతి సరిగా స్థిరపడలేదు. దీనికితోడు బౌద్ధం కుల మౌఢ్యాలను కూల్చివేసింది.

శాతవాహన రాజయిన గౌతమీపుత్ర శాతకర్ణి ఏక బ్రాహ్మణుడని నాసిక శాసనం చెపుతుంది. అటువంటప్పుడు శాతవాహన బ్రాహ్మణులు శూద్రులెట్లా అవుతారు ? అని ఎవరైన ప్రశ్నించవచ్చు. ఏక బ్రాహ్మణుడంటే ఏకైక బ్రాహ్మణ సంరక్షకుడని అర్ధం. ఇక్కడ మరో విషయాన్ని కూడా గమనంలోకి తీసుకోవాలి. గౌతమిపుత్రశాతకర్ణి మగధరాజా కాణ్వాయనశర్మను జయించి భారత చక్రవర్తిగా మారాడు కదా ! దీనికి కారణం ఉత్తరాది చరిత్రకారులు ఆంధ్రుల మీద కత్తికట్టి మరీ తొక్కిపట్టారు. చరిత్ర పుస్తకాల్లో ఈ ప్రస్తావన లేకుండా చేశారు. ఇది కావాలని చేసిన కుట్ర. తెలుగుజాతి ఒకప్పుడు మహాసామ్రాజ్య జాతిగా యిండియాను పాదక్రాంతం చేసుకున్నందుకు మన జాతి మీద ఉత్తరాది ఆర్య బ్రాహ్మణులకు ఆక్రోశం యిది.

శాతవాహనులు గణతంత్ర రాజ్యం అస్తక జనపధం వాళ్ళు. వీరు ఇండియా వారే. వీరి సంబంధ బాంధవ్యాలన్ని నాగులతోనే సాగాయి.

మహాభారత కాలంలోనే తెలుగుదేశంలోని వివిధ తెగలు సామరస్యంగా కలిసిపోయారు. కాని తెగలున్నాయి. శాతవాహనులు "అస్సకులు" వీళ్ళకు బుద్ధునికాలం నుండి గంగా మైదానంలో సంబంధం వుండి. కాబట్టి ముందుగా ఆర్యమతం పుచ్చుకున్నారు. ఆర్యమతం పుచ్చుకున్నంత మాత్రాన వీరు ఆర్యులు కారు.

ఆర్యుల వర్ణవ్యవస్థ దక్షిణాదిన ముఖ్యంగా తెలుగు దేశాన ఆనాటికి స్థిరపడలేదు. దక్షిణ దేశంలో పాలించే చేర, చోళ, పాండ్య, ఛేది, తెలుగు తాము క్షత్రియులమని చెప్పుకోలేదు. వీరంతా ద్రావిడ తెగలకు (నాగులకు( చెందినవారే.

ఈ సందర్భంలో మరో విషయం కూడా మనం గుర్తుంచుకోవాలి. క్రీ॥శ॥ 2వ శతాబ్దందాకా యీ తెలుగు దేశానికి "ఆంధ్ర" అనే పేరులేనేలేదు. శాతవాహన రాజుల పాలన తర్వాత మన భూభాగానికి 'ఆంధ్ర' అనే నామం వచ్చింది. శాతవాహనులకు పూర్వం ఈ తెలుగుదేశం కళింగ, తెలుగు, నాగ, వేగి, చోడ, ముళిక అనే పేర్లతో పిలవబడింది.

ఆర్యేతరులైన కళింగ, తెలుగు, బోయ, కోయ, చెంచు, ఎరుకలు ఎనాదులు, గొసంగి, మాల, మాదిగ మొదలైన వారిచే ఉండేది. వీరంతా నాగజాతిలో ఉపజాతులని చెప్పబడుతుంది.

అలాగే సంస్కృతం దక్షిణాదికి రాకపూర్వమే తెలుగు ఒక స్వతంత్ర భాషఅని దీని సోదర భాషలయిన తమిళం, కన్నడం, మళయాళంతో సహా అదిప్రజలు వాడుకలో ఉన్నదనేది చరిత్రలు చెపుతున్నాయి.

క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దం నుండి దక్షిణాదికి బ్రాహ్మణుల వలస పాేరంభమయిందని స్పష్టపడుతుంది. మహమ్మద్‌గజని దండయాత్ర లకు హడలిపోయి అనాడు కాశీ యిత్యాది ప్రదేశాల నుండి అశ్వలాయనశాఖ వారు తెలుగుదేశానికి వలసవచ్చారని సుప్రసిద్ధ చరిత్రకారుడు డా॥కృష్ణస్వామి అయ్యంగారు రాశారు. అల్లసాని పెద్దన్న ఈ శాఖకు చెందిన బ్రాహ్మణుడే.

ఏతావాత తేలిందేమంటే తెలుగుదేశాన్ని పాలించిన వారిలో రెండే రెండు కులాలున్నాయి. అవి శాతకర్ణులైన బ్రాహ్మణులు, శూద్రులైన ఆంధ్ర భృత్యులు, యిత్యాదుల్లు అంతేగాని వేలాది సంవత్సరాలు తెలుగు భూమిని పాలించిన వారు క్షత్రియులు ఎవ్వరూలేరు. ఇంతవరకు రాయబడ్డ చరిత్ర ప్రకారం ఇండియాను క్షత్రియ వర్ణానికి చెందినవారు పాలించిన దాఖలాలు అంతగాలేవు

**త్రిలింగదేశం:-** తెలుగుదేశం త్రిలింగదేశమని కూడా పిలువబడేది. నాగులు ఆదిలో శైవమతావలంబకులు. తెలుగుదేశంలో ముఖ్యమైనమూడు శైవక్షేత్రాలున్నాయి. రాయలసీమలోని శ్రీశైలం, తెలంగాణాలోని కాలేశ్వ రం, సాగర ప్రాంతంలోని ద్రాక్షరామం కలసి త్రిలింగం పేరు వచ్చిందం టారు. మన కవులు దీన్ని వర్ణించారు ఈ మూడు కలిసి మహాతెలంగాణాగా వుండేది.

క్రీస్తుకు పూర్వం 1వ శతాబ్దానికి సుప్రసిద్ధ భూగోళశాస్త్రజ్ఞుడు టాలెమీ ప్రపంచ రాజ్యాల భూగోళం రాశారు. దీనిప్రకారం "తెలంగాణా" లేక త్రిలింగం" మూడు ప్రాంతాలను ఆక్రమించుకున్న మహాదేశం.

అమూడు ప్రాంతాలు ఇలాగున్నాయి.

1)కావలి నుంచి గోదావరి వరకున్న తెలు గుదేశం

2)గోదావరి నుంచి మహానది వరకున్న ప్రాంతం కలింగదేశం

3)మహానది నుంచి అరకాన్ (బర్మా) వరకున్నది ఆంధ్రదే శం

ఈమూడింటిని కలిపితే "మహా తెలంగాణా" అవుతుంది. తెలు గుదేశానికి రాజధాని శ్రీకాకుళం (కృష్ణజిల్లా) కలింగ రాజధాని కళింగపట్నం (విశాఖ పట్నం జిల్లా). ఆంధ్ర రాజధాని త్రిపురలోని అగర్తల.

భారతదేశపు తూర్పుతీరాన్ని టాలామీ "కోస్ట్" ఆఫ్ అయిర్ హెూడై (ఆంధ్రతీరం) అని ఆగ్నేసియాలోని ఇండోనేసియా, మలేషియా దీవులను 'ఆంధ్రద్వీపాలని' పేర్కొన్నాడు. ఈ ద్వీపాల్లో దొరికిన మొట్టమొదటి శాస నాలు కూడా వేంగిలిపిలోనే వున్నాయి.

ఆనాటి మహాతెలంగాణా విచ్ఛిన్నమైపోయింది. అస్సాం, బర్మా, నేపాల్, భూటాన్ దేశాలలో 'తెలంగ్లు' ఇప్పటికి వున్నారు.

తెలుగు దేశం వేంగిదే శమని కూడా పిలవబడింది. నన్నయబట్టు వేంగి దే శాని కి రాజమహేంద్రం రాజధాని అని రాశాడు. దీనికి ముందు ఏలూరు సమీపంలో వున్న చినవేగి పెదవేగి అనే గ్రామాలు ఆనాడు వేగిరాజధాని గా ఉండేవి. ఈప్రాంతానికి దగ్గరలో వున్న "కొల్లేటి" సరస్సు ఆకాలం వాటిదే అంటారు.

ఉత్తర భారతం నుంచి వలస వచ్చిన ఆంధ్రులకు పూర్వమే తెలుగు దే శం నాగుల చే పాలించ బడిందనేది స్పష్టం. నాగులభాష తెలుగు. తెలుగు ద్రావిడ భాషాకుటుంబాని కి చెందినది. ఈవిషయాన్ని అనేక మంది భాషాపండి తులు నిర్ధారణచేసిందే. ఉత్తరాదినుండి ఎత్తివచ్చిన ఆంధ్రు.లు నేటి ఆంధ్ర దేశాన్ని రూపొందించారు. కృష్ణా, గోదావరి నదుల మధ్యనున్న ప్రాంతం కేంద్రంగా ఆంధ్రదేశం అని పేరు ప్రథమంగా వాడుకలోకి వచ్చింది.

ఆ రోజులలో వర్ణసాంకర్యం విపరీతంగా వుండేది ఒక యక్షుడు బ్రాహ్మణ కన్యను వివాహమాడగా శాతవాహనుడు జన్మించాడని సాంప్రదాయం ద్వారా తెలుస్తుంది. అలాగే నాగజాతి పురుషునితో బ్రాహ్మణ కన్యకి పుట్టినవాడే గుణాఢ్యుడు. ఇతడు క్రీ॥పూర్వం రెరి ప్రాంతంలో పాలించిన కుంతల శాతకర్ణి ఆస్థానంలో వున్నాడు.

నాగులతో వివాహ సంబంధాలు పెట్టుకోరాదని ఆర్యులు ఆనాడు భయంకరమైన నిషేధం పెట్టినా ఆచరణలో ఆ నిషేధాలు గడ్డిపరకల క్రింద జమకట్టారు. నాగుల ఆదిమ జన్మభూమియైన తెలుగుదేశంలోకి ప్రవేశించిన ఆంధ్రులు తెలుగుభూమిలోని నాగులతో కలసిపోయారని చెప్పవచ్చు.

ఇక్కడ మరో విశేషమేమంటే బ్రాహ్మణుల పౌరోహిత్యం, ఆధ్యాత్మిక వృత్తిద్వారా మాత్రమే పొట్టపోషించుకోవాలని కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యాలను విడనాడి, అహింసాయుతంగా జీవితం గడపాలని ఇదే బ్రాహ్మణుల కుల ధర్మమని చెప్పటం జరిగింది. ప్రజలు నమ్మడం జరిగింది. గాని బ్రాహ్మణులు తమ సొంత కుల ధర్మానికి ఏనాడూ కట్టుబడలేదు. వందలాది సంవత్సరాలపాటు కత్తిపట్టి రాజుల్లా పాలించారు.

శూద్రులు రాజులుగా వున్నచోట బ్రాహ్మలే రాజమంత్రులుగా స్థిరపడేవారు. వీరు ఎప్పుడూ తమ కులధర్మాన్ని నిలుపుకోలేదు. ఈనాటికి కూడా శూలాలు, ఆయుధాలు ధరించి ఆశ్రమాలు వదిలి వీధుల్లోపడి రాజకీయాధికారం కోసం పరుగాని తాపత్రయం పడుతున్నారు. ఆయుధాలు చేబూని 400సం॥ నుండి వున్న బాబ్రిమసీదుని దౌర్జన్యంగా నేలమట్టం చేయడం తాజా వుదాహరణ! సమయం వచ్చినప్పుడల్లా హిందూ ముస్లిం కలహాలు రెచ్చగొట్టి ఆయుధాలు చేబూని రక్తపాతం సృష్టిస్తున్నారు. రాజ్యాధికారం కావాలంటున్నారు. నేడు రాష్ట్రపతిగా, ప్రధానిగా, సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా బ్రాహ్మణులేవున్నా వీరికి యింకా సంతృప్తి కావటంలేదు.

అందుచేతనే డా॥ వారణాసి యశోదాదేవి భారతదేశచరిత్ర-సంస్కృతి ప్రథమ భాగంలో యిలారాశారు. "ఈ యుగంలో బ్రాహ్మణులు క్షత్రియులతో విధ్యలభ్యసించి ప్రభుత్వం నిర్వహించారు. పల్లవులు, శాలంకాయనులు, కదంబులు, బ్రాహ్మణులు చిరకాలంగా క్షత్రియ ధర్మాలు నిర్వహించినందు

వల్ల క్షత్రియులైనారు. మయూరవర్మ సంతతివారు వర్మలైనారు. కొందరు బ్రాహ్మణులు మంత్రి సామంతాది ఉద్యోగాలు నిర్వహించేవారు. దేశంలో పంటపొలాలలో చాలా భాగం అగ్రహారాలుగా, మాన్యాలుగా బ్రాహ్మణులు పొందినారు.

క్రీ॥పూ 187 నుండి క్రీ॥శ॥ 200వరకు తెలుగుదేశాన్ని పాలించిన శుంగులు కణ్వ, శాతవాహనులు, బృహత్పలాయనులు, ఆనంత గోత్రకులు, శాలంకాయనులు విష్ణుకుండితులు, కదంబులు, పల్లవులు, వగైరా అంతా బ్రాహ్మణులే "శుంగ, కణ్వ, శాతవాహన వంశానికి చెందిన బ్రాహ్మణులు ఉత్తరభారతాన్ని దాదాపు 600 ఏళ్ళపాటు పాలించగా మిగిలినవారు మరో ఆరువందల ఏళ్ళపాటు దక్షిణ భారతదేశాన్ని పాలించారు. 1947 నుండి ఈనాటివరకు ఇండియాను పాలించింది ప్రధానంగా బ్రాహ్మణులే, (వి.పి.సింగ్) క్షత్రియుడైన సింగ్‌ను కూలద్రోసే వరకు బ్రాహ్మణులు నిద్రపోలేదు.

దక్షిణాదిన నాగులు అత్యధికులు. వీరు వైదిక విధానాలకు పూర్తిగా వ్యతిరేకులు. దీనితో ఆర్యులెవరూ (అగ్రకులాలు) దక్షిణ భారతదేశం వెళ్ళ రాదని వెళ్ళివచ్చిన వారుంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలని ఆంక్షలు విధించారు. అలాగే నాగులు సముద్ర యానకులు. వీరి దేశ విదేశాలతో వర్తక వ్యాపారాలు సాగేవి. వీరి అభివృద్ధి చూచి ఆర్యులు ఓర్వలేక "సముద్ర యానం చేసిన బ్రాహ్మణులు ప్రాయశ్చిత్తం చేయించుకున్నా స్వర్గలోక ప్రాప్తి పొందలేరని ఆంక్షలు విధించారు. చివరకు ఉత్తరాదిన ముస్లిం దండయాత్రలు ముమ్మరం కావడంతో తాము నియమించుకున్న ఆంక్షలను తామే తుంగలోకి తొక్కి దక్షిణాదికి పరుగులతో వచ్చిపడ్డారు. చివరకు సముద్ర యానం చేయడం తప్పిందికాదు.

దశావతార జాబితాలో చేర్చబడ్డ బ్రాహ్మణుడైన పరశురాముడు తన కుల ధర్మాన్ని వీడి సర్వక్షత్రియులను ఆదివాసులను సర్వనాశనం చేశాడు. గండ్రగొడ్డలిని చేతబూని వీరవిహారం చేశాడు. పసి బిడ్డలతో సహా హత్య చేశాడు. అందుకే అతన్ని బ్రాహ్మణులు అవతార పురుషునిగా చిత్రించారు.

హీనకుల జాతిని ఉన్నత కులాలుగా మార్చటానికి వైదిక పురోహితులు "హిరణ్యగర్భవిధి" అనే ఒక కర్మకాండను కనిపెట్టారు. దీని ప్రకా

రం హీన కులానికి చెందిన రాజుని ఒక బంగారు కుండలో కూర్చోబెట్టి మంత్రాలు చదివేవారు. దీనితో ఆ పాత్రనుండి ఉన్నత కులంవాడు పుట్టుకవచ్చేవాడు. ఈ బంగారు పాత్ర తక్కువ కులం వాడి పాలిట గర్భం లాంటిది. ఈ కర్మకాండవల్ల తక్కువ కులంవాడు ఉన్నత కులం పొందడం, బంగారు పాత్ర బ్రహ్మణులకు దక్కడం జరిగేది. శూద్రుడైన శివాజీ పట్టాభిషేకానికి అర్హుడుకాడని మొదట బ్రాహ్మణులు అడ్డుపడ్డారు. చివరకు యిలాంటి కర్మకాండ ద్వారా పట్టాభిషిక్తుడైనాడు. తూర్పు చాళుక్య వంశానికి చెందిన రాజ రాజనరేంద్రుడు శూద్రరాజు. ఈరాజు పాండవుల ముని మనవడని చంద్రవంశ క్షత్రియుడని మన బ్రహ్మణులచే ప్రచారం చేయబడ్డాడు.

వేశ్యా పుత్రుడైన (శూద్ర) కృష్ణరాయలు సాక్షాత్ విష్ణుమూర్తి అవతారమని మన వైదిక పురోహితులు ఊరూవాడా డబ్బావాయించారు. అలాగే కాకతీయ చక్రవర్తులు, రెడ్డి రాజులు, దక్షిణాత్య ఆంధ్రనాయక రాజులు యిత్యాదులంతా శూద్రులైనా వీరికి బ్రాహ్మణ పూజారి పురోహితవర్గాలు వారిని ఉన్నతులుగా చిత్రించారు. ఈ రాజుల అండతో ఈ బ్రాహ్మణులు సాగించిన ఘోరాలు యిన్నీ అన్నీ కావు. సమస్త దానాలను చేయగల శూద్ర రాజులు వీరు. ఒక్కముక్కలో చెప్పాలంటే బ్రాహ్మణులు తలచుకుంటే పందిని నందిగాను, నందిని పందిగాను మార్చగల సమర్థులయ్యారు.

ఇక బ్రాహ్మణులు సాగించే యజ్ఞాలు, యాగాలు విషయానికొస్తే ఈ ఆధునిక యుగంలో ఎవరూ భరించలేరు. శూద్ర పంచమ కులాలకు చెందిన సామాన్య ప్రజలను నరమేధం పేరుతో యూప స్తంభానికి కట్టి చేసే యజ్ఞమే నరమేధం. యీ యజ్ఞం పేరుతో ఎదురు తిరిగిన దళితులను ఖతంచేసి తమ పబ్బం గడుపుకునేవారు. ఇలా ఎందరో అమాయకులు ఈ నరమేధం వల్ల కౄరంగా హత్యచేయ బడ్డారు. చచ్చిన గుర్రం లింగాన్ని రాజుగారి పట్టపు రాణి యోనిలోకి చొప్పించడమే 'అశ్వమేధం'. యజ్ఞంలో నల్లమేకను బలి యివ్వడమే "వాజపేయం" యజ్ఞంలో అనేక ప్రాణులను బలి యివ్వడమే "రాజసూయం". యజ్ఞం చేసేవాడు వాని భార్య కలిసి పందిరిపై బహిరంగంగా సంభోగించడమే "పౌండరీకం".

ఈలాంటి అమానుషమానమైన, అసహ్యమైన యజ్ఞాలు, యాగాలు పేరిట, దేవుని పేరిట, మతం పేర మానవత్వాన్ని రక్తపుటేరుల్లో ముంచెత్తారు. యజ్ఞ

యాగాదుల పేరిట సాగిన నేరాలు, కిరాతక చర్యలు, లక్షలాది ఘోరాలు చరిత్రలో శిలాక్షరాలుగా నిలిచే వున్నాయి. నేటి అధునిక యుగంలో కూడా అనేక రకాల పేర్లతో యజ్ఞయాగాలుచేసి, ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారు. పాలక పార్టీలు. ఈ దుర్మార్గపు చర్యలకు వత్తాసు యివ్వడం మరీఘోరం.

బి.జె.పి. తదితర మత సంస్థలు ఈనాడు తిరిగి రాముడు జాతీయ నాయకునిగా, భారతజాతి దేవుడుగా చేసే ప్రయత్నంలోను, వారు దీనికై సాగించే దౌర్జన్య హింసా కాండలోనూ ఆర్యులు (బ్రాహ్మణులు) ప్రవేశించిన తొలిరోజులు జ్ఞాపకం చేస్తున్నాయి. యిందులో హిందూ సామ్రాజ్య కాంక్ష విస్తరణ ధోరణి తేటతెల్లంగా కనిపిస్తుంది.

శూద్ర పంచమ కులాలు పూజారి పురోహితులుగా పనికిరాని వీరికి సంస్కృతం తెలియదని మఠాధిపతులు బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. వీరి దేవుళ్ళకు మన మాతృభాషలో ప్రార్థనలు, విన్నపములు అర్థంకాదు కాబోలు. అలాగే దళితులకు భూములు పంచాలని కొన్ని రాష్ట్రప్రభుత్వాలు చట్టాలు చేస్తే అగ్రహారాలుగా మారిన న్యాయస్థానాలు ఈ భూగరిష్ఠ చట్టాలు చెల్లవని తీర్పుయిస్తున్నాయి. అలాగే ప్రభుత్వ ఉద్యోగాల్లో 85%శాతం వున్న దళితులకు రిజర్వేషన్లు 50%శాతం మించకూడదని ఆంక్షలు విధించారు. రిజర్వేషన్ల వ్యతిరేక ఉద్యమాలు సాగించి రక్తపాతాన్ని సృష్టించి ప్రభుత్వాన్నే స్థంభింపజేసారు.

దీనికితోడు కేంద్రంలో తిష్టవేసిన బ్రాహ్మణ బనియా ముఠా వివిధ భాషా జాతులను రాజకీయ, ఆర్థిక తదితర అన్నిరంగాల్లోను అణచివేసి కొల్లగొడుతున్నారు. జాతుల న్యాయమైన ఉద్యమాలను నాశనంచేయ తలపెట్టారు. అనేక రూపాల్లో స్వదేశీ, విదేశీ గుత్త సంస్థలు తోపిడీ చేస్తున్నాయి. నేడు కాంగ్రెస్ అనుసరిస్తున్న ఈ దోపిడీ పాలనకు మరింత వేగంగా, మరింత పాశవికంగాను అమలు చేయడానికి బి.జె.పి. వంటి మత సంస్థలు ఆతృత చెందుతున్నాయి. ఇవన్నీ తమ పాత వ్యవస్థను కొనసాగింపుగానే సాగిస్తున్నారు. గనుక తెలుగుజాతి అనగా నాగజాతి స్వయం నిర్ణయాధికారం సాధించుకోవాలి బి.సి., యస్.సి., యస్.టి., మైనారిటీ స్త్రీ (దళితులు) లు అంతా ఏకమై తెలుగుజాతి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి.

# తెలుగు- ద్రావిడ పదాలు

నన్నయ కాలంలో "తెనుగు" అనేదే వాడుకలో వుండేది. అది క్రమంగా "తెలుగు"గా మారింది. సహజమైన వ్యుత్పత్తి అర్థం యిలాగుంది. తెన్+అగు =తెలుగు 'తెన్' అనగా ద్రావిడ భాషలో దక్షిణమని అర్థం. గనుక తెలుగు అనగా దక్షిణాదులు అని అర్థం. దక్షిణ ముఖంగా సంచరించెడివారు అని అర్థం. ఖండవల్లివారి "ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి" అనే గ్రంథంలో యిలా రాశారు. ద్రావిడ జాతికి చెందిన ఈతెనుగువారు మొట్టమొదట వింధ్యపర్వత పాదములందు నివశించుతూ ఆర్యులైన ఆంధ్రుల వత్తిడిచే యింకనూ దక్షిణమునకు సర్దుకొనవలసిన వారైరి. కావున వీరు దక్షిణాత్యులు లేక తెనగవారు అని వ్యవహరించబడి వుండును. తెనుగు పదం నందుగల 'న' కారం కాలాంతమున 'ల' కారంగామారినట్లు తోచును. 'న' కార 'ల' కారములు రెండునూ దంతోచ్చారణ కలవగుటచే ఆమార్పు సహజంగా వుండును.

ద్రావిడుల గురించి అర్థాలు యిలా వున్నాయి. ఆర్యులు బలవంతులై విజృంభించే కొలది ద్రావిడ జాతివారు భారత ఉపఖండంయొక్క తూర్పు-దక్షిణ ప్రాంతాలకు తరమ బడ్డారు. ద్రావిడులనగా దక్షిణాదికి తరమబడ్డవారని అర్థంకూడా వుంది. వీరి గురించి భారతంలో యిలా చెప్పబడింది. పరశురామునిచేతిలో ఓడిపోయిన క్షత్రియజాతి వారే ద్రావిడులని, వర్ణాశ్రమ ధర్మాలవల్ల వారు మ్లేచ్ఛులుగా మారేరని భారతంలో చెప్పబడింది. ఏ దేశం వర్ణాశ్రమ ధర్మాలను నెలకొల్పదో ఆదేశం మ్లేచ్ఛదేశమని బోధాయనుడు. మనువు మొదలగు బ్రాహ్మణ పండితులు వివరించారు. దీన్నిబట్టి కొన్ని ఆర్యతెగలు ద్రావిడులుగా మారిపోయి వుండవచ్చు.

గనుక దక్షిణ భారతంలో నివశించువారు తెలుగువారని ఆతెలుగువారు ద్రావిడ జాతులలో ఒకరుగా అర్థం చేసుకోవాలి.

వేదకాలంలో నాగులు దక్షులు, యక్షులు' శబరులు, కిరాతులు, అను నాలుగు అనార్య తెగలువున్నాయి. వీరిలో దస్యులు పూర్తిగా ఆర్యుల చేతనాశనం చేయబడ్డారు. శబరులు ఆఫ్టనిస్తాన్, టర్కీ, ఇరాన్, ఇరాక్, రష్యాదేశాలకు పారిపోయారు. కిరాతులు, హిమలయాలు, నేపాల్, బూటాన్, ఇప్పటి అరుణా

చల్రప్రదేశ్, టిబెట్‌లలో అజ్ఞాతవాసాలకు పోయారు. నాగులుమాత్రం నిలువుగా దిగివింధ్యా, ఆరావళి బీహారులలో మాలే కొండలుద క్షిణదిశగాను తూర్పు గానుజరిగి అస్సాం, బర్మా, నాగాలాండ్ మీదుగా తాయిలాండ్, కంబోడియా, ఇండోనేషియాలకూ వ్యాపించారు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే అర్యులు భారత ఖండం లోకి రావడమే అనేక అనర్ధాలకు, అల్లకల్లోలాలకు దారి తీసింది. స్వేచ్ఛగాను, నిర్భయంగాను, జీవిస్తున్న స్థానిక జాతులు కొన్ని తమ ఉనికిని కోల్పోయాయి. కొన్ని చిన్న జాతులు నశించాయి. కొన్ని కలసిపోయాయి. ఏ జాతి ఎక్కడవుందో, ఎక్కడ నుండి వచ్చిందో గందర గోళంగా మారిపోయింది. ఆర్యఆర్యేతర యుద్ధాలు గా ఎన్నోసాగాయి. భారత్ ఉపఖండం మొత్తంగా రక్త-సిక్తంగా మారిపోయింది. ~~ఈనాటికి ఈ~~ ఆర్యవైదిక బ్రాహ్మణ వర్గాలు పాతవ్యవస్థనే కొనసాగించడానికి పడరానిపాట్లు పడుచున్నారు

ఇక్కడ మరో పాతకాలం నాటి అంశం గుర్తుంచు కోవలసిందే. ఏమంటే మగధ రాజులు మొదట నందవంశం వాళ్లు. వాళ్ల శూద్రులు అని యిది వరకే తెలుసుకొన్నాం మౌర్యులు, మురయా, కొండ జాతికి (ఎన్.టి) చెందిన వాళ్లు. వారి తర్వాత వచ్చిన శుంగులు బ్రాహ్మలు, వాళ్ళ కాలం లోనే మనువుయోగ శాస్త్రం, వాస్తు దేవభక్తి పుట్టుకొచ్చాయి. గుప్తులు క్రొత్తగా క్షత్రియ వంశం లోకి చేరిన బ్రాహ్మణులు బ్రాహ్మణక్షేత్రమే పరశు రాముని రూపంలో పురాణ కథ అయింది.

చాణిక్యుడు మనువు కంటే ముందువాడు. ఇతడు గణతంత్ర ప్రజాస్వామ్య రిపబ్లిక్‌లకు వ్యతిరేకంగా రాజరిక వ్యవస్థకు పునాది వేశాడు. తర్వాత వచ్చిన మనువు రాచరిక వ్యవస్థను బ్రాహ్మణ వ్యవస్థగా మార్చారు. శుంగులుగాని, గుప్తులుగాని, హర్షుడుగాని మనువును పూర్తిగా అనుసరించలేదు. 8నుండి18 వశతాబ్దం మధ్య చిన్న చిన్న రాజ్యాలలోనే మను ధర్మశాస్త్రం పూర్తిగా అనుసరించబడింది. అందుచే దీన్ని "చీకటియుగం లేక క్షీణయుగం"అంటారు.

చాణిక్యుని కాలంలో కులాలు,కులవ్యవస్థ స్థిరపడలేదు. రక రకాలవృత్తి ధర్మాలు రాజధర్మం క్రింది కి తీసుకొని రావడమే చాణిక్యుడు చేసినపని. మనువు శ్రమ జీవుల్ని పూర్తిగా అంటురానివారుగా చేశాడు. కులాలను స్థిరీ

కరించాడు. అందుకే ఈనాటికి అగ్రకుల పాలకులు రామాయణం, భారతం, చాణక్య వంటి సినిమాలు తీసి ప్రజలను తప్పుదారి పట్టించి కులవ్యవస్థను కాపాడుతున్నారు.

తెలుగు బ్రాహ్మణుల గురించి మరో భిన్నాభిప్రాయం ఏమంటే "ఇక్కడ తెలుగు వాళ్లలోని బ్రాహ్మణులందరూ ఉత్తరాది నుండి వచ్చిన ఆర్యులు కారు. వారు యిక్కడివారే. ఆర్యమతం పుచ్చుకున్నారు". ఈ వాదన నిర్మలకుమార్ బోస్ రాసిన "అబోరిజిన్స్ ఆఫ్ ఇండియా" (ఇండియాలోస్థానికులు) అనే గ్రంథంలో రాశారు. తెలుగు బ్రాహ్మణులు "ఆస్ట్రలాయిడ్‌కు చెందిన వారని రాశారు. అనగా యిక్కడ తెలుగుజాతికి చెందినవారేనని వీరి వాదన. ఈ వాదంలో కొంత నిజం వున్నప్పటికీ ఆర్య తెగలు మాత్రం యిక్కడకు వలస వచ్చినవే. అలా వచ్చి యిక్కడ వాళ్ళను కూడా బ్రాహ్మణులుగా మార్చడం జరిగింది. అలాగే కోనసీమ బ్రాహ్మణులు ద్రావిడ జాతికి చెందిన వారేనని అంటారు. వీరిలో పంచ ద్రావిడులు వున్నారు. వీరు నెల్లూరునుండి శ్రీకాకుళం వరకు చెదురుగా వున్నారు. కోనసీమలో వీరిప్రాబల్యం ఎక్కువ. కొత్త దాసరికి [illegible]లెక్కువని ఈ కోనసీమ బ్రాహ్మణులు దళితులపట్ల కఠోరంగా వ్యవహరించారు. వీరు మనువును మించిపోయిన వారని చెప్పవచ్చు.

మరో సంగతేమంటే వాయు పురాణంలో ఆంధ్రులనేవారు అక్షనదీ తీరంలో తుషారాజాతితో కలిసి వుండేవారని చెప్పబడింది. అక్షునది అనగా ఆక్సస్ నది. ఇది హిందూకుష్ పర్వతాల ఆవతలుంది. ఆంధ్రులు మధ్య ఆసియా వారై భారతదేశం వచ్చివుంటారని ఖండవిల్లివారు "ఆంధ్రుల చరిత్ర సంస్కృతి" అన్న గ్రంథంలో వివరించారు. ఈ ఆంధ్రుల సమస్య గందరగోళంగా తయారయింది. వీరు ఎవరు? ఎక్కడివారు? అనేది పరస్పర విరుద్ధంగా చెప్పబడింది. దానిపై యింకా పరిశోధనలు జరపడం అవసరం.

ఆర్యులు భారత ఉపఖండం రావడంవల్ల అభివృద్ధి పురోగమనం, ప్రజల సృజనాత్మకశక్తి అరికట్టబడ్డాయి. ఆర్యులు ఈ ఉపఖండం రాకుండా వుంటే ఈనాటి యూరప్ ఖండంలోని దేశాలకంటే ఎన్నోరెట్లు అధికంగా యీ ఉపఖండంలోని జాతుల దేశాలు అభివృద్ధి చెంది వుండేవి. అంతేకాదు.

చైనా, రష్యాదేశాలలో సోషలిజంలో ఏర్పడ్డ బలహీనతలు లేకుండా భరత ఖండం సోషలిజంతో పరిపూర్ణత చెందివుండేది. ఎందుకంటే ప్రపంచం అంతా అధికభాగం అటవికదశలోవున్న కాలంలోనే హరప్పా, మొహంజదారో, తుంగభద్ర వంటి అత్యున్నతస్థాయి నాగరికతలను కల్గివుండేది. దీనినిబట్టి భారత ఉపఖండంలోనిదేశాలుసోషలిజాన్ని ఏనాడోవిజయవంతం చేసివుండేవి. అర్య బ్రాహ్మణమతం మార్పుని అంగీకరించదు, సహించదు, శాస్త్రసాంకేతిక అభివృద్ధి కాలంలో హిందూమతం తిరో గమన పద్ధతులు అనుసరిస్తుంది. కాలానికి అనుగుణంగా యితర మతాలు మారినట్లు హిందూమతం యీనాటికి మారలేదు. ఏనాటిదో ఫ్యూడల్ వ్యవస్థలోని రామరాజ్యం నేటి అధునిక యుగంలో అమలు జరపాలనడం ఇందుకు ఉదహరణ, ఇది ఎంత మాత్రంసమంజసం కాదు.గనుక అర్యులు యిక్కడకు రావడం వల్ల ఎన్నో కష్ట నష్టాలకు గురికావలసి వచ్చింది దీర్ఘకాలం బానిసత్వానికి లోనైన జాతి మానవ స్వభావాన్ని కోల్పోతుంది. మానవుల కుండవలసిన ప్రాథమిక లక్షణాలు లేకుండా పోతాయి. క్రమేణాజడ ప్రాయులుగా మారిపోతారు. దేశదేశాల బానిసల చరిత్రలో యిదే వెల్లడయింది. సరిగ్గా యిక్కడ దళితులకు కూడా యిదే జరిగింది. ఒకప్పుడు నాగులు ఎంత ఎంత గొప్పవారైనా బానిసత్వానికి గురయ్యాక తమ ఉనికిన్ని ప్రత్యేకతను విశిష్టతను, కోల్పోయారు.



# రాజ్యపాలకులుగా నాగులు

తెలుగు భూమిని పాలించిన తొలిపాలకులు ధర్మప్రభువులుగా కీర్తించ బడినవారు నాగులే. ఈ వాస్తవాలను ఆర్య చరిత్రకారులు ఎంత తుడిచి పెట్టినా కొన్ని యదార్థాలు బైటికి రాకతప్పలేదు. ఆర్య చరిత్రకారులు ఈ ఉపఖండ చరిత్రను అయోమయం చేశారు. మతపరం చేశారు. చరిత్రను అయోమయం చేశారు. మతపరం చేశారు. చరిత్రను ఆర్యులు తమ సొంతం చేసుకున్నారు. వేదాలు రాశాక పాతచరిత్రలన్నీ ధ్వంసం చేశారు. ప్రాచీన చరిత్ర లేకుండా పోయింది. దాన్నే చీకటి యుగం అన్నారు. అలెగ్జాండరు దండయాత్ర తర్వాతనే క్రీ॥పూర్వం 300 సం॥ నుండి చరిత్ర పుట్టింది. బానిస కుటుంబానికి చెందిన ఎలక్స్‌హేలీ ఏడు తరాలకు విముక్తి పొందినగాథ. 'రూట్స్' రాసుకున్నట్లే దళితులు తమ చరిత్రను తాము రాసుకోకతప్పదు. తల్లక్రిందులుగా వున్న చరిత్రను నిలదీయాల్సిన అవసరమేర్పడింది.

శ్రీ ఖండవల్లి బాలేందు శేఖర్ రాసిన ఆంధ్రుల చరిత్రలో ఇలారాశారు. 'ఆకాల పట్టణాలలో ధాన్యకటకం నగరం మిక్కలి విఖ్యాతి చెందియుండెను. దీనికి దాన్యవాటి అని పేరు కూడా వాడబడుచుండెను. ఈ పట్టణం కృష్ణా నది తీరమున ప్రస్తుతం గుంటూరు జిల్లాలోనున్నది. ఈ పట్టణం పురాతన కాలంలో నాగరాజులకును తరువాత శాతవాహన వంశీయులకును రాజధానిగా యుండెను. ఆ కాలంలో భారతదేశమందు పాటలీపుత్రం తర్వాత ధాన్యకట కమే మిక్కలి ప్రఖ్యాతి చెందియుండెను".

శాతవాహనుల తర్వాత తెలుగుదేశాన్ని పాలించిన ఇక్ష్వాకుల గురించి ఆర్య చరిత్రలు తప్పుగా చిత్రించాయి. వీరు శ్రీరాముని వంశానికి చెందిన "కుసు" మహారాజు వంశానికి చెందిన ఇక్ష్వాకులుగా వర్ణించారు. ఈ శ్రీరా ముని వంశం వారికి నాగులు, బౌద్ధులు బద్ధ విరోధులు. అసలు శ్రీరాముని వంశంవారు వింధ్య పర్వతాలుదాటి యివతలకు వచ్చిన దాఖలాలులేవు. తెలుగుదేశాన్ని పాలించిన ఇక్ష్వాకులు ముగ్గురు రాజులతో వీరి పాలన ముగి సింది. సూర్యవంశంలో ఇక్ష్వాకవు అనే రాజు వుండేవాడు. అతనికి వంద మంది కొడుకులు. వారిలో పెద్దవాడు "వికుక్షి" ఆయనే ఈ వంశానికి మూల పురుషుడని అంటారు. అంతేగాని శ్రీరామునికి చెందిన ఇక్ష్వాకులు కానేకాదు.

తెలుగుదేశాన్ని ఏలిన మొదటి ఇక్ష్వాకరాజు వాసిష్టీపుత్ర శాంతి మూల మహారాజు (క్రీ॥పూ॥218-200) ఇతను గొప్పవాడనంటారు. ఈ ఇక్ష్వాకులను శ్రీపర్వతీయాంధ్ర వంశమని కూడా అంటారు. వీరి రాజధాని జయపురి. ఇది కృష్ణానదితీరాన్నుంది. దీని సమీపానున్న శ్రీ పర్వతంకొండపై ప్రపంచ ప్రసిద్ధికెక్కిన బౌద్ధారామం వుంది. దీన్ని ఇక్ష్వాకుల కాలంలోనే అభివృద్ధి చేశారు. ఈ చక్రవర్తి వైదిక బౌద్ధమతాలను రెంటిని పెంచి పోషించాడు. అయితే ఇతని కుటుంబీకులు, రాణులు, రాకుమార్తెలు బౌద్ధాన్ని గాఢంగా అభిమానించారు. అభివృద్ధి చేశారు. ఇతని తర్వాత అధికారంలోకి వచ్చిన యితని కుమారుడు శ్రీ వీరపురుష దత్తుడు వైదిక మతాన్ని అణచివేసి బౌద్ధాన్ని అభివృద్ధి చేశాడు. ఇతని చెల్లెలను కుమార్తెలను వైజయంతి ప్రభువులుగానున్న నాగరాజులకిచ్చి వివాహంచేశారు. వీరి కాలంలో శ్రీపర్వతీ సంఘారామం యొక్క పేరు ప్రతిష్ఠలు ప్రపంచమంతా మారుమోగాయి. ఎన్నో బౌద్ధ సంఘారామాలను, చైత్యములను స్తూపములను నిర్మించారు. ఇతని పాలనలో తెలుగుదేశం గొప్పగా వర్ధిల్లిందని అంటారు. ఇతని కుమారుడు బహుబల శాంతిమూలుడు. యితని కాలంలోనే శత్రుదాడులు పెరిగి ఈ వంశపాలన అంతమయ్యింది. ఈ ఇక్ష్వాకులు చాలా పూర్వపు వంశమంటారు.

ఇక్కడ గమనించాల్సింది ఒకటుంది. ఆర్యుల క్రూరత్వానికి అనేకమంది రాజులు భయపడి తాము వైదీకులుగా చెప్పుకునేవారు. ఆదిలో ఇక్ష్వాకపు రాజులు బ్రాహ్మణుల ప్రోత్సాహంతో ఇక్ష్వాకపు వంశం పేరు తగ్గలించుకుని వుంటారు. వీరు శూద్రులై వుండాలి, అందుకే వీరు నాగులతోను బౌద్ధంతోను బాగా సంబందాలు పెంచుకున్నారు.

రాజమహేంద్రవరం, అలాగే వేంగీని రాజధానిగా చేసుకుని పాలించిన చోడరాజులు శూద్రకులానికి చెందిన నాగరాజులే. (క్రీశ 1003-1022) వీరి కాలంలోనే రాజరాజునరేంద్రుడు, నాగుల భాష తెలుగును అభివృద్ధి చేశారు భారతాన్ని తెలుగులో అనువదించమని నన్నయను ఆదేశించారు. చోళుల కాలంలో తెలుగు భాషకుప్రత్యేకలిపిని ఏర్పాటు చేశారు, అందుకే దీన్ని వేంగీ చాళుక్య లిపి అంటారు, చాళుక్యులు సుమారు ఐదు శతాబ్దాల కాలం పాలించారు. చోళులు చాళుక్యులు సమైఖ్యంగా వుండేవారు. రాజరాజు నరేంద్రుడు చోళుల ఆడపడుచును పెండ్లాడాడు.

ఇక్కడ బ్రాహ్మణులలో మార్పు వచ్చిన మరో అంశం ఏమంటే చదువులతోను మంత్రతంత్రాలతోను కాలం గడిపే బ్రాహ్మణులు చాళుక్యుల కాలం నాటికి రాజకీయాలలో ప్రవేశించారు. శూద్రరాజులకు బ్రాహ్మణులు మంత్రులయ్యారు. సేనాధిపతులుగా సిద్ధపడ్డారు. కేవలం చదువులు, పూజాది పురోహిత వృత్తిలో వుండేవారు వైదికులుగాను. రాజకీయాలలో ప్రవేశించవి వారిని యోగులుగాను రెండు వర్గాలుగా విభజన ఏర్పడింది.

క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దాల నాటికి పల్లవరాజుల కాలంలో బ్రాహ్మణులు స్థిరపడ్డారు. శూద్రులకు చెందిన చోళులు అనేక శాఖలుగా విడిపోయి నెల్లూరుచోళులుగాను, వెలనాటిచోళులుగాను, చీలి రాజ్యాలు పాలించారు. నెల్లూరును పాలించిన చోళరాజు మనుమసిద్ధి చాలా ప్రఖ్యాతిగాంచాడు. అతని వద్దనే కవిబ్రహ్మ తిక్కన మంత్రిగావుంటూ భారతన్నికూడా తెలుగులో పరిపూర్తి చేశాడు. అనాటి పలనాటి యుద్ధం శైవ-వైష్ణవ మత యుద్ధమని చెప్పవచ్చు. ఈయుద్ధాన్ని శ్రీనాథమహాకవి వీర కావ్యంగా రచించాడు.

వైష్ణవ మంటే రామానుజాచార్యులచేత తమిళనాడులో స్థాపించబడి తెలుగునాటకు వ్యాపించింది. అలాగే బసవయ్యచేత నెలకొల్పబడ్డ వీరశైవ మతం కర్ణాటకంలో పుట్టి తెలుగుదేశంలో ప్రవేశించింది. ఈ రెండు మతాలు కుల వ్యవస్థను చీల్చిచెండాడాయి. అలాగే కేరళలో పుట్టిన శంకరాచార్యుల అద్వైత మతం యిక్కడకు దిగుమతి అయింది. ఇక్కడ మరో అంశమేమంటే బ్రాహ్మణులు తమ పోషకులను సంతోష పరచుటకు సూర్యచంద్ర వంశపు రాజులుగా ముద్రలు వేయటం పరిపాటయింది. శూద్రులైన చోళులను చంద్ర వంశ రాజులుగా చిత్రించారు.

క్రీ.శ. 12వ శతాబ్దంలోనే క్రొత్తమతాలు తెలుగునాట ప్రవేశించాయి. ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత మతాలు జైన బౌద్ధ మతాలను నాశనంచేయ సమకట్టాయి. అప్పటికే నాగరాజులు క్షీణదశకు చేరి ఓటమికి గురికావడం, బౌద్ధంలో మంత్ర తంత్రాలతో కూడిన వజ్రయానం అమల్లోకి రావడం జరిగింది. దీనికితోడు ప్రాబల్యంలోవున్న వైదికమత ఘాతుక చర్యల కారణంగా బౌద్ధ, జైన మతాలు 12వ శతాబ్దంలో క్షీణదశకు వచ్చాయి.

ఆర్య బ్రాహ్మణులు తమ ఉనికిని కాపాడుకోవడానికి ఎన్ని అవతారాలైనా ఎత్తగలరు. దీనికి నిదర్శనం వీరు 8-12 శతాబ్దాల మధ్య సృష్టించిన

పురాణాలే సాక్ష్యం. అప్పటికే బౌద్ధ తాంత్రికవాదం ప్రచారంలో వుందికాబట్టి బ్రాహ్మణ పురాణాల్లో కూడా పంచమకారాలున్నాయి. (మద్యం, మాంసం, మైథునం, ముద్ర, మండలం) వీరి రాతల్లో బ్రాహ్మణుడు దేవుడుకన్నా గొప్ప వాడుగా చిత్రించుకున్నారు. బ్రాహ్మణుల రాతల్లో నిజాయితీలేదు. ఉదాహరణకు తెలుగు రామాయణంలో రామునికి మూడువందల మంది భార్యలు ఉంపుడుకత్తెలున్నారని రాయడం జరిగింది. అలాగే రాముడు గోమాంసం తిన్నాడని వుంది. అప్పుడది గొప్పే. తెలుగునాట నాగుల, బౌద్ధుల ప్రభావంవల్ల వాటికి విలువ మారింది. ఆయా ప్రాంతాలనుబట్టి రాతలురాశారు. అంతేగాని నిజాలతో నిమిత్తంలేదు.

నాగులను నాశనం చేయడానికి ఆర్యులు ఎన్నో కుట్రలు కుయుక్తులు పన్నారు. అందులో భాగమే రుద్రులను తమలో కలుపుకోవడం. రుద్రులు 11తెగలకు చెందినవాళ్ళు. వీరు ఆదిమవాసులు. ఇక్కడ పుట్టిపెరిగిన స్వదేశీయులు, వీరి నాయకులు 11మందిని అనేక మాయోపాయాలచే ఆర్యులు తమకు అనుకూలంగా మార్చివేశారు. వీరిని నాగులకు వ్యతిరేకంగా తయారుచేశారు. రుద్రులంటే కౄరులని అర్థం. వీరు నాగులకు ద్రోహంచేసి బ్రాహ్మణులకు తొత్తులై స్వదేశీయులైన జాతుల వినాశానికి తోడ్పడిన దళారులు, అలాగే 'అస్సకులు' గణతంత్ర వ్యవస్థలోని వాళ్ళు, వీళ్ళకు బ్రాహ్మణ మతం యిప్పించి శాతవాహనులై ఏక బ్రాహ్మణ బిరుదు పొందేటట్లుచేశారు. అనేక మందిని నయానా భయనా నాగబ్రాహ్మణులుగా మార్చారు - అందుకే బ్రాహ్మణులలో నల్లనివర్గంవారు పుట్టుకొచ్చారు.

ఎంతసేపూ బ్రాహ్మణులు కానివారికి, బ్రాహ్మణులను అనుసరించిన వాళ్ళకు రాజ్యాధికారం లేకుండా చేయడమే పనిగా పెట్టుకున్నారు.

వ్యవసాయ అభివృద్ధి కోసం బ్రాహ్మణులు పంచాంగం సృష్టించారు. శాస్త్ర-సాంకేతిక అభివృద్ధిలేని ఆ రోజుల్లో రాజులకు రైతులకు పంచాంగమే ఆధారమయింది. దీనితో రాజ్యపాలకులు బ్రాహ్మణుల మీద ఆధారపడాల్సి వచ్చేది. ఉదహారణకు కాకతీయుల పాలనలో పాట్నా (బీహారు) ప్రాంతం నుండి ఒకేసారి 14,000 మంది ఆర్య బ్రాహ్మణులను పంచాంగం నిమిత్తం స్థిర వ్యవసాయం కోసం తెలుగుదేశానికి రప్పించడం జరిగింది. వీరు ఏకులై వచ్చి మేకులైనాటుకున్నారు. వ్యవసాయ నిమిత్తం తయారు చేసిన పంచాంగాన్ని తమ స్వార్థంకోసం మనుష్యులకు కూడా వర్తింపచేశారు. తరువాత జరి

గిన అనేక రాచరిక పాలనల్లో చొచ్చుకుపోయి తెలుగువాట బ్రాహ్మణిజాన్ని వ్యాపింపచేశారు.

శ్రీ డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు రాసిన "యధార్థ భారతి"లో యిలా రాశారు. "పొట్టచేత పట్టుకుని వచ్చిన ఆర్యులు మనదేశంపైకి దండయాత్ర సల్పకమున్న యిక్కడ నివశించుచున్న ఆదిమవాసులను ద్రావిడలనియు, దస్యులనియు, రాక్షసులనియు, వానరులనియు వారి వాఙ్మయం ఘోషించుచున్నది".

పై గ్రంథంలో యింకా యిలా రాశారు. "ఆది ద్రావిడ సంఘంవారే మన హరిజన సంఘాలు హరిజనులు ప్రసిద్ధులగు ఆది ద్రావిడ సంతతి వారైనట్లు సుప్రసిద్ధ చారిత్రిక పరిశోధకులచే విచారణ చేయబడింది. మాలమాదిగలు గురించి మన పూర్వగాధలు దీనినే రుజువుచేస్తున్నాయి" ఆది ద్రావిడులు అనగా నాగులని యిక్కడ వేరే చెప్పనవసరం లేదు. ఆర్యులు క్రూరమైన అణచివేతతో నిర్బంధ వర్ణవ్యవస్థను ప్రవేశపెట్టారు. దీనికితోడు క్రియాశూన్యమగు శుష్క యాంత్రిక వాఙ్మయం సృష్టించి కుప్పలుగా కుప్పరించిన ఫలితంగా కుల వ్యవస్థ నేటికి చెక్కు చెదరకుండా వుంది. గనుక దీనికి భిన్నమైన సాహిత్యాన్ని మనం సృష్టించుకోవాల్సివుంది.



# నాగుల ఓటమి

సింధులోయ, తుంగభద్ర, నాగరికతల్లో వ్యవసాయ అభివృద్ధి తీర్చిదిద్దిన పట్టణాల నిర్మాణము, అద్భుతమైన గృహనిర్మాణం, గణతంత్ర వ్యవస్థ వర్తకవ్యాపారాలు వగైరా ప్రగతిశీలమైన సుసంపన్నమైన దేశంగా తీర్చిదిద్దారు. యిది వివిధ దేశాలకు చెందిన అనేక తెగలు, జాతులు చివరకు కొన్ని రాజ్యాలు యీ దేశంపై దండెత్తడానికి కారణమైనది. చివరకు ఆర్యుల చేత నాగులు ఓడించబడ్డారు.

దక్షిణా పథం ఆర్యుల వశమైనాక నాగులు బర్మా, తాయిలాండ్ మలయా, ఫిజీ, ఆస్ట్రేలియాల మీదుగా దక్షిణ అమెరికాకు వలస పోయారు. నాగులు వివిధ దేశాలలో వివిధ పేరుతో పిలువబడుచున్నారు. కంబోడియాలో 'ఖేర్మ్' లని బలిద్వీపంలో "బాలికులని" ఫిజీద్వీపంలో "పాస్తు" లని, ఆస్ట్రేలియాలో, అంతరైలని, దక్షిణ అమెరికాలో ఇంకాలగిలని, మెక్సికన్‌లో 'మాయా'లనిపిలువబడుతున్నారు. వీరంతా మనకుచెందిన జాతివారే.

ఇటలీలోని "అంద్రియా" పట్టణం క్రీ॥శ; 6–9 శతాబ్దాలలో యిక్కడ నుండి వలసపోయిన నాగులు అద్భుతంగా నిర్మించినట్లు కొలంబియా యూనివర్సిటీవారు 1978–1979లలో ప్రచురించిన మ్యా ఇలస్ట్రేటెడ్ కొలంబియా ఎన్ సైక్లోపీడియాలో రాశారు. ఈగ్రంథాలలో నాగుల గురించి గొప్పగారాశారు. అలాగే ప్రపంచంలోని యితర యూనివర్సిటీలు కొన్ని నాగుల గురించి వారి ప్రత్యేకత, విశిష్ఠత గురించి రాసినట్లు తెలుస్తుంది. మనయూనివర్సిటీలు మాత్రం మూగనోము పట్టాయి. దీనికి కారణం యివి బ్రాహ్మణీయం కావడామే.

మన పూర్వీకుల రాజ్యాలను బ్రాహ్మణులు ఏవిధంగా కూలగొట్టారో వేనుని, నిషాదుని చరిత్రలే సాక్ష్యంగా నిలిచి వున్నాయి.

యుద్ధాలలో ఓడిపోయిన నాగులు తదితర స్వదేశీ జాతులపై ధర్మశాస్త్రాల పేరుతో క్రూరమైన దండనీతిని ప్రయోగించారు. అంతేకాదు ఈ దండనీతి శాస్త్రాలు సాక్షాత్తు బ్రహ్మదేవుని నుండే పుట్టాయని అబద్ధాలతో వంచన చేశారు. ఈ దండ నీతిని బ్రహ్మ నూరువేల అధ్యాయాల గ్రంథంగా రచించాడని, దీన్ని చదవడానికి మానవుని అయుః ప్రమాణం చాలదని మునులు దీనిని కుదించి రాశారట. ఇలా రాయడంలో చాలమంది దేవతల (బ్రాహ్మ

ణులు) పాత్ర వుందట. బృహస్పతి యీ దండనీతిని మూడువేల అధ్యాయాలకు కుదించి రాసాడట. శుక్రుడు దీన్ని వెయ్యి అధ్యాయాలుగా మార్చాడట. చివరకిది మను ధర్మశాస్త్రంగా రూపొందింది. మరో విడ్డూరమేమంటే ఈ ద్వంధ నీతిని అమలు జరపడానికి ప్రచారం చేయడానికి విష్ణుమూర్తి కొందరు రాజులను సృష్టించాడట. వారిలో కొందరు దీన్ని అమలు జరపడానికి అంగీకరించలేదట. కొందరు మాత్రమే అమలు జరిపారట. చివరకు యీ ద్వంధనీతిని పురాణాల పేర, ఇతిహాసాల (భారత రామాయణాలు) ద్వారా తీవ్రంగా ప్రచారం చేసారు. ప్రజల్లో భీతిని సృష్టించారు. ఓడిపోయిన జాతులు తలెత్తకుండా ఈ దండ నీతిని క్రూరంగా అమలు జరిపారు. యిదే నేటి దళితుల దుస్థితికి కారణ మయింది.

ఓడిపోయిన నాగులు తదితర ఉపజాతులను ఆర్య బ్రాహ్మణులు నీచమైన, అవమానకరమైన పేర్లతో పిలిచేవారని యిదివరకే చూచాం. అందులో నిషాదులు ఒకరు. నిషాదులు అత్యంత ప్రాచీనజాతి. నిషాదులలో ఒక తెగ నేటికి యానాదుల పేరుతో వున్నారు. యానాదులు నేటికి అనాదులగానే వున్నారు. ఈ నిషాదనామం ఆర్యులు కల్పించిందే. అనగా రాత్రిపూట తిరిగే వారని అర్థం. కనబడ్డ నాగులనల్లా హతమార్చడంవల్ల గత్యంతరంలేక రాత్రులు సంచరించే దుస్థితి ఏర్పడింది. దానితో వీరికి నిషాదులని పేరుపెట్టారు. నిషాదుల గురించి పురాణాల్లోను, ఇతిహాసాల్లోను రకరకాలుగా చిత్రించారు. ఇవి పరస్పర విరుద్ధంగా వున్నాయి. మను (ఆ) ధర్మశాస్త్రం (దండనీతి) ప్రధానంగా నిషాదులపైనే ప్రయోగించారు. ఆర్య బ్రాహ్మణులు సృష్టించిన ఈ అధర్మ శాస్త్రాలు అస్త్రాలకన్నా అమోఘంగా పనిచేసాయి.

నిషాదుడనేరాజు, 'నిషాద' అనే దేశం వున్నట్లు వారి గ్రంథాల్లో రాసుకున్నారు. నిషాదుడు వేనుని తొడనుండి పుట్టినట్లు కాకమ్మకథలల్లారు. వేనుని హత్య తర్వాత రాజ్యానికి రావలసిన నిషాదుని బ్రాహ్మణుల కుట్ర ఫలితంగా అడవులకు తరిమివేయడం జరిగింది. నిషాదుడుకూడా వేనునిలాగే బ్రాహ్మణుల యజ్ఞయాగాలను, హింసను, దండనీతిని వ్యతిరేకించాడు.

వేనుడు ద్రావిడ జాతులకు చెందినరాజు. ఇతనిని బ్రాహ్మణులు రాసిన పురాణాలలో క్రూరుడుగా చిత్రించి ప్రచారం చేసారు. దీనినే సనాతన చాందస రతయిత విశ్వనాథ సత్యనారాయణ 'వేనరాజు' అనే నాటకం రాశాడు.

ఆ నాటకంలో వేనుని కౄరంగా చిత్రించారు. ఇదే ఇతివృత్తాన్ని త్రిపురనేని రామస్వామి "ఖూని" అనే నాటకంరాశారు. యిందులో వేనుని మహా మానవతావాదిగా ఉత్తమునిగా వర్ణించారు. ఈ రూపంలోనే హేతువాది ప్రముఖ జర్నలిస్టు నార్ల వెంకటేశ్వరావుగారు కూడా రచన చేశారనేది తెలిసిందే.

నిజం చెప్పాలంటే వేనుని కౄరత్వమేమీలేదు. యజ్ఞయాగాదుల పేరుతో సాగే హింసను వేనరాజు వ్యతిరేకించాడు. బ్రాహ్మణులకు దానాలు చేయడానికి నిరాకరించాడు. హింస వద్దన్నాడు. ప్రజాపక్షంగా పాలన సాగించాడు. దీనితో బ్రాహ్మణుల ఆదాయం పడిపోయింది. పరాన్నభుక్కులైన బ్రాహ్మల ప్రాముఖ్యం తగ్గింది. దీనితో వేన రాజుపై కక్షబూనారు. యజ్ఞయాగాలు కర్మకాండలు జరపకపోతే జగత్తుకు ముప్పు వస్తుందని. దేవతలకు కోపం వస్తుందని ప్రజలలో విష ప్రచారం సాగించారు. మానవులు సమర్పించే దానాలు మీద, యజ్ఞయాగాలు హింస మీద దేవతలు ఆధారపడి జీవిస్తున్నట్లుంది. ఇక దేవతల గొప్పదేనికి? దీన్నిబట్టి బ్రాహ్మలు పొట్టకూటికోసం చేసిన పనికిమాలిన ప్రచారం తప్పమరేమీలేదు. రాజు దైవాంశ సంభూతుడని రాజు చెప్పిందే వేదమని ప్రచారం చేసిన బ్రాహ్మణులే "వేనుని" నాస్తికునిగా కౄరునిగా చిత్రించి కుట్రలుపన్ని హత్య చేయించారు. వేన మహారాజు ధర్మపాలన బ్రాహ్మలకు నచ్చలేదు. యీ కారణంగానే మహాభారతంలో వేనుని దుర్మార్గుడుగా వర్ణించారు. బ్రాహ్మలు సాగించే దోపిడిని, హింసను దేవుని పేర, మతం, పేర సమర్థించుకున్నారు.

అలాగే రామాయణంలో కూడా యజ్ఞయాగాల సంరక్షణ పేరుతోను, మునుల రక్షణ పేరుతోను ద్రావిడ జాతులను రాక్షసులుగా చిత్రించి రామ లక్ష్మణులచేత హతమార్చారు. నిజానికి రామలక్ష్మణులు చంపింది రాక్షసులను కాదు. హింసను, యజ్ఞయాగాలను వ్యతిరేకించిన తాటకి, మారీచు, సుబాహులను కౄరంగా హత్య చేశారు. శూర్పణఖను ముక్కు చెవులు కోసిఅవమాన పర్చారు. అడవిలో తపమాచరిస్తున్న శూద్రుడైన శంభునికి బ్రాహ్మణుల ప్రోత్సాహంతో రాముడు నిష్కారణంగా హత్యచేశాడు. నిజానికి రామలక్ష్మణులే రాక్షసులుగా ప్రవర్తించారు.

ఆదిలో బ్రాహ్మణులే తమను దేవతలుగా చిత్రించు కున్నారు. తరువాతి కాలంలో దేవలోకం (స్వర్గలోకం) పైన వున్నదని ప్రచారం చేయ

సాగారు. దేవలోకమంటూ వేరేలేదు. అనాటి దేవలోకం (స్వర్గలోకం) ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్‌లే. ఇవే ఇంద్రుని రాజ్యం. నహుషుడు అనే నాగరాజు ఇంద్రుణ్ణి తన్ని తరిమి ఈదేవలోకాన్ని వశపర్చుకున్నాడు. తరువాతి కాలంలో బ్రాహ్మణులంతా కుమ్మక్కైపోయి తమరాజ్యాన్ని పొందడానికి పడరానిపాట్లు పడ్డారు నరకమని స్వర్గమని లేనివి కల్పించి అబద్ధాలు ప్రచారంచేసి, ప్రజలకు భీతి కల్గించి తమ పబ్బం గడుపుకున్నారు. ఈరకంగా అనాడున్న 26 దేశీయ ద్రావిడ తెగలను నయవంచన చేసి ఓడించారు. నాటికి నేటికి బ్రాహ్మణులధోరణిలో చెప్పుకోదగ్గ మార్పు రాకపోవడం ఆశ్చర్యంగానే వుంది. ఏరూపంలో తమ అధిపత్యాన్ని నిలుపుకోవడమే తమ లక్ష్యంగా పెట్టుకున్నారు.



# కళింగులు నాగులే !

కళింగులంటే మనమేనోయ్ !

తెలుంగులంటే మనమేనోయ్ !

ఈ పాట ఒకప్పుడు తెలుగునాట మారుమోగింది. చరిత్రలు చాలా వంకు శిలా, తామ్ర శాసనాల మీద ఆధారపడి రాయడం జరిగింది. వీటిలో కొన్ని అతిశయోక్తులతోను కొన్ని పరస్పర విరుద్ధంగా వున్నాయి. అయినా చరిత్రకారులు చర్చలు జరిపి సమన్వయంచేసి చరిత్రలు కొన్ని సృష్టించారు. ఆర్య బ్రాహ్మణులు వచ్చాక రాసిన వ్రాయించిన శాసనాలే అధికం. వీరు కేవలం తమ కులప్రత్యేకతనే అతిశయోక్తులతో నింపారు. ఉదాహరణకు కొన్ని శాసనాలు యిలాగున్నాయి. "త్రికలింగాధిపతులనియు, కొనలేంద్రులనియు, చంద్రవంశీయులనియు, బ్రాహ్మణాగ్రహార దాతలనియు, పరమేశ్వరులనియు, శాసనాలు రాశారు. 'ప్రతి రాజుని చంద్రవంశమనో, సూర్యవంశమనో బిరుదులు తగిలించడం తమకు దానాలిచ్చిన రాజులను పరమేశ్వరులుగా పొగడటం బ్రాహ్మణులకు పరిపాటయింది. గనుక ఈ శాసనాల మీద ఆధారపడటంవల్ల అసలు నాగుల ఆదిమ చరిత్ర లేకుండా పోయింది. బ్రాహ్మణ రాతలన్ని ఏకపక్షంగానే రాయడం జరిగింది. యీ విషయం ఇంతకు ముందు చదివిందే !

కళింగ నాగుల చరిత్ర పూర్తిగా మరుగుపర్చారు. అక్కడక్కడ పొడి మాటలతో మాత్రమే వ్యక్తం చేశారు. యిది కావాలని చేసిన పనే.

చాతుర్వర్ణ వ్యవస్థగల తమ నివాసమే పవిత్రమన తక్కిన అంగ, వంగ కళింగాది దేశములు అపవిత్రములని ఆర్యులు నీచమైన అభిప్రాయం కలిగి వున్నారు దీనినే ఆర్యులు తమ గ్రంథాలలో పలుచోట్ల వర్ణించి రాసుకున్నారు. వైతరణి నది మొదలు వ్యాపించి వున్న అరణ్యప్రదేశం కాళింగమని భారతంలో వుంది.

బోదాయనుడు తెలుగు వాడేనని అంటారు. ఆర్యమతం పుచ్చుకున్న వాడై వుంటాడు "కొత్తదాసరికి నామాలెక్కువని" ఆర్య బ్రాహ్మణమతం స్వీకరించిన బోదాయనుడు తాను రాసిన శాస్త్రలు అతిశయోక్తులతో నింపాడు.

ఈ అధర్మ శాస్త్రాలన్నీ బ్రాహ్మణులే యితనిచేత అమానుషంగా రాయించి వుంటారు. బోదాయనుడు యిలా శాపించాడు. కళింగ దేశమునకు నడచి వెళ్లినవాడు పాపం చేసినవాడవుతాడు. అట్టివాడు వైశ్యాపర ఇషిచేసుకుని శుద్ధి పొందవలేను ఈలాంటి పనికి మాలిన స్మృతులు రాసిన బోదాయనుని ఈ నాటికి అగ్రకులాలు మత పార్టీల నాయకులు పొగుడుతూనే వున్నారు.

బోదాయనుని బోధలను. బట్టి చుస్తే ఆనాటికీ కళింగదేశం ఆర్యులకు బద్ధ శతృవులైన నాగ తదితర నాగ ఉప జాతుల పాలన క్రింద వున్నట్లు అర్థం కాగలదు. అందుకే ఆర్యులు వారు గ్రాంథాల్లో యిలా చెప్పారు. అంగ కళింగేషు అను శ్లోకంను బట్టి కళింగ రాజ్యాధి పతులు "పతితులు"గాను "మ్లేచులు" గాను వర్ణించి ప్రచారం చేశారు. గనుక అసలు కళింగ దేశమనేది ఎక్కడుంది? ఏలామారింది? అనేది చూద్దాం.

కళింగం మూడు భాగాలుగా చేప్పబడింది. ఉద్కలింగమే ఉద్కళంగాను తలకలింగమే (క్రిందిభాగము) తెలుంగుగాను, కొందరి అభిప్రాయం మధ్య కళింగాన్నే కళింగం గాను మరి కొందరు భావిస్తున్నారు. ఈమూడు భాగాల లోను ఉత్కలింగము యొక్క రాజధాని బోజ్‌పూర్‌ను, మధ్య కలింగం యొక్క రాజధాని గంజాం జిల్లాలోని సముద్ర తీరమున నున్న కళింగపట్నంగాను, తల కలింగం యొక్క రాజధాని రాజ మహేంద్రవరం గాను వుండేను. అయితే వివిధ రాజుల పాలనలో వివిధ రూపాలలో సరిహద్దులు మార్పులు, చేర్పులు జరిగినట్లు అర్థమవుతుంది.

గంగానదికి పడమట భాగము అనగా గంగానదికి ఉపనదిగా నున్న రూపనారాయణ నుండి కాళింగం ప్రారంభమవుతుంది. రూపనారాయణ నది ముఖద్వారముననే పూర్వపు ఓడరేవు తామరపర్తి గలదు. దీనినే ప్రస్తుతము తమళాక్ అంటున్నారు. దీనికి దక్షిణమున ఉత్కళమువ్నది. ఇంకను దక్షిణంగా కళింగమున్నది. ఈ నది నుండి గోదావరి వరకు వ్యాపించియున్న దేశమే కళింగమని చరిత్ర చెప్పుతుంది. సముద్రంనుండి ఇంద్రావతి గోదావరిలో సంగమించు వరకు బార్డ్వా పట్టణం దగ్గర యిది గందులోకలియువరకు యీరాజ్య మున్నది. కళింగకు ఉత్తర సరిహద్దు చిలకా సరస్సు దక్షిణ సరిహద్దు కొల్లేరు సరస్సు (పశ్చిమ గోదావరి జిల్లా.) వున్నాయి.

పురాణగాథలుకూడా కొన్ని చూద్దాం. బలిచక్రవర్తి నాగజాతికి చెందినవాడు న్యాయపాలన సాగించిన గొప్ప ధర్మమూర్తి, ధర్మతాతగా ప్రఖ్యాతి చెందిన బలిచక్రవర్తిని హతమార్చేవరకు ఆర్య బ్రాహ్మణులు నిద్రపోలేదు. వామనుడనే బ్రాహ్మణునిచేత అనేక మాయోపాయాలచే బలిని బలిగొన్నారు. బలిచక్రవర్తి భార్య సుషేణ రాణీకి కల్గిన సంతానమే కళింగ రాజ్యవంశంగా కూడా చెప్పబడింది. బలిచక్రవర్తి దంపతులకు జన్మించిన అయిదుగురు పుత్రులు అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మ అనే అయిదు రాజ్యాలు స్థాపించినట్లు చెప్పబడింది. వీటిలో అంగ అను దేశము గంగాతీరముననున్న భాగల్‌పూర్ (ప్రాచీన చంప) దానిచుట్టూనున్న ప్రదేశమే వంగదేశం, గాంగానదె కిరుప్రక్కల నున్న ప్రదేశమై వుండును. ఈరాజ్యంలోని ఎక్కువ భాగము నదికి తూర్పున వ్యాపించి యున్నది. పడమట భాగములో కళింగ దేశమున్నది. బెంగాల్ పుండ్ర దేశం అనగా కోసల దేశమునకు గంగానదికి ఉత్తరంనున్న సుహమ ఎక్కడ వుందో అర్థం కావటంలేదు. గంగానదికి దక్షిణ భాగం నుండి మగద రాజ్యం తూర్పు భాగమున్న దేశం కావచ్చునని కొందరి చరిత్రకారుల అభిప్రాయం.

భారతంలో కూడా కళింగులు గురించి చెప్పబడింది. అర్జునుడు నాగ కన్యలను వివాహమాడినట్లే కళింగ రాజైన చిత్రాంగదుని కుమార్తెను దుర్యోధనుడు వివాహమాడినట్లు మహాభారతం శాంతిపర్వంలో వుంది.

చాణుక్యుని అర్థశాస్త్రంలో కళింగను గూర్చి పలుమారులు చెప్పబడింది నూలు బట్టకు తమిళంలో "కాళింగ"అంటూరు. ఇప్పటికి సన్నబట్టలకు కళింగ పెట్టింది పేరు. ఈ సన్నబట్టలు యిక్కడ నుండి దేశ విదేశములకు ఎగుమతి అయ్యేవని చెపుతారు. ఇప్పటికి సన్నబట్టలకు కళింగ ప్రసిద్ధి చెందింది. ఈ కళింగ శబ్దం నూలు బట్టలనుబట్టి కళింగ దేశానికి పేరుపెట్టారో లేక కళింగ దేశాన్నిబట్టి నూలుకు ఈ పేరు వచ్చిందో అర్థం కావడంలేదు.

ఆనాడు దృతరాష్ణునకు సమకాలికుడగు కళింగరాజు సత్త బహు వున్నట్లు గోవింద సూత్రాలలో వుంది. ఈ సత్తబాహు నాగరాజు అయివుంటారు.

బౌద్ధ వాజ్మయంలో దంతపురం రాజధానిగా గల్గిన దేశం కళింగ దేశమని రాయబడింది.

మొన్నటి వరకు రాజధానిగానున్న ముఖలింగమే కళింగ పట్నం అని చెప్పవచ్చు. కళింగ నగరం అను శబ్దం పేరుగాక కళింగ దేశరాజధానిగా అర్థంకావచ్చు. యాగదరణ సింహపురం, కపిలపురం యివన్నీ రాజధానులే. చైనా యాత్రికురు హ్యూనత్సాంగ్ దంతపురం కాళింగ నగరమై వుందని తేల్చి చెప్పారు. ఆ కళింగ నగరమే ముఖలింగమైనట్లు కొన్ని శిలాశాసనాలు ద్వారా తెలుస్తుంది. మహాకవి కాళిదాసు కూడా కళింగ నగరం సముద్ర తీర మునున్నదని వర్ణించారు. కురుక్షేత్ర యుద్ధంలో కాళింగులు కౌరవుల పక్షం వహించినట్లు భారతంలో వుంది.

మరింత స్పష్టంగా చెప్పాలంటే మహానది గోదావరి నదుల మధ్య దేశం కళింగం, గంగానది మహనదుల మధ్య భాగము ఉత్కళమని చెప్పవచ్చు. ఉద్కళపశ్చిమ భాగమున ఓఢ్రాలు అనే జాతివారు వుండేవారు. వీరుకూడా నాగజాతిలో ఉపజాతి. వీరికూడా. పతీతులుగాను, అనాగరికులుగాను, వైదిక సాహిత్యం వర్ణించింది. కొన్యోధ, ఓఢ్ర, ఉత్కళ దేశములు కలసి ప్రస్తుతం ఒరిస్సా రాష్ట్రంగా ఏర్పడింది. కొన్యోధ చిలకా సరస్సు ప్రాంతంలో వుండేది. గతంలో ఓఢ్రులు నివశించే దేశము గనుక ఓఢ్రదేశమని పిలువబడేది. ఇంగ్లీషు వాళ్ల పాలనలో ఈఓఢ్రదేశాన్ని ఒరిస్సాగా పిలువడం వాడుకలోకి వచ్చినది. ఆనాటి ఆర్యులు దీనిని ఉత్కళ రాష్ట్రమన్నారు.

ఇపుడు సింహభూమి అని పిలువబడే మండలం పూర్వం "హరిభంగ" మని పిలువబడేది. అందు నివశించువారిని "భూమియా" లేక "భూయా" అను వారే ఆనాటి ఆదిమవాసులు. భూమియా పదానికి భూమికలవారని అర్థం. సింహవంశ క్షత్రియులు భూమియాల రాజ్యాలను జయించి భూమియులను సర్వనాశనం చేశారు. ఆప్రదేశాన్ని సింహభూమిగా మార్చారు. హత మార్చాగా మిగిలినవారు అడవులకు తరలిపోయారు. అప్పటి భూమియాల కష్టపరిస్థితులు వర్ణించ నలవి కాదు.

పైన పేర్కొన్న ఓఢ్రులు భూమియాలే గాక కోలో, ఖారియా, పురాణో, కోందో, లేక కోదు, కోయ, గోండా, ఘాసియా, కొండరా, కెవుటో, జాలరి, కొదోళా, షరియా, చేమారో, డొమొ, పాణో, (పేంద్ర;) చేరి, బాఖుడి, సవర, జగతా నాగ మొదలగు జాతులు, తెగలు కళింగ, ఓఢ్రదేశపు భూభాగంలో విస్తరించియున్నారు. వీరు ఆర్య బ్రాహ్మలకు ఆదినుండి వ్యతిరేకులు. ఇప్పటికి వీరు తమ వివాహాది శుభాకార్యములకు బ్రాహ్మణులను పిలువరూ.

ఓఢ్రాలను గురించి మను శాస్త్రంలో పదవ అధ్యాయంలో ఓఢ్రాలు పదవ క్షత్రియులై అనార్యులతో చేరినట్లు చెప్పబడింది. ఆర్యులు ఓఢ్రాలను ఓడించి తాము దురాక్రమణ చేసిన ప్రదేశానికి ఉత్కళం అని పేరుపెట్టారు. పరాజితులైన ఓఢ్రాలను నీచులుగాను అనాగరికులుగాను నిందించారు. ఆర్యులు మధ్యరాష్ట్రం నాక్రమించి తెలుగుదేశం వరకు వ్యాపించారు. తెలుగు-ఓఢ్రం భాషలు కొద్ది తేడాతో ఒకే పోలిక గల్గి వున్నాయి. తెలుగు ఓఢ్రం పర్యాయ పదములుగా వాడబడును. ఆర్యులు మగధ నుండి కళింగకు వచ్చినట్లు కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు రాశారు.

1927 జూన్ 16,17,18 తేదీలలో ముఖలింగంలో జరిగిన ఆంధ్ర దేశాయేతి హాస పరిశోధన మండలి కళింగ వర్ధంతోత్సవ సందర్భంగా రావు బహుదూర్ సర్ అన్నపుపరసరామపాత్రోగారు తన అధ్యక్షోపన్యాసంలోను, శ్రీ విక్రమదేవవర్మగారు తన స్వాగతోపన్యాసంలోను కళింగ దేశం గురించి చక్కగా వివరించారు. దీనికి సంబంధించిన మరికొన్ని వివరాలు రాళ్ళ చింద సుబ్బారావుగారి సంపాదకత్వాన ప్రచురించిన "కళింగ దేశ చరిత్ర" లో చూడవచ్చు.

క్రీస్తుకు పూర్వం పాలించిన గాలగ వంశపు రాజుల కాలంలో కళింగ రాజ్యం త్రికలింగం అనుపేర ఉత్తరమున గంగానది మొదలు దక్షిణంన గోదావరి వరకు విస్తరించి ఉందని కొన్ని శాసనాలు ద్వారా తెలుస్తుంది. అలాగే క్రీస్తుకు పూర్వం 8వ శతాబ్దంలో మగధరాజ్యా నేలిన శిశునాగ, నంద మేరవంశపు రాజులు కళింగను జయించినట్లుంది. వీరి తర్వాత చేదివంశపు రాజు కారవేలుడు క్రీస్తుకు పూర్వం 185వ ప్రాంతంలో కళింగ నేలినట్లుంది. ఈ రాజులంతా నాగజాతికి చెంది తర్వాత కాలంలో శూద్ర కులాలుగా పరిగణించబడ్డాయని అర్థమవుతుంది. అప్పటికే బౌద్ధ జైన మతాలు ప్రభలంగా వుండెను.

# అశోకుని కళింగ యుద్ధం

అశోకుడు సింహాసమధిష్టించిన 12 సం॥రాలకు క్రీస్తుకు పూర్వం 211సం॥న కళింగపై దాడి చేసేను. అప్పటి కళింగ రాజుకు 60వేల కాల్బలము, 1000 అశ్వికదళము, 700 గజములు వుండేవి. ఈ యుద్ధం క్రూరంగా, ఘోరంగా జరిగింది. యిరుపక్షాలకు చెందినవారు ఒక లక్ష మంది సైనికులు మరణించారు. మరెందరో గాయపడ్డారు. అశోకుని దురాక్రమణకు వ్యతిరేకంగా పైచెప్పిన ఆదిమవాసులందరూ ఆయుధాలుపట్టి తిరగబడ్డారు. తిరగబడ్డ ఆదిజాతులను క్రూరంగా అశోకుడు హతమార్చాడు. ఇంత ఘోరకలి ప్రపంచంలోనే 6వదంటారు. ఈ భయంకర హింసాపూరిత యుద్ధం చూచాక అశోకుడు తన దండయాత్రను విరమించుకొని బౌద్ధమతం స్వీకరించినట్లు తెలిసిందే. శిక్షణ పొందిన సైనికులకంటే యీ ఆదిమవాసుల తిరుగుబాటు వారి మాతృదేశాభిమానం చూచి అశోకుడు ఖంగుతిన్నట్లు కొందరు చరిత్రకారులు రాసారు. తుదివరకు ప్రాణాలర్పించి కళింగులు పరాజితులయ్యారు.

అలాగే మహాభారత యుద్ధంలో కూడా కళింగ సైన్యం గజములు గుఱ్ఱంలు చూపిన ధైర్యసహాసాలు, వర్ణించనలవి కాదని భారతంలో చెప్పబడింది.

శ్రీకృష్ణునికి ప్రధాన శత్రువైన జరాసందుడు కృష్ణుడు దాడి చేసినప్పుడల్లా కళింగరాజు జరాసందుని పక్షం వహించి సహకరించెను అలాగే సైంధవుడు ద్రౌపదిని బంగపరిచినప్పుడు కళింగరాజు సైంధవునిపక్షం వహించెను. క్రీస్తుకు పూర్వం 225 ప్రాంతమున మగదనే శివగుప్త వంశీయులు అశోకునిలాగే దక్షిణాదికి విస్తరించారు. కళింగ ఆంధ్ర పల్ల రాజ్యాలను దురాక్రమణ గావించారు. యీ సందర్భంలో అశోకునిలాగే సముద్రగుప్తుడు కళింగ దేశాన్ని దాని రాజధానిని క్రూరంగా ధ్వంసంచేశారు. ఎందరో హతులయ్యారు. అశోకుడు, సముద్రగుప్తుడు వగైరా రాజులు సాగించిన యుద్ధాలు యుద్ధానంతరం బీకరకరువుకాటకాలకు కళింగ ప్రజలెందరో నాశనమయ్యారు.

కళింగులు మాతృభూమిపట్ల అధికమైన భక్తి ప్రేమలున్నవారు. మగధ సామ్రాజ్యానికి పక్కలో బల్లెంగా వుండేవారు. అశోకుడు, పుష్యమిత్ర సముద్రగుప్తుడు వగైరా చక్రవర్తులను దికరించి తమ మాతృభూమిని కాపాడుకుంటూనే వచ్చారు. హర్షవర్ధనుని కాలంలో శశాంకు డనే రాజు క్రింద కళింగ దేశం పాలించబడేది. కారవేలుని కాలం నుండి తెలుగు దేశంతో సంబందాలున్నట్లు ఆనాడు మగధపై జరిగిన దండయాత్రలే విదర్శనం రాజరాజనరేంద్రుని మనుమడు కలింగను ఏలినట్లుంది.

రాజరాజుని కొడుకు గంగయ్య కొండచోళుడు కలింగను జయించి అక్కడ నుండి సముద్ర మార్గాన బర్మాను కూడా జయించినట్లు శాసనాలు చెపుతున్నాయి. క్రీస్తుశకం 1001 లో రాజరాజు చోళుడు తన కూమార్తెను వేంగీ రాజు విమలాదిత్యునికిచ్చి కళింగరాజును జయించిన రాజ్యాలలో కలుపుకున్నాడట. ఆనాది నుండి వస్తున్న యీ బాందవ్యంచే విజయ నగరం సామ్రాట్ శ్రీకృష్ణదేవరాయులు కటకము వరకు జయించి కళింగను తన రాజ్యంలో కలుపుకున్నాడు.

గోదావరి జిల్లా చాలా కాలం 'దండక' మనిపిలువబడేది. గంజాం, విశాఖపట్నం, గోదావరి జిల్లాలు కలసి "మహాకలింగమని" పిలువబడేది. కళింగ, ఉత్కిక, భీమరథి అను మూడు రాజ్యములు అధిపతులు కుంభకపురాధీశ్వరుని (దండక) ఆధిపత్యం క్రింద ఉండిరి. ఈకాళింగకు దలకపురం రాజధానిగా ఏలుబడి సాగించేవారు. ఇప్పటికిని శ్రీకాకుళం రోడ్ రైల్వేస్టేషన్‌కు కొన్ని మైళ్ల దూరంలో దంతవరపు కోట అను పాడుపడిన దుర్గ మొకటివుంది ఆలాగే కుంభ, అను గ్రామం కూడా కలదు.

# కాళింగ ప్రజల స్థితిగతులు

కాలింగ ప్రజల్లో సవరులు, కోదు, కోయ, నాగజాతులు ప్రజలు ప్రధానంగా వున్నారు. వీరిలో సవర లేక శబర నామములు ప్రాచీనకాలం నుండి వాడుకలోనున్నాయి. ప్రపంచ భూగోళ చరిత్ర శాస్త్రజ్ఞుడు టోలమీ క్రీస్తు శకము 75వ ప్రాచీన ప్రపంచ భూగోళమునందు 'సవరై' జాతివారు మహానదికి ఉత్తర భాగమందు నివశిస్తున్నట్లు రాశారు. ఈ అనాది జాతిని, రాక్షసులుగాను, క్రవ్యాదులు గాను వేదాలయందు వర్ణించబడింది. అలాగే పురాణములలో నిషిద్ జాతివారని, మసిబొగ్గువంటి నల్లని శరీరం, తప్పడుముక్కుగల ముఖమును, పొట్టి పొట్టి కాళ్ళు, చేతులు, ఎర్రని కండ్లు గలిగి పర్వత ప్రాంతాలలో నివశిస్తున్నట్లు కౄరంగా వర్ణించారు. వీరు కోదు జాతివలెనే మంగోలియా జాతి వారని వీరి భాష "తురేనియా" భాషకు సంబంధించినదని మాక్స్‌ముల్లర్ రాసియున్నాడు. ఐతిరేయ బ్రాహ్మణము నందు అంగ, శబర, పుండ్ర, పుళింగ, మూఖది జాతులవారు విశ్వామిత్ర సంతతివారని, ఆముని శాపము వలన దస్యులుగా మారారని రాయబడింది. కళింగ దేశం రాజ మహేంద్రవరమునకు దక్షిణ దిశగానున్నదని యిది అపవిత్ర భూమిగానున్నదని కూడా కౄరంగా వర్ణించి రాయబడింది. ఇక్కడ గమనించాల్సిన అంశమేమంటే అప్పటికే (ఈ పైరాతలు నాటికి)సవరలు నాగులు వగైరా జాతులు తమ రాజ్యాలను, భూములను ఆర్యులు ఆక్రమించిన కారణంగా అడవులకు తరమబడి అన్ని అవకాశాలు కోల్పోయి అనాగరికులుగా జీవించాల్సిన దుస్థితి ఏర్పడింది-

సవరులు ప్రధానంగా గంజాం, విశాఖ, గోదావరి జిల్లాలలోను, గోదావరికి సమీపమున భద్రాచలం తాలూకాలోను చెంచుల పేరుతో కృష్ణా, నెల్లూరు జిల్లాలలోను వున్నారు. మద్యపరగణాలు విశాఖజిల్లాకు మద్య ప్రవహించుచున్న శబరినదికి (గోదావరి ఉపనది) ఆపేరు సవరుల నుండే వచ్చింది. ఈ ప్రాంతము నందు సవరలు విశేషంగా వున్నారు. ఆర్య గ్రంధాలు సవరులను శబరులుగా చిత్రించారు. కోదులవలెనే సవరులులో రెండు తెగలు గలవు. వీరిలో అసలు సవరలు లేక కొండ సవరలు 2వ తెగ కాపు సవరలు. అసలు సవరలు పూర్వాచారము విడవక గుణపురంనకు ఉత్తరమునను తూర్పునను కొండలయందున్నారు. కాపు సవరులు నాగరికులై మైదాన

ప్రాంతాలలో (పల్లపు ప్రాంతాలు) వ్యవసాయం వగైరా వృత్తులు చేయుచున్నారు. ఈ సవరులలో పెక్కు వృత్తి భేదములు కలవు. వీరు వివిధ వృత్తులలో వివిధ పేరులలో ఉన్నా భోజనాది వ్యవహారాలలో అన్నియు సమానమే.

సవరలు ముందా జాతిలో చేరిన సవరభాషను మాట్లాడతారు. ఈభాష తెలుగు భాషకు పోలి దగ్గరగావుంది. ఈ భాష మరేనిలడన్‌భాష జాతిభాషలో చేరివున్నదని మాక్స్‌ముల్లర్ అభిప్రాయం.

సవరులు ఒరిస్సా, బెంగాల్ రాష్ట్రాలలో కూడా అధికంగా వున్నారు. సింగభూమి, సంబల్‌పూర్, రాయపూర్, బిలాస్‌పూర్, పాట్నా, కలహండి, సారంగర్. రాయగర్ మొదలైన చోట్ల వున్నారు. పూర్వం వీరు సాహబాద్ జిల్లాలో వుండేవారని, రాజపుత్రులు వీరిని ఓడించిన ఫలితంగా వీరు దక్షిణ ప్రాంతాలకు తరలివచ్చిరి. ఆర్యులు అనేక గ్రంథాలలో ఈ శబరులు (సవరలు) గురించి రాయడాన్నిబట్టి వీరి ప్రత్యేకత, ప్రసిద్ధి అర్థమవుతుంది. భారతం ఆదిపర్వంలో కామధేనువుతోకనుండి శబరులు పుట్టారని నీచంగారాశారు.

## కోదులు

గంజాంజిల్లా బల్లేగుడా, గుమ్సూరు, ఉదయగిరి ప్రాంతాలలో కోదుజాతి వారున్నారు. ఈ మూడు తాలూకాల్లోను కోదులు అధికంగా వున్నారు, రామగిరి తాలూకాలో సవరలు కూడా అధికంగానే వున్నారు. విశాఖజిల్లా ఏజెన్సీ ప్రాంతంలో కోదులు విశేషంగావున్నారు. వీరి భాష కూడా తెలుగుభాషకు దగ్గరగా వుంది. కోదులు ఆస్తుల కోసం తగాదపడరు. తండ్రి అన్నింటికి యజమానిగా వుంటాడు. స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్రాలున్నాయి. వీరు ఆత్మగౌరవం గలవారు. అల్ప సంతుష్టులు. యితరుల ధనానికి ఆశించరు. తమకున్నది యితరులకు పెట్టడంలో వెనుదీయరు.

కోదులు, కోయలు, సవరలు, నాగులు వగైరా ఆదిమజాతులు మాతృస్వామిక వ్యవస్థకు సంబంధించిన లక్షణాలుగలవారు. స్త్రీలకు మారు మనువుంది. అన్నగా విత్తంతువులు వివాహమాడవచ్చు.

ఆదిమవాసులపై విషప్రచారం :- ఆదిమ వాసులైన సవరలు, కోయలు, కోదులు, నాగులు వగైరా తెగలపై అంతులేని అబద్ధాలు, విషప్రచా

రం సాగించారు. ఈ తెగలు మద్యం సేవిస్తారని నరబలులు, జంతుబలులు సాగిస్తున్నారని అందుకే వీరిని దూరం చేశామని ఆర్యులు నిందా ప్రచారం సాగించారు. నిజం చెప్పాలంటే ఆర్యులు వచ్చాకనే ఆదిమవాసులు బలులు, మద్యం సేవించడం ప్రారంభించారు. అంతకు ముందు వీరికి అలవాట్లున్న దాఖలాలులేవు. ఆర్యుల నుండే యీ దురలవాట్లు వీరికి సంక్రమించాయి. ఆర్యులు బౌద్ధం వచ్చేవరకు గొడ్డుమాంసం తినడం, సురాపానం సేవించేవారనేది వారి గ్రంథాలే సాక్ష్యం. ఆర్యులు యజ్ఞాలు, నరమేథం లాంటివి ఆచరించేవారు. ఇప్పటికి బ్రాహ్మణులు వివిధ పేర్లతో నానారకాల యజ్ఞాలు చేస్తూనే వున్నారు. పాలకపక్షాలు ఆనాడు ఈనాడు కూడా వీరికి మద్దతు యిస్తూనేవున్నారు.

రామాయణం బాలకాండలో అంబరీషుని యజ్ఞంనకు పశువులు లభించక రుచీకుడనే ముని రెండవ కుమారుడు శునఃశేఫుని కొన్నట్లుంది. విశ్వామిత్రుడు తన కొడుకులైన మధుష్యందాదులను యజ్ఞపశువులు కమ్మని యాజ్ఞాపించగా వారు నిరాకరించారు. దీనితో విశ్వామిత్రుడు కోపించి కుక్క మాంసం తింటూ వెయ్యియేళ్ళు బ్రతకండని శపించింది తెలిసిందే.

రామాయణంలో నరమేధం కోసం పురుషులను వెదుకుతూ లక్ష్మణుడు బయలుదేరి చివరకు లవుని చూచి ఎత్తుకుపోయినట్లుంది.

ఘటాకర్ణుడు వెయ్యి బ్రహ్మ హత్యలు చేస్తే అవి నరమేధంగాగైకొని శ్రీకృష్ణుడు మోక్షమిచ్చాడట. ఘటాకర్ణుడు విభూతి ధరించడంచేత పాపమంటలేదని శైవులంటారు.

సర్పయజ్ఞం పేరుతో కనబడ్డ నాగులందరిని వధించిన సంగతి తెలిసిందే. గనుక ఈ బలుల విధానం ఆర్యులే ఆదిమవాసుల చేత చేయించారు.

ఇక ఆర్యుల మద్యపానం సేవించడం వారి గ్రంథాలలోనే కొల్లలుగా ఉదాహరణలున్నాయి. ఋగ్వేదంలో 9వ మండల మందంతటా సోమపానం (సురపానం) ప్రశంసవుంది. 7వ మండలమున కూడా సురపాన ప్రశంస కనబడుతుంది.

రామాయణంలో భరద్వాజుడు భరతునికి అతిథ్యమిచ్చినప్పుడు మైరేయం

సురను కురిపించినట్లుంది. నాలుగు రకాల మధ్యమిచ్చినట్లు కూడా వుంది. (యిది అయోధ్యకాండ 91లో వుంది).

భరతుడు చిత్ర కూటము మీదకు వెళ్ళినప్పుడు వేలకొలది సొండి-వాళ్ళను వెంటబెట్టుకుని వెళ్లినట్లుంది.

హనుమంతుడు లంకలో సీతను చూచి యిలా అన్నాడు. "రాముడు నీకోసం బెంగపెట్టుకొని మధ్యం కూడా ముట్టడంలేదు" యిది రామాయణంలో సుందరకాండ 37లో వుంది.

1833లో బస్తరురాజు నాగపురం రాజుని దర్శించడానికి వెళ్లినపుడు అతడు పెద్ద యజ్ఞంచేసి 27గురు మానవులను బలి యిచ్చాడట. యిలాంటివి ఎన్నైనా చెప్పవచ్చు. అత్తతెడ్డినాకుతూ మాకోడలికిబుద్ధి చెప్పినట్లు ఆర్యులు ఆదిమవాసులను నిందించడం తగని పనిగా వుంది.

అదిమ వాసులు ఎప్పుడూ అడవులకే పరిమితి అయివున్నారనే ప్రచారం కూడా అబద్ధం-

నాగులు సవరలు ఆదిలో భారత ఉపఖండంలో రాజ్యాలు ఏలినట్లు అనేక ఉదాహరణలున్నాయనిచూచాం. ఆర్యులు వచ్చాకనే యీ అదిమ వాసులు అడవుల పాలయ్యారనేది యదార్థం. ఒక శాసనంలో నందివర్మ పల్లవ మల్లయ్య అనే పల్లవరాజు ఉదయుడనే శబరి రాజును ఓడించి నెమలి పురి వెంట్రుకలతో చేసిన అతని కేతనమును పట్టుకున్నట్లు సోన్‌పూరుతామ్ర శాసనాలు మూడు దాదాపు 70 ఏండ్ల క్రితమే ప్రకటించారు. దీనిని పరిశీలించిన మజుందారుగారు ఉదయకుడు సవరల రాజని నిర్ధారించారు.

ముఖలింగేశ్వరాలయంలోని కొన్ని శాసనాలనుబట్టి కళింగ రాజ్యమందలి గంగవంశపు రాజులకు మూల పురుషుడైన కామార్ణవుడు శబరాదిత్యుని ఓడించినట్లున్న వాక్యంనుబట్టి కళింగరాజ్యం అదిలో సవరలదై వుంటుందని వేరే చెప్పనక్కరలేదు. తమకంటె బలమైన శత్రువుతో ఓడించబడి చివరకు కళింగకొండ ప్రాంతములకు పోయారు.

## కాళింగులు

వీరు బ్రాహ్మణులని చెప్పుకుంటారు. బ్రాహ్మణులుగా నటించినప్పటికిని వీరి ఆచార వ్యవహారాలన్ని ఆదిమ వాసులకు దగ్గరగా వుంటాయి. వీరిని శూద్రులుగానే భావిస్తారు. వీరు బౌద్ధాన్ని స్వీకరించారు.

కళింగ ప్రజలనగా కాళింగులు, సవరలు, కోదులు, కోయలు, నాగులు వగైరా జాతులందరూ ఒకటిగానే వస్తారు. అక్కడ ప్రజల్లోవున్న అభిప్రాయాన్నిబట్టి కాళింగులు ఆదిలో పంచమ కులంవారవి అంటారు. పంచమ కులమనగా నాగులే.

శ్రీకృష్ణదేవరాయులు ఈ దేశానికి వచ్చినపుడు తన తల్లి తద్దినము పెట్టవలసినపుడు ఉత్తమ కులం వారిచే వంట చేయించమని చెప్పెనట. దీనితో మంత్రి తిమ్మరసు పెద్ద కులం వారిచే వంటచేయించమని ఆదేశించగా ఆనాడు పెద్ద కులంగా పిలవబడే పంచములచే (ఇప్పటికి మన తెలుగునాట కొందరు మాల మాదిగలను పెద్ద కులంగా పిలుస్తారు). వంట చేయించెను యీ విషయం తరువాత బయటపడగా అప్పుడు ఆ పంచములందరికి జందెంలు వేయించి బ్రాహ్మణులుగా మార్చడం జరిగింది.

ఒక అయోధ్యరాజు చేయదలచిన యజ్ఞంనకు సపాదలక్ష బ్రాహ్మణుల నాయకత్వాన జరపాలని ఎంచి తక్కువ కులాల వారికి యజ్ఞోపవీతాలు ధరింపజేసి బ్రాహ్మణులుగా మార్చడం జరిగింది. వారిలో కొందరు శ్రీకృష్ణుడే తమ్ము బ్రాహ్మణులుగా మార్చెనని చెపుతారు.

ఈజందెం తగిలించుకునే ఆచారం గ్రీకుల నుండి పారశీకుల నుండి వైదిక బ్రాహ్మణులు కాపీ కొట్టారు. ఏదో ఒక ప్రత్యేకత చూపి క్రింద కులాలను హడలు గొట్టడమే వారి ధ్యేయం. ఈ జందేవి కుడా మంత్రాలు కల్పించారు. ఆ మంత్రశ్లోకం యొక్క అర్థం యిలాగుంది. "నేను నన్ను యజ్ఞం యొక్క ఉపవీతంతో (వస్త్రంతో) బంధిస్తున్నాను" ఇందులో గొప్ప ఏముందో దీని ప్రయోజనం మేమిటో అర్థంకాదు. బ్రాహ్మణుడు పుట్టగానే శూద్రుడే. ఉపనయన మయిన తరువాతనే అతడు బ్రాహ్మణుడౌతాడు. జందెం తగిలించాక ద్విజుడు అవుతాడు. బ్రాహ్మణుడు రెండు జన్మలెత్తుతాటడ. అతడే భూసురుడు, యితడే భూదేవుడు. ఈ రకంగా తమకు తాము దీర్ఘకాలం ప్రచారం చేశారు. ఈ ఆధునికయుగంతో కూడా యధావిధిగానే దీన్ని ధరించడం సిగ్గు చేటు. బ్రాహ్మణాచారంప్రకారం జందెం ధరించవిబ్రాహ్మణ స్త్రీలుశూద్రులక్రిందేజమ. అందుకే శూద్రుల వలెనే స్త్రీలను కూడా అన్ని విధాలా అణచివేశారు. 500సం॥ లాల క్రితమే మహాకవి వేమన జందెం తంతులోని పగటి వేషాన్ని యిలా ఖండించాడు· తాడు మెడకు వేసి తనకు శూద్రత్వంబు పోయెననెడి ధెల్లబుద్ధివేద్దు

పూర్వం పరశరాముడు పశ్చిమ కోస్తాతీరాన్ని ఆక్రమించి అక్కడున్న పల్లెకారుల వలలు చింపి వేసి ఆ తాళ్లతో పల్లె కారులందరికి జందేలు వేసి బ్రాహ్మణులతో చేర్చినట్లు కథలున్నాయి. వారు నేడు అగ్నికుల క్షత్రియులు గా పిలువబడుతున్నారు. అనాటి ఈ నయా బ్రాహ్మణులు ఈనాడు అగ్నికుల క్షత్రియులుగా ఎలాగ మారారో అర్థం కాకుండా వుంది. వైదికమతానికి వీటి నియమాలు లేవు

ఈ కారణం వలనే ఉత్తర భారతంలో గంగానది ఒడ్డునున్న బ్రాహ్మణులమని గొప్పలు చెప్పుకుంటారు. వీరు గా వ్యవసాయం చేస్తారు. పూర్వకాలంలో బ్రాహ్మణులకు మరణ దండన లేదు. ఆ కారణంగా వలసపోయిన శూద్ర పంచమ కులాలువారు కొందరు బ్రాహ్మణుల మని చెప్పుకోవడం జరిగింది.

బీహారు జిల్లాలో బాగల్పూరు జిల్లాలోనూటికి 75 మంది బ్రాహ్మణులు వ్యవసాయం చేస్తారు. వీరు నూతనంగా మార్చబడిన లక్షమంది బ్రాహ్మణుల సంతతి వారమని చెప్పుకుంటారు.

ఒరిస్సాలోని జాజ్‌పూర్ జిల్లాలో బంగాళాదుంపల వ్యవసాయం చేయు బ్రాహ్మణులు కలరు. వృత్తి చేతను జాతిచేతను పరిశీలిస్తే వీరు కూడా బ్రాహ్మణకులంగా మారిన వాళ్లే. అసలు బ్రాహ్మణులకు వీరికి ఆచార వ్యవహారాలో భేదముంది.

కృష్ణానది తీరాన, మైసూరులోను ఈరకం కల్తీ బ్రాహ్మణులున్నారు. గంజాం జిల్లాలోని హొవ్నాడ బ్రాహ్మణులు యిటువంటి వారే. మధురజిల్లాలోని చోళ బ్రాహ్మణులు కూడా కృత్రిమ బ్రాహ్మణులే. సింహళం. (శ్రీలంక)లోకూడా బ్రాహ్మణేతరుల నుండి బ్రాహ్మణులను సృష్టించినట్లు స్పష్టంగా కనబడుతుంది. వాడేగాక ఈనాడు కూడా బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు బయాలుదేరి. కమ్మ, కాపు, బలిజ వంటి శూద్రకుల బ్రాహ్మణులు పుట్టు కొచ్చారు. యిది మనం చూస్తూనే వున్నాం.

ఇక్కడ మరో విశేషమేమంటే ఈ కాళింగులు ఒక ప్రత్యేక శాఖగా వుండి ఎందులోను కలవలేక పోయారు. ఒకప్పుడు కాళింగులలో చాతుర్వర్ణములు వుండేవి. వైశ్యులు మినహా మిగిలిన బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర

కులాలు కలిసిపోయి బ్రాహ్మణులుగా చలామణి కావడం జరిగింది. వైశ్యులు మాత్రమే వేరుగా వున్నారు. ఇక్కడ వర్ణాశ్రమ ధర్మాలు తప్పాయి. ఇలా ఎందుకు జరిగిందో అర్థం కాదు. బహుశా అటు మగధరాజులనుండి, యిటు దక్షిణ రాజుల నుండి నిత్యం దండయాత్రలకు గురి కావడం, యుద్ధాలకు బలి కావడం వల్ల కళింగ ప్రజలంతా ఒక తాటిమీదకు వచ్చి శత్రువుల నెదిర్చి వుండటానికి యిలా జరిగి వుండవచ్చు.

కళింగులు సంవత్సరాని కొకసారి కత్తిపూజ చేస్తారు. వీరు పౌరుషవంతులు, ధైర్యశాలురు. ఎడతెగని యుద్ధాల్లో పాల్గొనడం వల్ల ఆత్మరక్షణ కోసం కత్తి పట్టడం, కత్తిపూజ చేయడం జరిగివుండాలి. (విదేశీయులెవరు దిగినా మొదట పంజాబ్ సరిహద్దులోనే దిగి మొదటి కబళంగా పంజాబీలే బలయ్యేవారు. ఇది గమనించి గురునానక్ శిక్కు మతాన్ని కనిపెట్టవలసి వచ్చింది. ప్రతి శిక్కు కత్తి పట్టాలని ఖచ్చితమైన ఆచారంగా మారింది. ఆత్మ రక్షణ కోసం శిక్కులు కత్తిపటక తప్పదని గురునానక్ అభిమతం.

నాటికి నేటికి శిక్కులు, ఆదిమవాసులు బ్రాహ్మణబనియాల ప్రభుత్వ దాడులకు గురవుతూనే వున్నారు. అనేక రూపాలలో వీరిని దోపిడిచేసి అణచి వేసూనే వున్నారు.

# పుష్యమిత్రుని రాక్షసత్వం

మౌర్య చక్రవర్తి అశోకునికాలంలో బౌద్ధం ప్రబలంగా విస్తరించింది. వైదికమతం పూర్తిగా క్షీణించడం తత్ఫలితంగా వైదిక పురోహితులు తమ కున్నప్రత్యేక హక్కులన్ని నేలమట్టం గావడం జరిగింది. అందువల్ల వారిలో తీరనిద్వేషం ప్రజ్వరిల్లగా మౌర్యవంశానికి చెందిన కడపటి రాజైన బృహద్రధుని సేనాని బ్రాహ్మణ పుష్యమిత్రుని చేత హత్య చేయించారు. బృహద్రధుని హత్య తర్వాత పాటలీపుత్రంలో బ్రాహ్మణ శుంగవంశ పాలన పుష్యమిత్రుని రాజుగా ప్రారంభమైంది. ఈతడు క్రీస్తుకు పూర్వం 187 నుండి 36 ఏళ్లు పాలించాడు ఈ కాలంలోనే మనుస్మృతిరాయడం జరిగింది. ఇందులో శూద్ర, దళిత కులాలను అన్ని విధాల అణచి సర్వనాశనం చేసే నిబంధనలు సూత్రాలు వున్నాయి. ఈ కాలాన్నే బ్రాహ్మణులు స్వర్ణయుగంగా రాసుకున్నారు. బౌద్ధాన్ని సర్వవిధాల అణచివేయడానికి తీవ్ర ప్రయత్నాలు జరిగాయి. 84000 బౌద్ధ స్తూపాలను నేల మట్టం చేస్తానని బ్రాహ్మణ పుష్యమిత్రరాజు శపథం చేశాడు అనేక బౌద్ధ ఆరామ విహారాలను సర్వనాశనం చేయించాడు. అనేక మంది బౌద్ధసన్యాసులను క్రూరంగా హింసించి చంపాడు. బౌద్ధశిరస్సు తెచ్చిన వారికి వంద దీనారాలు యిచ్చాడు. అశ్వమేధయాగాలు రాజసూయయాగలు అనేకం చేసి తనకు ఎదురు లేకుండా చేసుకున్నాడు. తిరిగి వైదిక మతాన్ని పునరుద్ధ రించాడు. ఇదేరూపంలో దక్షిణ భారతంలోని మధురలో 8,000 జైనులను ఒక హిందూరాజు ఉచకోత కోయించాడు. ఈ రకంగా చార్వాక, బౌద్ధ జైన మతాలను అవలంబించిన శూద్ర దళిత వర్గాలను దుంపనాశనం చేసి వదలి పెట్టారు. "బ్రాహ్మణుడు కత్తి పడితే పాపం "బ్రాహ్మణుడు రాజుని నిందించ రాదు" నిజమైన బ్రాహ్మనుడు ఏపూటకాపూట వారాలు చెప్పుకొని జీవించాలి. ఈలాంటి బ్రాహ్మణ ధర్మాలను పుష్యమిత్రుడు ఉల్లంఘించి నయవంచనతో బృహద్రధుని చంపాడు.



## బుద్ధుని దంతానికి నాగుల రక్షణ

భారత ఉపఖండంలో బౌద్ధాన్ని స్వీకరించి, వ్యాప్తి చేసిన వారిలో ప్రథములుగా నాగులే వస్తారు. ఈనాడు మనం చూస్తున్న బౌద్ధ శిల్పాలు, బౌద్ధ గుహలు, స్తూపాలు బౌద్ధాలయాలువగైరా బౌద్ధ సంస్కృతి సృష్టికర్తలు ప్రధానంగా నాగులే.

బౌద్ధ సాహిత్యం ప్రధానంగా పాళీ భాషలోనే వుంది. ఈ పాళీభాష దేన్నుండి వచ్చిందో చరిత్రకారుల్లో బిన్నాభిప్రాయాలున్నాయి. అనాడు మగద రాజ్యంలోని మాగధభాష నుండి పాళీభాష పుట్టిందని కొందరు (అశోకుని కాలంలో) ఉజ్జయినీ భాషనుండి పుట్టిందని (అశోకుని కుమార్డు మహేంద్రుని కాలంలో) కొందరు అభిప్రాయపడుతున్నారు. అయితే ఈ వాదనలకు తగిన సాక్ష్యాధారాలు అంతగా లభించలేదు. బౌద్ధ సాహిత్యం ప్రధానంగా సింహళం (శ్రీలంక)లోనే ఎక్కువగా వుంది. అనాడు సింహళంతో వర్తక వ్యాపారాలరీత్యాగాని, రాజ కుటుంబాల సంబంధ బాంధవ్యాల రీత్యాగాని, నిత్యం సింహళానికి కళింగానికి సజీవ సంబంధాలుండేవి. నావికారాక పోక్కలుండేవి. సింహళానికి కళింగం నుండే బౌద్ధం ప్రవేశించింది. మరో ఆధార అంశం ఏమంటే కళింగాంధ్ర భాష అంటూ ఒక భాష అనాడు వాడుకలో వుండేది. అది తెలుగుకు సంబంధించిందే. సింహళంలోను కళింగంలోను దొరికిన శాసనాల లిపులు పరిశీలిస్తే పాళీభాష కళింగాంధ్ర భాషకు దగ్గర పోలికలున్నాయని కొందరు చరిత్రకారులు ఖచ్చితంగా వాదిస్తున్నారు. దక్షిణాదిపైనున్న ద్వేషంతో కొందరు ఉత్తరాది చరిత్రకారులు దీనిని అంగీకరించరుకదా! ఎంతో దూరభారంలోవున్న వుత్తరాది వారినుండి దక్షిణాదిన కడనున్న సింహళానికి భాషగాని బౌద్ధంగాని వ్యాప్తి చెందిందనడం ఎంత మాత్రం సబబుకాదు. అన్నాటి రాకపోకల సౌకర్యం కూడా కష్టతరమైంది.

బుద్ధుని నిర్యాణానంతరం దహనం జరిగిన వెంటనే బౌద్ధాన్ని అనుసరించిన దేశాల వారు ఆయన శరీర స్మారక చిహ్నములను పంచుకుని తమ తమ దేశములకు తీసుకుపోయారు. అకాలమున రాజగృహం, కుశీనగరం, వైశాలి, కపిలవస్తు, అల కావ్యం, వితదీపకం, రామగ్రామం, పావ, దన్న, గ్రామము, పిట్టలవనం వగైరా నగరంలో చైత్యములుండేవి. వీరంతా దహనం జరిగిన చోటుకివచ్చి బుద్దిని శరీరావశేషముల్లోని ఎనిమిది ద్రోణములను

వారు పంచుకున్నారు. వాటిలో క్రింది కుడిదంతం గాంధార దేశంకు పోయిం దట. మీది ఎడమ దంతం కళింగ దేశమునకు వచ్చిందట, క్రింది ఎడమ దంతం నాగలోకంవారు తీసుకుపోయారట. అయితే కళింగదేశమునకు వచ్చిన ఎడమ దంతము గురించి కొన్ని వివరాలు యిలాగున్నాయి.

బుద్ధుని మరణాంతరం ఆయన శిష్యుడు ఖేముడు ఆ దంతమును సం గ్రహించి కళింగదేశంలోని దంతపురంనకు తెచ్చెను. ఈ దంతపురం శ్రీకా కుళం రైల్వేస్టేషన్‌కు 10మైళ్ళ దూరంలోనున్న దంతవరపు కోటని అనేక శాసనాలు పరిశీలనంతరం చరిత్రకారులు తేల్చారు. అది ఈనాటికి పాడు పడైన విశాలమైన పెద్ద దిబ్బగా పడివుంది. అది ప్రాచీనకాలంలో పెద్దకోట అయివుంటుందంటున్నారు. ఈ దంతముంచిన గృహము గోడలకు బంగారు రేకులు తాపడం చేశారని మంచి ముత్యాలహారాలను తోరణాలు కట్టినట్లు ఈ దంతముంచిన పెట్టెకు నవరత్నాలు పొదిగినట్లు బౌద్ధ గ్రంథాలలో వర్ణించి చెప్పబడింది.

బర్మాదేశపు బౌద్ధ గాథల ప్రకారం అశోకచక్రవర్తి బుద్ధిని శరీరక చిహ్నములన్నింటిని తన రాజధానికి చేర్చమని ఆదేశమిచ్చాడని వుంది.

అశోకుని ఆజ్ఞ ప్రకారం భటులుపోయి వైశాలి, కపిలవస్తు, ఆలకప్ప పాహి, కుశీనగరం వగైరా చైత్యములను పడగొట్టి అచ్చటి బుద్ధిని శరీర చిహ్నములను తీసుకుపోయారు. కాని రామగ్రామంలోని చైత్యమును నిర్మూ లించడానికి వారు ప్రయత్నించగా ఆ చైత్య రక్షకులైన నాగులు ఆటంక పర్చినట్లుంది. చైత్యమునకు ఎట్టి హాని కలగనీయలేదు. ఇది క్రీ॥ పూర్వం 325 సం॥లో జరిగింది. బుద్ధుని దంతం సుమారు 800 సం॥రాలు దంత పురంలో నున్నట్లు తరువాత యిది కొన్ని ప్రాంతాలకు తరలించినట్లు చివ రకు సింహళంలోని అనురాధపురానికి చేర్చినట్లు తెలుస్తుంది. అక్కడ కూడా యీ దంతం గురించి అనేక గాథలున్నాయి.

నేడు దళితులుగా వున్న మనం నాగజాతి వారసులం. మన ప్రాచీన చరిత్ర మహోన్నతమైనదని చూచాం. ప్రపంచంలో మొట్టమొదటి నిప్పును కనిపెట్టింది, ఇనుమును కనుగొన్నది నాగులే. ఇనుప యుగం ప్రారంభానికి నాగరికత సంస్కృతికి నాంది పలికింది తుంగభద్ర నదీ ప్రాంతమే. కృష్ణా తుంగభద్ర నదులమధ్య తెలుగు గడ్డ సీమలో తొలుత మట్టి నుండి బంగారం

తీసింది మనమే. "మట్టికాదు మాణిక్యం" అని రాశులు ఉలవలు వంటి మెట్ట పంటలు పండించి వ్యవసాయానికి అంకురార్పణ కల్పించింది తెలుగువాగులే సమస్త పాడిపంటలకు నిలయంగా పసిడిరాసుల తెలుగుపుడమిగా మార్చింది ఆనాటి మన నాగులే. కృష్ణా, తుంగభద్ర, గోదావరి నదులు ప్రవహించిన పుణ్యభూమి మన తెలుగు నేల.

మొట్టమొదట కళింగ ప్రాంతంలో ప్రపంచంలోనే మొటమొదటి నావ కనిపెట్టింది తెలుగు నాగులే. సిలోన్, బర్మా, జావా, సుమిత్రావంటి దేశాలకు వర్తక వ్యాపారాలు సాగించింది మనమే. రోమ్, గ్రీకు సామ్రాజ్యాల్లో ఖండ ఖండాచరులకు వ్యాపారం సాగించింది మన నాగులే. ప్రాచీనకాలంలోనే నర్సాపురం, మచిలీపట్నం రేవుల నుండి నౌకాయానం, వర్తకవాణిజ్యాలు సాగించింది తెలుగులే.

పైమూడు నదుల నగరాల నాగరిక సంస్కృతిని ఉపఖండం నలుమూలల వ్యాపింప చేసింది తెలుగు నాగులే! గర్వించతగ్గ ఉజ్వల చరిత్ర మనకుంది. అందుచే అటవిక భూములు గల ఆర్యులు కత్తికట్టి కక్షబూని చివరకు మనలను దళితులుగా మార్చారు.

హేయబద్ధమైన బౌద్ధాన్ని ప్రభలములోనే స్వీకరించి ఉపఖండం వ్యాప్తి చెందించడమేగాక విశ్వవ్యాప్తంగా వృద్ధిచేసింది తెలుగు నాగులే. త్యాగాలకు, పౌరుషానికి పెట్టింది పేరుగా నిలిచింది మన పూర్వీకులే! అట్టి జాతి ఆర్య బ్రాహ్మణుల కుట్రలకు, కుయుక్తులకు దాడులకులోనై అన్నింటికి దూరమై కృంగి కృశించేట్టుచేశారు. నేడు వీర్యహీనమై, నిత్తేజమై నిద్రావస్థలో వున్నాం.

మన తాత ముత్తాతల చరిత్రను మరోసారి మననం చేసుకుని పూర్వపు ఔన్నత్యాన్ని కీర్తిని నిలుపుకుందాం.

* * * * *

## తెలుగుజాతి చరిత్రతో సంబంధం ఉన్న సంఘటనలు

కళింగం ఒకప్పుడు ఉత్తరమున గంగానది ముఖద్వారం వరకు, దక్షిణమున కాంచీపురం వరకు వ్యాపించి వుండేది. గణతంత్ర వ్యవస్థనుండి రాచరిక వ్యవస్థగా మారినపుడు భారత ఉపఖండ మంతా చిన్నచిన్న రాజ్యాలుగా చీలి వుండేది. ఈ చిన్నరాజ్యాలన్నిటిని కబళించి దోచుకున్నవాడే ఆనాడు చక్రవర్తిగా చలామణి అయ్యేవాడు. సైన్యాలను, ప్రజలను రక్తపాతం చేస్తేగాని సామ్రాజ్యం ఏర్పడేదికాదు. ఈ కారణంగా దేశాల సరిహద్దులు రాజధానులు తరచూ మారేవి. అలాగే అతి ప్రాచీనమైన కళింగ దేశ సరిహద్దులు, రాజధానులు పదేపదే మారుతూ వచ్చాయి. దీనికి అనేక శిలా, తామ్రశాసనాల వివరాలే తార్కాణం.

కళింగులు మంగోళీ ద్రావిడులుగా పరిశోధనలు తెలుపుతున్నాయి. అంతేగాక భాష, ఆకారాది విషయాలు దీనినే రుజువు చేస్తున్నాయి. ఈ అంశం రాళ్ళబండి సుబ్బారావుగారు రాసిన కళింగదేశ చరిత్రలో వివరించారు. కళింగ ప్రజలు ద్రావిడజాతివారు గనుకనే వీరిపట్ల ఆర్యులు శత్రువైఖరి అవలంభించారు. క్రమక్రమంగా కళింగం ఆర్యులకు వలసగా మారి ఆర్యమతం చొప్పించారు. ఆదిలో కళింగరాజ్యం నేలిన కళింగ అను ద్రావిడ రాజు ఆర్య బ్రాహ్మణుల ప్రోద్భలంతో వైదిక మతం స్వీకరించెను. తరువాత ఆతని కుమారుడు బౌద్ధాన్ని అవలంభించెను. వీరి తర్వాత వచ్చిన రాజులంతా బ్రాహ్మణిజాన్ని తిరస్కరించి బౌద్ధాన్నే స్వీకరించారు,

నందులు క్రీస్తుపూర్వం 467 నుండి 336 మధ్య పాలించారు. వీరు కళింగును కూడా పాలించారు. అలాగే మౌర్య చక్రవర్తులు కళింగును ఏలినట్లుంది. మౌర్యచక్రవర్తి చంద్రగుప్తుడు శ్రావణుల మతం అవలంబించాడు. అశోకుడు కూడా ప్రధమంలో జైనమత మవలంభించెనని, కాశ్మీరుకూడా జైనమతం తీసుకు పోయెనని అతని శాసనాలవల్ల తెలుస్తుంది.

మౌర్య చక్రవర్తి చంద్రగుప్తుడు క్రీస్తుకు పూర్వం 310 నుండి 296 వరకు పాలించాడు. ఇతని కుమారుడు బింబుసారుడు క్రీ.పూ. 296 నుండి 268 వరకు రాజ్యమేలెను. ఇతని కుమారుడు అశోకుడు క్రీ.పూ. 268నుండి

236 వరకు ఏలుబడి సాగించాడు. అశోకుని తర్వాత మౌర్యవంశ పాలన క్షీణింప జొచ్చెను.

క్రీస్తుకు పూర్వం 188 లో శుంగ వంశానికి చెందిన పుష్యమిత్రుడు అనే బ్రాహ్మణ సేనాని అశోకుని మనవడిని హత్యచేసి అధికారంలోకి వచ్చాడు. యితని గురించి యింతకు ముందే చూచాం.

అశోకుడు రాజ్యం కొరకు ముందుగా తన అన్నతమ్ములతో పోరాడ వలసి వచ్చింది. పట్టాభిషిక్తుడైన 8 ఏండ్లకు క్రీస్తుకు పూర్వం 250వ కళిం గంపై దండయాత్ర చేసెను. ఈ యుద్ధంలో కళింగులు తమ స్వాతంత్రం కొరకు పోరాడారు. వేలాదిమంది మరణించారు. ఈ యుద్ధంలో అశోకునికి వ్యతిరేకంగా నాగజాతులు తీవ్రంగా పోరాడారు. ఈ కళింగ యుద్ధం ప్రపంచ చరిత్రలో ప్రముఖంగా నిలిచింది. నాగజాతులు తమ ప్రాణాలను సమర్పించి శవాల గుట్టలతో అడ్డుకట్ట వేసినట్లుగా యుద్ధం చేసి అశోకుని ముందుకు రాకుండా నిలవరించారు. ఈ రక్తపాతం, యుద్ధభీభత్సం అశోకుని కలవర పర్చింది. చివరకు పశ్చాత్తాప పడి కళింగ నుండి తిరిగిపోయాడు.

యుద్ధానంతరం ఈ నాగజాతులను దయా దాక్షిణ్యాలతో చూడమని (చావగా మిగిలినవారిని) అశోకుడు ఆదేశించినట్లు అతని శాసనాలు తెలుపు తున్నాయి.

ఖారవేల చక్రవర్తి వంశీయులు క్రీస్తుకు పూర్వం 207 లో కళింగను స్వాధీనం చేసుకున్నారు. ఖారవేలునికి అనేక వీరోచిత బిరుదులున్నాయి. ఇతను ప్రజాభిమానం పొందిన చక్రవర్తి అని అంటారు. ఇతను ఆర్యబ్రాహ్మ ణ మతానికి బద్ధవ్యతిరేకి. జైన మతాభిమాని. ఇతను క్రీస్తుపూర్వం 192 నాటికి యువరాజుగా 15వ ఏటలోనే వున్నాడు. 183లో పట్టాభిషిక్తుడైనాడు. ఆకాలంలోనే కళింగకు పశ్చిమానున్న తెలుగు భూమిని మొదటి శాతకర్ణి పాలించేవాడు. ఖారవేలుడు కారునలుపు శరీరచ్ఛాయ గలిగినవాడు. ఇతని ధైర్య సాహసాలకు భయపడి ఇతను విష్ణుమూర్తి అవతారమని, శ్యామలా వర్ణగల వాడని ఆర్యబ్రాహ్మణులు యితనిని ఆకాశానికెత్తి పొగడి యితను ఆర్యరాజని చెప్పుకున్నారు. ఆర్య బ్రాహ్మణుడైన పుష్యమిత్రుడేలిన మగధ రాజ్యాన్ని మట్టికరిపించాడు. పుష్యమిత్రుని పాదాక్రాంతం చేసుకున్నాడు. నందరాజుల కాలంలో కళింగనుండి మగధకు తీసుకుపోయిన జీవదేవుని విగ్ర

హమ్ములు తిరిగి కళింగకు తీసుకు వచ్చెను. మౌర్యచంద్రగుప్తుని కాలంలో పోయిన 164 జైనమత గ్రంథములు తిరిగి కళింగకు తీసుకొచ్చాడు. బెంగాల్ కు చెందిన చరిత్ర పండితుడు మజుందార్ ఖారవేలుడు ద్రావిడ జాతికి చెందినవాడని, కళింగులు ద్రావిడ జాతికి చెందినవారని రాసియున్నాడు.

త్రికలింగం కళింగం కన్నా అతి ప్రాచీనమైనది. ఇందలి ప్రజలను త్రికలింగులు లేక తైలింగులనియు కళింగులు తెలుగులు ఒకేజాతికి చెందిన వారనియు చరిత్రలు చెప్తున్నాయి. ఈ వివరణ యిదివరకే చదివాం. ఈ త్రికలింగరాజ్యం క్రీస్తుతర్వాత రెండోశతాబ్దంలో చీలిపోయింది. దక్షిణ భాగమును కడపటి తెలుగురాజులు జయించిరి.

ఆంధ్రభృత్యులు శ్రీశైల ప్రాంతములోను, అభీరులు ఉత్తర కొంకణం నందును, వాకటకులు మాళవదేశమందును, మహారథులు దక్షిణకొంకణ కుంతల దేశములందును, చూటులు, నాగులు, పల్లవులు కృష్ణానది ఉత్తర ప్రాంతములందును బృహత్పాలాయనులు కృష్ణానది ముఖప్రాంతమునందును శాలంకాయనులు వేంగీ దేశము (కృష్ణా-గోదావరి మధ్యదేశం) నందును స్వతంత్ర రాజ్యములు నెలకొలుపుకున్నారు.

క్రీస్తు శకము 4వ శతాబ్ది ప్రారంభమందు కోసల, అంధ్రిపుండ్రి, తామ్రలిప్త, ఢంపదేశములు దేవక్షితులను వంశములచే పాలింపబడునట్లును, కళింగ, మహిష, మహేంద్ర ప్రాంత ప్రదేశములు గుహునిచేపాలింపబడునట్లు తెలియచున్నది. వీరందరిని అనాగరికుల్నిగాను, అపవిత్రులుగాను అధర్మ పరాయణులుగాను ఆర్యబ్రాహ్మణులు చిత్రించి ప్రచారం సాగించారు.

ఆ కాలంలోనే గుప్తవంశపు రాజులు మగధ రాజ్యానికి పాటలీపుత్ర రాజధానిగా పాలించారు. లిచ్ఛవుల సహాయంతో మగధరాజ్య విస్తరణ సాగించారు. ఈ వంశంలో మొదటివాడు శ్రీగుప్తుడు. ఈ రాజు క్రీస్తుశకం 310 నుండి 340 వరకు పాలించాడు. ఇతని కుమారుడు సముద్రగుప్తుడు రాజ్యానికి వచ్చెను. యితని కాలంలోనే గుప్త సామ్రాజ్యాన్ని సుస్థిరపర్చాడు ఈ కాలంలోనే తెలుగు సామ్రాజ్యం క్షీణింపజొచ్చింది. చిన్నచిన్న రాజ్యా రాజ్యాలుగా ఏర్పడ్డాయి. వాటినన్నింటిని సముద్రగుప్తుడు తేలికగా జయించి సంపూర్ణ దండయాత్రగా చెప్పుకున్నాడు. సముద్రగుప్తుని కళింగ దండయాత్ర క్రీ॥శకం 359-360లో జరిగినట్లు డా॥ యన్. కృష్ణస్వామిఅయ్యంగారు వెల్లడించారు.

ఆ కాలంలో కళింగమందు బౌద్ధం ప్రభలముగా నుండెను. అనాటి కళింగం అయిదారు చిన్న రాజ్యాలుగా ఏర్పడి పాలన సాగిస్తున్నాయి. సముద్రగుప్తుడే బౌద్ధాన్ని సర్వనాశనం చేశాడు. యితని తర్వాత యితని కుమార్డు రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుడు క్రీస్తు శకం, 375-415 వరకు రాజ్యమేలెను. ఇతని కాలమున మాళ్వా గుజరాత్ దేశాలు జయించెను. గుప్తుల వంశ పాలనలో బ్రాహ్మణుల రొట్టె విరిగి నేతిలో పడింది. హూణుల దండయాత్రలవల్ల గుప్తుల కడపటి రాజుల బలహీనతలవల్ల గుప్తరాజ్యం క్రీస్తు శకము 5వ శతాబ్దంలో క్షీణింపజొచ్చెను.

బోదాయనుడు వైదిక ధర్మసూత్రకారుడు, ప్రథమ వచనకారుడు, తెలుగువాడని అనగా తెలుగుదేశ నివాసియని జార్జిముల్లర్ దొర రాశాడు. ఈ బోదాయనునిచే నిరశించబడిన కళింగం క్షత్రియ పరమద్వేషి అయిన పరశురాముడు (బ్రాహ్మణుడు) ఉత్తర భారతంలోని క్షత్రియులందరిని ఏడు సార్లు వెదికి వెదికి సంహరించిన తరువాత దక్షిణాదికివచ్చి కళింగము పవిత్రంగా భావించి అచ్చటున్న మహేంద్రగిరి మీద తపస్సు చేసుకున్నట్లు చెప్పబడింది. ఈ పరుశరామునివద్దే శూద్రుడైన కర్ణుడు విద్యాభ్యాసంచేశాడు. బోదాయనుడు క్రీస్తుకు పూర్వము 14వ శతాబ్దపు వాడేనని తెలియచున్నది.

ద్రావిడ రాజు రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుని కాలమున అతని గురువు విశాఖపట్నం జిల్లాలోని రామతీర్థం (ఆ కాలంలో యిది గొప్ప జైనమత క్షేత్రం) వెళ్ళినట్లు అక్కడున్న కన్నడ శాసనాలనుబట్టి తెలుస్తుంది.

నందరాజు లేలిన కాలంలోనే కళింగమున జైనమతం క్రీస్తుకు పూర్వం 5వ శతాబ్దమున వ్యాప్తి చెందినట్లు కూడా శాసనాలున్నాయి.

ఉదయగిరి కొండల యందేగాక రామగిరి కొండలయందు కూడా జైనమతంతోపాటు బౌద్ధమతం కూడా అక్కడ వ్యాపించింది.

ప్రాచీన కళింగదేశం (ఒరిస్సా) భువనేశ్వరికి నాలుగు మైళ్ళు పడమట దిక్కుగా ఖండగిరి గలదు. అక్కడ అనేక గుహాలు, గుహాలయాలు గలవు. జైనమతస్థుల కొరకు నిర్మించబడినవి. యిప్పటికి జైనమతస్తులు యాత్రలు సాగిస్తుంటారు. ఈ గుహాలందు ఖారవేల చక్రవర్తి "హస్తిగుంఫ" శాసనము మిక్కిలి ప్రశస్తమైనదని అంటారు.

ఈ జైన గుహలలో గణపతి, లక్ష్మి వగైరా హిందూ విగ్రహాలను క్రీస్తు శకము 8-11 శతాబ్దాల మధ్య చొప్పించారని తెలుస్తుంది. చోడగంగు ని మనుమడగు మదన మహాదేవ చక్రవర్తి అర్వబ్రాహ్మణుల చేత ప్రేరేపితుడై ఈ గుహలయందలి జైనులను హింపించి తరిమివేసినట్లు, అలాగే భువనేశ్వరి చుట్టుప్రక్కల కొండలలోని బౌద్ధులను పారదోలినట్లు కొన్ని శాసనాలు ద్వారా తెలుస్తుంది. అనగా క్రీస్తు శకము 12 వ శతాబ్దాం నందు జైన, బౌద్ధమతాలు కళింగం నుండి వెడలి గొట్టినట్లుంది. ఉదయగిరి, ఖండగిరి గుహలు గుహ శిల్పములు, శాసనాలను బట్టి క్రీస్తు పూర్వము నాలుగవ శతాబ్దాం నుండి క్రీస్తు శకము 14వ శతాబ్దం వరకు కళింగమున జైనమతం ప్రభలి వృందని మరో లెక్కన చెప్పబడింది.

ఆనాటి విశాఖపట్నం జిల్లాలోని విజయనగరంనకు 8మైళ్ల దూరంలో నున్న గురుభక్తి కొండ మీద పాడుపడిన ఒక పెద్ద బౌద్ధమఠం వుంది, దీనిని పరిశోధన చేయాల్సివుంది.

అలాగే విశాఖపట్నం జిల్లా అనకాపల్లివద్ద శంకారం అనే గ్రామంవద్ద నేడు బొజ్జన్న కొండగా పిలువబడుతున్నకొండ అతిపురాతన కాలంలో యిది బుద్దన కొండగా పిలువబడేది. యిక్కడ అనేక కొండగుహలు, బౌద్ధాలయాలు బౌద్ధ చైత్యం వగైరా కొల్లలుగావున్నాయి. ప్రపంచ బౌద్ధరామాలలో యిదొక ముఖ్యమైనదని అంటారు. తరువాత కాలంలోనే గణపతి విగ్రహాన్ని పెట్టి బొజ్జన్న కొండగా మార్చారు.

సుదీర్ఘకాలం కళింగమేలిన పూర్వగంగ వంశశకం క్రీస్తుశకము 593వ ప్రారంభమైంది. వీరి శాసనాలు, భాష లిపినిబట్టి వీరు తెలుగు రాజులని నిర్ధారణ చేశారు. పూర్వగాంగులకును, తర్వాత గాంగులకు ఎట్టి సంబంధం లేదనియు, వారు వేరువేరు శాఖలకు చెందినవారనియు మొదటివారు గాంగ శకమునకు రెండవవారు శాలివాహనశకం వారని శాసనాలనుబట్టి తెలుస్తుంది. అయితే కొందరు ఈ రెండు తెగలు ఒకటే అని అంటున్నారు. ఈ గాంగుల పాలనలో కళింగం ఎంతో ప్రభావితం చెందింది.

అనేకమైన వివిధరకాల శాసనాల అసలు ఫొటోలు కళింగదేశ చరిత్రలో (రాళ్ళబండ సుబ్బారావుగారి సంపాదకత్వాన వెలువడ్డ) చూడవచ్చు.

ఇక ఏతావాతా తేలిందేమంటే సుమారు 50,000 సంవత్సరాలు నుండి యీ భారత ఉపఖండంలో స్వదేశీయులుగా నివశిస్తున్న ఆదిమ ప్రజలైన నాగులు నాగ ఉపజాతులను (ద్రావిడులను) ఆర్యులు వచ్చాక 1500 సంవత్సరాలు వివిధ రూపాల్లో దాడులు, యుద్ధాలు, పోరాటాలు సాగించి కుట్రలు కుహకాలు పన్ని అనేక మందిని హతమార్చారు. ప్రత్యక్షంగా, [illegible]గా నయవంచనచేసి నాగులనుఓడించారు. బానిసలుగా మార్చివేశారు చివరకు అంటరాని వారుగా, చూడరానివారుగా ఆంక్షలు విధించి శిక్షించి, హింసించారు. చివరకు 7 లక్షల మాలపల్లెలను సృష్టించి ఊరికి దూరంగా నెట్టివేశారు. దళితులుగా మార్చివేశారు.

ఈ ఆర్య-ద్రావిడ మహాసంగ్రామాన్ని యింకా పరిశోధన, పరిశీలన చేసి వాస్తవాలు యింకా అనేకం బైటపెట్టాల్సివుంది.



## ముగింపు

కట్టు కథలు, పిట్టకథలు సృష్టించడంలోను వక్రభాష్యాలు కల్పించడంలోను అగ్రకుల పండితులు అగ్రస్థానంలో వున్నారు, "భారతజాతి మిశ్రమజాతి" అని విడదీయరాని జాతుల సమ్మేళన మని దోపిడి వర్గాల పండితులు ఒక ప్లాను ప్రకారం ప్రచారం చేశారు. ఈఉపఖండంలోని వివిధ జాతులను ఆనాడు బ్రిటిషువాళ్లలాగే ఈనాడు బ్రాహణ బనియా గుత్త పెట్టుబడిదారులు వివిధ రూపాలలో కొల్లగొడుతున్నారు. ఆయా భాషాజాతులు పారిశ్రామికంగా అభివృది కాకుండా అడ్డు పడుతున్నారు. నేడు ఢిల్లీ కేంద్రం ఒక సామ్రాజ్యంగా మారి రాష్ట్రాలను (జాతులను) సామంత రాజ్యాలుగా, వలసలుగా మార్చి వేశారు, కేంద్రానికి రాష్ట్రప్రభుత్వాలు కీలు బోమ్మలుగా తయారయ్యాయి. పన్నులు ధరలు పెంచి దారిద్ర్యాన్ని సృష్టించి ప్రజల ప్రాణాలతో కేంద్రం చెలగాట మాడుతుంది. ఈ అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా నిలిచిన ప్రజలను పోలీసు, సైనిక బలాలతో అణచివేస్తున్నారు. దీనితో ఆయా జాతులు తమకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కావాలని, కాశ్మీరుకు మాత్రమే అన్వయించిన 370 అధికరణను అన్ని రాష్ట్రాలకు వర్తింపజేయాలని ఉద్యమాలు సాగుతున్నాయి. వీటన్నింటిని కప్పి పుచ్చుకోవడానికే "భారత మిశ్రమజాతి దేశసమైఖ్యత వగైరా నినాదాంతో ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారు. దీనికి తోడు కులాల పేరు మీదుగా జాతిస్పందన లేకుండా చేశారు. "భారతదేశం" ఒక దేశంకాదు యిది అనేక దేశాలు గల ఉపఖండం. ప్రపంచ భూగోళ శాస్త్రవేత్తలు యిది గమనించే భారతఉపఖండమని ఏనాడో నామకరణంచేశారు. ఈనాడు యూగోస్లావియా, సోవియట్ రష్యాల జాతుల పోరాటాల నుండి పాఠాలు తీయాలి.

భారతజాతి, పేరుతో జాతుల ప్రత్యేకతను. విశిష్టతను మంటగలిపారు. కులానికి, మతానికి, వృత్తికి, ప్రాంతానికి, సంస్కృతికి, తెగకి, అటువిక, అనాగరిక తండాలకు అన్నింటికి 'జాతి' అనేపదం వాడటం పరిపాటయింది. జాతి పదానికి నిర్వచనం లేకుండా చేశారు. "భారతజాతుల" సమ్మేళన, సమైఖ్యత అనడానికి బదులు "భారతజాతి" సమ్మేళన అంటున్నారు. ఈ రకంగా గందరగోళం చేసి ప్రజలను జఢప్రాయులు గా మార్చివేశారు. ఇంగ్లీషు భాషలో "నేషన్" అనే పదం యిక్కడ ప్రతిజాతికి వర్తిస్తుంది. జాతులు స్థిరమైనవి.

ఒకదానితో మరొకటి కలసిపోలేని ప్రత్యేకత గల్గినవి. జాతుల సమగ్రతా లక్షణాలు విశిష్టమైనవి, శక్తివంతమైనవి, ఇది గమనించే కులవ్యవస్థను సృష్టించి 'జాతి' సమైక్యతకు చిచ్చుపెట్టారు. కుల నిర్మూలన జరగకుండా ఏ జాతిసమగ్రతను, సమైఖ్యతని కాపాడుకోలేదు.

భారత ఉపఖండానికి మొత్తంగా ఒకేరకమైన ఆర్థిక జీవన పరిస్థితులు లేవు. ఒకేజాతిలో ఒకేరకమైన ఆర్థిక సామాజిక, సంస్కృతిపరిస్థితుల లక్షణాలు మిళితమై వుంటాయి. అందుచేతనే ఇండియాలోని దళితులందరిని డా॥అంబేద్కర్ ఎంత కృషిచేసినా ఏకం చేయలేకపోయారు. ఒకజాతిలో ఉన్న కులాలవర్గీకరణ, లక్షణాలు సాంప్రదాయలు మరోజాతిలో భిన్నంగా వున్నాయి. గనుక ఏజాతికాజాతే తన ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని ఏకీకరణ కావాలి. భారత ఉపఖండం మొత్తంగా దళితుల సమాఖ్య ఏర్పడవచ్చు.

ఈ పరిస్థితులలో చూచినపుడు తెలుగు గడ్డ మీద ఆది నుండి ప్రధానంగా వున్నజాతి నాగజాతి. ఈ నాడు ఏసి,ఎస్సీ,ఎస్టిలు,గా మన్న వారంతా నాగజాతీయులేనని మరో సారి చెప్పక తప్పదు. నాగజాతి ప్రాచీనజాతి, ఒక విశిష్టత, ప్రత్యేకత గలజాతి. తెలుగు గడ్డనుండే యితర ప్రాంతాలకు విస్తరించినజాతి. తుంగభద్ర, నదీలోయ ప్రథమ నాగరికత, నాగుల మహోన్నత సృష్టి, ఇది నాగుల జీవన సంస్కృతికి ప్రతీక. నాగుల నగరనిర్మాణాల నుండే "నాగరికత" అనే పదం పుట్టుకొచ్చింది. గనుక తెలుగు గడ్డపైనున్న శూద్ర-నిమ్నకులాలు నాగజాతీయులే, వీరి జీవనసంస్కృతీ విధానాలకు అగ్రకులాల వారి విధానాలు పూర్తిగా భిన్నం. గనుక నేడు ఊరూపేరూ లేకుండా వున్న ఈ దళితులంతా నాగులుగా నమోదుకావాలి. నాగజాతి స్పందనతో కులనిర్మూలన సాధించాలి. వీటికి ఆధారంగా గతనాగుల చరిత్రలన్నీ వెలికి తీసి ప్రచారంలో పెట్టాలి. నాడు రాజ్యాలు ఏలిన నాగులు ఈనాడు అంటురానివారుగా బానిసలుగా ఎందుకు జీవిస్తున్నారో విశద పర్చాలి.

ప్రజాస్వామ్యం, సోషలిజం జాతి పరంగానే సాగాలి. ఒకభాషా జాతిదేశం మాత్రమే ప్రజాస్వామాన్ని పరిరక్షించ గలదు. జాతిపరంగానే పురోగమించాలి భారత ఉపఖండంలోని స్వచ్ఛంద జాతుల యూనియన్ ఏర్పడాలి. అపుడేస్వదేశీ,విదేశీగుత్తసంస్థల దోపిడీనుండి, అణచివేత నుండి తెలుగుజాతి ముక్తికాగలదు. దీనికై నాగజాతిని సమైఖ్యపర్చి సమీకరించి ఉద్యమిద్దాం.

**జై నాగజాతి**

## అనుబంధం—1

# ప్రాచీన ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర

### 1, నాగదేశములోని భాషలు

ఆంధ్రదేశములోని కొంతభాగమునకు, అనగాకృష్ణవేణి ప్రాంతదేశముకు బుద్ధిని కాలమున "నాగభూమియని, మంజీరదేశమని, వజ్రదేశమని పేరున్నట్లు బౌద్ధ వాఙ్మయనుబట్టి ఎఱుంగవచ్చును. ఆర్యులురాక పూర్వము ఈ ప్రాంత మంతయు "అనార్యులు లేక ద్రావిడుల" చేత ఆక్రమింపబడి యుండెను. వీరు బహుళ సర్పపూజ చేయుచుండటచేత కాబోలు, నాగులనికూడా పేర్కొన బడుచుండిరి. ఆ కాలమున వారు మాటాడుభాష 'దేశి' యనబడుచుండెనని ఊహించవచ్చును ఇదియే తెలుగుభాష. ఈ భాషను వాడుటచేతనో, లేక యితర కారణయులచేతనొ తరువాత కాలములో దీనిని 'తెలుగుదేశమని' తెనుగుదేశమని, త్రిలింగయని' పిల్వసాగిరి. తెలుగు, కన్నడము, మళయాళము, తమిళము అనునవి దక్కనులో "అనార్యులు లేక ద్రావిడులు" మాట్లాడుపరివారములోనివి. ఈ నాలుగు భాషలు మాట్లాడువారు క్రీ.పూ. 7వ శతాబ్దినాటికి దక్షిణాపథము నాక్రమించునట్లు కాన్పించుచున్నది. ఆర్యులు రాకపూర్వమే ''మొహంజదారోలో'' ద్రావిడ భాషలుకాన్పించినవి.

క్రీ.పూ. 7వ శతాబ్దినాటి ఒక ఆగస్త్యఋషి 18 మంది రాజకుటుంబీకులతో 18 లక్షల జనులతో వింధ్యదాటి దక్షిణా పథమునకు వచ్చెనని, తమిళగ్రంథములు పేర్కొనుటచేత, అప్పటికి ద్రావిడులు, అటవిక జనులు దండకారణ్యమును ఛేదించి, నివాసయోగ్యమైన గ్రామములు, పురములు నిర్మించుకొనిరని, వారివారి భాషల మాటాడుకొనుచుండరని చెప్పవచ్చును. ఉత్తరదేశము నుండి కొందరు వర్తక సంఘముల వారు బుద్ధుని కాలంలో (క్రీ॥ పూ॥ 557-177) దక్షిణాపథమునకు వచ్చిరి. దక్షిణాపథరాజు వారిని, మీ రాజెవడు ? అని అడుగగా ''స్వామి ! మాదేశమున కొన్ని గణరాజ్యములు, కొన్ని రాచరికములు" అని ఆ బిడారిసంఘము చెప్పెను. ఈ విధముగా ఆర్యవర్తమునకు, దక్షిణాపథమునకు రాకపోకలు జరుగుచుండెను. బుద్ధునికాలములో "దక్షిణాపథము" అనుపేరు ఈ క్రింద దేశములకు చెల్లుబడియగుచుండెనని ''మజుందారు" అను చరిత్రకారుడు వ్రాసినది కొంత సత్యముగానున్నది. "పడమట నాసికనుండి తూర్పున గంజామునకు, దక్షిణమున కన్యాకుమారి వరకు అనగా బీరారు, తెలంగాణా, మహారాష్ట్ర, కొంకణ లేక హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు రాష్ట్రములతోసహా దక్షిణాపథమును పేర బరగుచుండెను. ఇంచుమించుగా ''నర్మదా, మహానది"

దక్షిణ భాగమునున్న పీఠభూమి మొత్తమంతయు దక్షిణాపథమని చెప్పవచ్చును. (Majumdar in 'Cunningham's Ancient Geography of India-P14) ఇంకను "ధర్మామృతము" అమ నయసేనాచార్యుని జైనగ్రంథమునుబట్టి (క్రీ॥శ॥1112) దండకారణ్యము చేదింపబడిన తర్వాత ఏర్పడ్డ దేశముల, పురములపేర్లు,-చోళ, చేర, పాండ్య, కళింగ, వేంగి, ప్రతిపాలపురము, శ్రీ పర్వతము, సిద్ధపటము, అమరావతి, మున్నగునునవి తెలియుచున్నవి. భట్టిప్రోలు శాసనము (క్రీ॥పూ॥ 3వ శతాబ్దము)లోని 'కుబీరక' ధనదుడే కావచ్చునని, ఈయన పేరుతోనే ధనమపురము.. (చందవోలు) ధనకటకము (ధరణికోట) ఏర్పడియుండవచ్చునను విద్వాంసుల ఊహ సత్యమేకావచ్చును *ధర్మాశోకుడను" నాగరాజు వజ్రాలదిన్నెకడ ఒక దేవాలయము నిర్మించుచుండెనని సింహళ దేశచరిత్రలు తెల్పుచుండటచేత ఇదియే అమరావతి స్థూపమను. విద్వాంసుల ఊహ సత్యముగానేయున్నది. కనుక అశోకమహారాజు కాలమునాటికి ధనకటక ప్రాంతమును పాలించువారు "నాగరాజులని" మనము తెలిసికొనవచ్చును. పరీక్షిత్తునొక నాగరాజు చంపియుండెనని జనమేజయుడు తలపెట్టిన సర్పయాగము నాగులవధయని, ఈ బాధపడలేక "నాగులు" దక్షిణావధమునకు వచ్చిరని, ఊహించవచ్చును. కనుక నాగరాజుల కాలము వరకు అనగా క్రీ॥పూ॥ 7వ శతాబ్దినుండి క్రీ॥శ॥ 3వ శతాబ్దము వరకు నాగదేశములో వారిభాషయగు "దేశిభాష" లేక తెలుగు వ్యాప్తిలోగలదని చెప్పవచ్చును. కాని దేశీభాషలోని శాసనములుకాని, సాహిత్యముగాని కాన్పించవు. ఆంధ్ర శాతవాహన రాజులకుముందు నాగదేశములో వాడబడినభాష, దేశీభాష (Local dialect)గా గాన్పించినది. అశోకమహా రాజు కాలములోని రాజభాష. "పాళీ" కాన ఆ భాషలోనే అయన ఆసేతు హిమాచలము శాసనములు చెక్కించెను. ('The earliest form of prakrit preserved is called Pali) క్రీ॥ పూర్వం 3వ శతాబ్దిలోని భట్టిప్రోలు శాసనము ప్రాకృత భాషలోనున్నది. ఈ భాష కూడా ఒక విధముగా అపభ్రంశముగా (Decadent speech)గాన్పించినది. కనుక అశోకుని శాసనములు కొన్ని ప్రాకృతములోను కొన్ని పాళిలోనున్నవి. పాళీలోనే బౌద్ధుల గ్రంథములు వ్రాయబడినవి. తరువాత వచ్చిన శాతవాహన రాజుల కాలమునాటి అమరావతి, నాగార్జునకొండ. జగ్గయ్యపేట, ఘంటశాల" అను ప్రదేశములలోని ఐదు శాసనములు ప్రాకృత భాషలోనున్నవి. (Epigraphica Langavise)

(ఇతిహాస పరిశోధకమాల సంపుటి-3, నెం. 30, 31, 28)

Written by : Kadali Lakshminarayana, B.A.

# మను స్మృతిలో మచ్చుకు కొన్ని

బ్రాహ్మణులు చేసే పూజారి వృత్తిని, యజ్ఞయాగాలను ఇతరకులాల వారు చేయరాదు. ఒకవేళ ఇతరులు పూజారి వృత్తిని చేసినప్పటికి వారు బ్రాహ్మణులు కాలేరు. మను ధర్మశాస్త్రం 10శ్లో॥ 73

ఒకవేళ బ్రాహ్మణులు శూద్రులు చేసే వృత్తిని చేసినప్పటికి వారు శూద్రులుగా పిలవబడరు బ్రాహ్మణులు పెద్దకులానికు సంబందించినవారుగా పిలువబడతారు మను 10 శ్లో॥ 73

ఒకవేళ క్షత్రియులుకూడ బ్రాహ్మణులను గౌరవించకపోతూ వారి పూజారులను గౌరవించకపోతే అలాంటి క్షత్రియులు శూద్రులుగా పరిగణించబడతారు మను 100 శ్లో॥43

ఏదైన క్రొత్త వస్తువును మొదట ఉపయోగించేది బ్రాహ్మణుడు. వారు ఉపయోగించిన తర్వాతే, పాతదిగా మారిన తర్వాతనే ఇతరులు దానిని పొందాలి. పెళ్లి అయిన క్రొత్త వధూవును బ్రాహ్మణులచే శోభనం చేయించాలి. శూద్రులు **పాత**బట్టలు ధరించాలి గాని క్రొత్త బట్టలు ధరించరాదు. మను 8 శ్లో ॥ 125

బ్రాహ్మణుల అదుపు-ఆజ్ఞలలో పనిచేపేటట్లుగా క్షత్రియరాజా చూడాలి. ఇలా బ్రాహ్మణుల అదుపు-అజ్ఞలలో ఉండని శూద్రులను రాజు కఠినంగా శిక్షించాలి. మను 10 శ్లో॥232

ఒక బ్రాహ్మణుడు శూద్రునిచే పనిచేయించుకోవచ్చు. వారికిఇష్టంవుంటే ప్రతిఫలం ఇవ్వవచ్చు-ఇవ్వకపోవచ్చు. శూద్రులు పుట్టింది బాహ్మణులకు సేవచే యటానికే. మను8-431

ఆర్యకులాలకు సేవచేయటమె శూద్రుని భాద్యత. అతని విధి యజ్ఞ-యాగాలకు ఉపయోగించని శూద్రుల ఆస్తిని బ్రాహ్మణులు బలవంతంగా తీసు కోవచ్చును. దొంగిలించవచ్చును. మను 7 శ్లో॥248

శూద్రుల సంపదను బలవంతంగా దొంగిలించవచ్చును. దానికి శూద్రుల అనుమతి అవసరంలేదు. మను -1శ్లో॥13

శూద్రులు ఎక్కువ సంపాదించటానికి అవకాశం ఉన్నప్పటికి ఎక్కువ సంపాదించరాదు. శూద్రులు తమ కుటుంబపోషణకు ఎంత అవసరమో అంత వరకే సంపాదించుకోవాలి. అవసరానికి మించి సంపాదించితే బ్రాహ్మణుల ఆగ్రహానికి, ద్వేషాన్యానికి గురౌతారు. మను 10శ్లో27

బ్రాహ్మణుల్ని పేరుపెట్టి తిట్టిన, బెదిరించిన అట్టి శూద్రున్ని ఎర్రగా కాల్చిన ఇనుపకడ్డి నోటిలోపెట్టి కాల్చాలి. మను 8శ్లో॥ 27

శూద్రులు బ్రాహ్మణులను పని చేయమని ఆజ్ఞాపించినట్లయితే ఆశూద్రుల చెవులలో. నోటిలో కాగిన నూనెను పోయాలి. మను 8శ్లో॥ 27

బ్రాహ్మణుల కాళ్ళపైనగాని, మెడపైన, నెత్తిపైనగాని శూద్రులు కొట్టి నట్లయితే అట్టి శూద్రుల చేతులను నరికివేయాలి. మను 8శ్లో॥ 28

శూద్రుడు బ్రాహ్మణునితో సమానంగా కూర్చున్నట్లయితే అట్టి శూద్రుని పిర్రలను కోయాలి. వానిని ఆ గ్రామం నుండి వెళ్ళగొట్టాలి. మను 8శ్లో॥ 28

బ్రాహ్మణులకు సంబంధించిన ఏ వస్తువునైన చెప్పకుండా తీసుకున్నట్లయితే అట్టి శూద్రులను హింసించాలి, చంపాలి. మను 9శ్లో॥ 24

శూద్రులు తమ కులవృత్తిని వదిలి ఇతరుల వృత్తిని చేయపూనుకొన్నట్లయితే అట్టివాని ఆస్తిని స్వాధీనం చేసుకొని వానిని శిక్షించాలి. మను 10శ్లో॥ 9

బ్రాహ్మణేతర కులాల వారెవరైన బ్రాహ్మణుని భార్యతో సంభోగించినట్లయితే అతనిని చనిపోయేవరకు కొట్టాలి. మను 8శ్లో॥ 35

బానిసలుగా పడివుండటానికి తప్ప మరేపనిలేని దేశమె బ్రాహ్మణులు వుండటానికి అది సరైన దేశం. మను 2శ్లో॥2

శూద్రులు పరిపాలించేచోట బ్రాహ్మణులు అక్కడ నివసించరాదు. చండాలురు నివసించే చోటికి దగ్గరగా బ్రాహ్మణులు నివసించరాదు.

Chapt 4-8-6

ప్రతిరోజు ఉదయం లేవగానే రాజు వేదశాస్త్ర పండితులను, బ్రాహ్మణులను కలుసుకోవాలి. వారి కోర్కెలను తీర్చుతూ వారు చెప్పినట్లు పరిపాలన చేయాలి. 7శ్లో॥ 2

అనాటి "సంకర" సంతానాన్ని నాటి ధర్మశాస్త్రవేత్తలు ఈ క్రింది విధంగా వర్గీకరించారు.

బ్రాహ్మడికి-శూద్ర స్త్రీకి పుట్టినవాడు దాసుడు
(పరాశరస్మృతి 11 అధ్యాయం)

బ్రాహ్మడికి-శూద్రస్త్రీ ద్వారా పుట్టినవాడు నిషాదుడు
(మను స్మృతి 10 అధ్యాయం)

క్షత్రియుడికి-శూద్రస్త్రీ ద్వారా పుట్టినవాడు ఉగ్రుడు
(అమరం శూద్ర వర్గం)

క్షత్రియుడికి-శూద్రస్త్రీ ద్వారా పుట్టినవాడు ఉగ్రుడు
(మనువు 10 అధ్యాయం)

క్షత్రియుడికి-శూద్రస్త్రీ ద్వారా వుట్టినవాడు గోపాలుడు
(పరాశర స్మృతి 10 అధ్యాయం)

బ్రాహ్మడికి-వైశ్యస్త్రీ ద్వారా పుట్టినవాడు అంబష్టుడు (మను స్మృతి)

శూద్రుడికి-వైశ్యస్త్రీకి పుట్టినవాడు వైదేహకుడు (అమరం)

బ్రాహ్మడికి-వైశ్యస్త్రీకి పుట్టినవాడు ఆర్ధసేరి (పరాశరం)

వైశ్యునికి-శూద్రస్త్రీ ద్వారా పుట్టినవాడు క్షత్త (మనుస్మృతి)

బ్రాహ్మడికి - క్షత్రియస్త్రీకి పుట్టినవాడు మూర్ధారసిక్తుడు (మనుస్మృతి)

వైశ్యునికి–శూద్రస్త్రీ ద్వారా పుట్టినవాడు కరణుడు (మను)

బ్రాహ్మణునికి-క్షత్రియస్త్రీ ద్వారా పుట్టినవాడు వైశ్యుడు (విజ్ఞానేశ్వరీయం)

**సి. వి. "వర్ణవ్యవస్థనుండి".**

**(16)**

క్రీ. పూ. 187 నుండి క్రీ. పూ. 75 వరకూ పాలించిన శుంగులు
బ్రాహ్మణులు

క్రీ. పూ. 75 నుండి క్రీ. పూ, 30 వరకూ పాలించిన కణ్వులు
బ్రాహ్మణులు

పూ 225 నుండి క్రీ. పూ. 255 వరకూ పాలించిన శాతవాహనులు
బ్రాహ్మణులు

క్రీ. శ. 225 నుండి క్రీ. శ. 270 వరకూ పాలించిన బృహత్పాలనులు
బ్రాహ్మణులు

క్రీ. శ. 295 నుండి క్రీ. శ. 324 వరకూ పాలించిన ఆనందగోత్రీకులు
బ్రాహ్మణులు

క్రీ, శ. 300 నుండి క్రీ. శ. 420 వరకూ పాలించిన శాలంకాయనులు
బ్రాహ్మణులు

క్రీ. శ. 420 నుండి క్రీ. శ. 611 వరకూ పాలించిన విష్ణుకుండినులు
బ్రాహ్మణులు

క్రీ. శ. 340 నుండి క్రీ. శ. 450 వరకు పారించిన కదంబులు
బ్రాహ్మణులు

క్రి. శ, 250 నుండి క్రీ. శ. 630 వరకూ పాలించిన పల్లవులు
బ్రాహ్మణులు

## వర్మ - శర్మ

| | | | |
|---|---|---|---|
| బృహత్పరాయన | వంశ స్థాపకుని | పేరు | — జయవర్మ |
| ఆనందగోత్రిక | ,, | ,, | — ధామోదరవర్మ |
| శాలంకాయన | ,, | ,, | — విజయదేవరవర్మ |
| విష్ణుకుండిన | ,, | ,, | — మాధవ వర్మ |
| పల్లవరాజు | ,, | ,, | — విరకూర్చవర్మ |
| కదంబ రాజ వంశం | | ,, | — మయూరశర్మ |

సి.వి. వర్ణవ్యవస్థనుండి.

# శూద్రులపై మనువు విధించిన ఆంక్షలు - శిక్షలు

శూద్రుడు పరిపాలకుడుగా నున్న దేశంలో బ్రాహ్మణ, క్షత్రియ వర్గాల వారు నివశించరాదు.

శూద్రుడు గౌరవప్రధమైన వ్యక్తిగా పరిగణించ దగినవాడు కాడు. మను ధర్మశాస్త్రంలో ఈవిధంగా వుంది.

మతపరమైన క్రతువులు చేసేందుకోసం బ్రాహ్మణుడు ఎన్నడూ శూద్రుని ఆస్తినుండి యాచించ కూడదు. శూద్రుడితో అన్నివిధాలైన వివాహ సంబంధాలు నిషేధించబడినాయి. పైన పేర్కొన్న (బాహ్మణ, క్షత్రియ, వైశ్య) ఏవర్గానికి చెందిన స్త్రీతోనయినా శూద్రుడి వివాహం నిషిద్ధం. అగ్ర వర్ణాలకు చెందిన స్త్రీతో శూద్రుడికి ఏవిధమైన సంబంధం ఉండరాదు. అగ్ర కులానికి చెందిన స్త్రీతో శూద్రుడు వ్యభిచరిస్తే అతనికి ఉరిశిక్ష విధించ వచ్చు. అగ్ర కులానికి చెందిన స్త్రీ (ఆమె ఒకరి సంరక్షణలో వున్నా అనాధయైనా) తో లైంగిక సంపర్కం జరిపిన శూద్రుడిని దిగువ పేర్కొన్న విధంగా శిక్షించాలి.

ఆమె సంరక్షణ లేనిదైతే ఆతడు తన అంగాన్ని కోల్పోవును. ఆమె సంరక్షణ ఉన్న స్త్రీ అయితే అతనిని చంపివేయాలి. అతని ఆస్తిని స్వాధీనం చేసుకోవాలి.

పదవులు, అధికారానికి సంబంధించి మనువు ఈవిధంగా నిబంధనలు విధించాడు.

బ్రాహ్మణుడుగా పుట్టినవ్యక్తి వేదాలలో పేర్కొన్న విధంగా విద్యనార్జించక పోయినప్పటికి ఇతర కర్మలు చేయకపోయినప్పటికి, రాజు కోరికననుసరించి ఆయన చట్టానికి వ్యాఖ్యానం చెప్పవచ్చు, అంటే న్యాయ న్యాయమూర్తిగా వ్యవహరించ వచ్చు. శూద్రుడు మాత్రం ఎప్పుడూ ఆవిధంగా చేయకూడదు. (అతడు ఎంతటి పండితుడైనాసరే.)

శూద్రుడు ధర్మశాస్త్రాలకు వ్యాఖ్యానం చెబుతూవుంటే చూస్తూకూర్చునే రాజుయొక్క రాజ్యం ఊబిలో దున్నలా కూరుకు పోతుంది.

ఎవడైనా శూద్రుడు తలబిరుసుగా బ్రాహ్మణులకు మతం గురించి బోధించే ప్రయత్నం చేస్తే రాజు అతని నోటిలోను, చెవులలోను సలసల కాగుతున్న నూనె పోయాలి.

విజ్ఞాన సముపార్జనకు సంబంధించిన విషయాలలో మనువు దిగువ విధంగా నిర్దేశించాడు.

శూద్ర విద్యార్థులకు విద్యను బోధించేవాడు, శూద్రునివద్ద విద్య నభ్యశించినవాడు ఇద్దరూ శూద్రుడిని ఆహ్వానించి అంగీకరించి నందుకు ఆయావిద్యలలో అనర్హు డవుతారు.

అతడు శూద్రుల సమక్షంలో ఎన్నడూ వేదాలు చదువకూడదు.

మనువు అనంతరం వచ్చిన అతని వారసులు శూద్రులు వేదాలు చదివి నందుకు క్రూరమైన శిక్ష విధించడంలో ఇంకా ముందడుగు వేశారు. ఉదాహరణికి శూద్రుడు వేదాలు చాటుగానైనా సరే విన్నా, వేదాలలోని మాటలను ఉచ్చరించడానికి సాహసించినా అతని నాలుకను రెండుగాజీల్చి, అతని చెవులలో కరిగించిన సీసం పోయాలని కాత్యాయనుడు నిర్దేశించాడు.

శూద్రుల ఆస్థి హక్కుకు సంబంధించి మనువు దిగువ విధంగా నిర్దేశించాడు.

తను సంపాదించగల శక్తికలిగి వున్నప్పుడు తన నిత్యావసరాలకు మించిన సంపదను శూద్రుడు కూడబెట్టకూడదు. ఎందువల్లనంటే సంపదలు కూడబెట్టిన బానిస గర్విష్టి అవుతాడు. అతని అహంకారం, లెక్కలేనితనం కారణంగా బ్రాహ్మణులకు బాధ కలిగిస్తాడు.

ఒక బ్రాహ్మణుడు జీవనభృతిలేని దైన్యస్థితిలో వుంటే అతడు అనుమానించ అవసరం లేకుండా శూద్రుడి వస్తువులు స్వాధీనపర్చుకోవచ్చు.

శూద్రుడికి ఒకే ఒక వృత్తిమాత్రమే వుండాలి. ఇది ఉల్లంఘించటానికి వీలులేని మను ధర్మ సూత్రాలలో ఒకటి.

## మనువు ఈ విధంగా చెబుతాడు

భగవంతుడు ఒకే వృత్తిని శూద్రులకు కేటాయించాడు. అది ఇతర మూడు కులాలకు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య)లొంగి సేవచేయడమే.

ఒక శూద్రుడు బ్రాహ్మణుడికి సేవలు అందిచడం ద్వారా జీవన భృతిని సంపాదించుకోలేని పక్షంలో క్షత్రియులకు సేవచేయాలి లేదా ఒక సంపన్నుడైన వైశ్యునికి సేవచేయడం ద్వారా కూడా తనకు తాను పోషించుకోవచ్చు.

స్వర్గలోకవాసం ప్రాప్తించాలన్నా భూలోకంలో సుఖంగా వుండాలన్నా శూద్రుడు బ్రాహ్మణులకు సేవలు చేయాలి. ఎందుకంటే బ్రాహ్మణునికి సేవలు అందించినవాడు తాను అశించినవన్నీ పొందగలుగుతాడు గావున.

శూద్రుడు బ్రాహ్మణునకు సేవచేయడాన్ని కేవలం అతని యిష్టంపై చేయడానికి మనువు విడిచిపెట్టలేదు. శూద్రుడు బ్రాహ్మణునకు సేవ చేయడానికి నిరాకరించినట్లయితే అతడిని ఏ విధంగా శిక్షించాలో వరుస క్రమంలో నమోదు చేశారు.

బానిసతనం చేసేందుకోసం ప్రత్యేకంగా కొనుగోలు చేసిదాని కొనుగోలు చేయకుండా దాని శూద్రుడిచేత ఒక బ్రాహ్మణుడు బలవంతంగా బానిసత్వపు సేవలు చేయించుకోవచ్చు. ఎందువల్లనంటే అతడు బ్రాహ్మణునికి సేవకుడుగానుండేందుకే శూద్రుడిని భగవంతుడు సృష్టించాడు కాబట్టి.

తమ కుటుంబ ఆస్తి నుండి అతనికి అతని శక్తినిబట్టి, కష్టించి పని చేసే పద్ధతినిబట్టి, అతనిపై ఆధారపడివున్నవాళ్ళ సంఖ్యనుబట్టి శూద్రుడికి తగిన భృతి కేటాయించాలి.

తాను తినగా మిగిలిన అహారాన్ని, పాతబడిన గృహ సామాగ్రిని అతనికి తప్పనిసరిగా యివ్వాలి.

ఇతర వర్గాల వారిపట్ల శూద్రుడు తన మాటలలోను చేతనలోను ప్రవర్తనలోను [illegible]సగా వుండాలంటాడు మనువు.

ఒక ద్విజుడిని పదజాలంలో దూషించినా, తిట్టి అవమానించినా శూద్రుడి నాలుకను కోసివేయాలి ఎందుకంటె అతడు నీచమైన పుట్టుక పుట్టాడు కనుక.

ద్విజులను పేరుపెట్టిగాని, కులం పేరుచెప్పిగాని కఠినమైన మాటలతో దూషిస్తే పది అంగుళాల పొడవుగల ఇనుపమేకు ఎర్రగా కాల్చి వానినోటిలో తొయ్యాలి.

మనువు యింతటితో సంతృప్తి పొందలేదు. శూద్రుల బానిసస్థాయి అతని కులానికి చెందిన పేర్లు, ఇంటి పేర్లు స్పష్టంగా తెలియ చేయాలని శాసించాడు.

బ్రాహ్మణుడి పేరులోని మొదటి భాగం ఏదైనా ఒక శుభాన్ని సూచించేదిగా వుండాలి. క్షత్రియుడి పేరులోని మొదటిభాగం శక్తికి, బలానికి సంబంధించినదై వుండాలికాని, శూద్రుడి పేరు మాత్రం ఏదైనా ఒక నీచమైన విషయాన్ని వ్యక్తీకరించేదిగా వుండాలి.

బ్రాహ్మణుడి పేరులోని రెండవభాగం ఆనందాన్ని సంతోషాన్ని కలిగించే అర్థం వచ్చే పదాలతో వుండాలి. క్షత్రియుడి పేరులోని రెండవభాగం రక్షణ అర్థం వచ్చే పదాలతోను. వైశ్యుల పేరు పెరిగే సంపదను సూచించే పదాలలోనూ వుండాలి. శూద్రుడి పేరు సేవలు అందించేవాడు అనేఅర్థం స్ఫురింపచేయాలి.

(మనుస్మృతిలో శూద్రులు డా॥ అంబేద్కర్ నుండి ఏర్చికూర్చినవి.)

# ఈ రచనకై సంప్రదించిన గ్రంథాలు

1. గణపతి - శ్రీ దేవీప్రసాద్ చటోపాధ్యాయ
2. పంచముల చరిత్రము - శ్రీ జి.యస్.బి సరస్వతీస్వాములు
3. శాలివాహనుడు - శ్రీ నాగెళ్ళ గురుప్రసాదరావు
4. మనుస్మృతిలో శూద్రులు - శ్రీ డా॥ అంబేద్కర్
5. ప్రాచీన భారతదేశంలో వైజ్ఞానిక ప్రగతి - శ్రీ ములక్కామల నాగభూషణం.
6. ఋగ్వేదసహిత అనువాద సమీక్ష - శ్రీ నండూరి ప్రసాదరావు
7. ప్రాచీన భారత సమాజంలో బాని సల స్థితిగతులు - శ్రీ వాల్తెరురూబెన్
8. దళిత్ వాయిస్ - మాసపత్రిక
9. తెలుగుజాతి—జాతీయుత - శ్రీ భూపతి నారాయణమూర్తి
10. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - కంభంపాటి సత్యనారాయణ
11. ఆంధ్రుల ప్రశస్తి - విశ్వనాథ సత్యనారాయణ
12. వర్ణ వ్యవస్థ - సి.వి.
13. కళింగదేశ చరిత్ర - రాళ్ళబండి సుబ్బారావు
14. జాతులు స్వతంత్రంకోరుతున్నాయి - డా॥ మిత్రా
15. ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్
16. ఆంధ్రుల చరిత్రము - చిలుకూరి వీరభద్రరావుగారు
17. ఆంధ్రుల చరిత్ర - ఖండవల్లి బాలేందుశేఖరంగారు
18. ఆంధ్రుల చరిత్ర - పుట్టపర్తి నారాయణాచార్యులు